# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 16-2-1980 సంచిక 8


—* ఈ సంచికలో *—



1—3—1980 సంచికలో కృష్ణపక్షము - ఒక సమీక్ష, శ్రీనాథుని భాష - పదకల్పములు, తెలుగువారి కవితా నిర్వచనాలు - నిరూపణలు, పంప - నన్నయ, భారత రచనా ప్రణాళిక మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.



# సమాలోచన

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము ౩ రాజమహేంద్రవరము 16-2-1980 సంచిక 8


## "ఏటికోళ్లు" - కవితా సమీక్ష


— శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి.


'చతుర కవిత్వ తత్త్వపటు
సంపద యొక్కరి సొమ్ముగాదు, భా
రతిదయ సౌధవార్ధి, కవి
రాజుల మానసముల్ ఘటంబులా
యతిము కొలంది లబ్ధమగు
నయ్యమృతంబు ...'

అంటాడు కనుపర్తి అబ్బయామాత్యుడు.[1] తెలుగు సీమలో కవులకు, కవితా వ్యాసంగానికి లోటులేదు. అయితే సర్వం కషమైన సాహితీ వ్యక్తిత్వం ఉన్నా, పేరు ప్రఖ్యాతులకు అల్లంత దూరాన మిగిలిపోయిన ఉత్తమకవులెందరో ఉన్నారు. అలాంటి వారిలో ఒకరు శ్రీయుతులు డాక్టర్. నారపరాజు శ్రీధరరావుగారు. తెలుగు దేశంలో ప్రకాశం మండలంలోని చీరాల వీరి నివాసస్థలం. వీరు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో చక్కని పండితులు. వ్యాకరణంలో నిష్ణాతులు, ఎన్నెన్నో సత్కృతులకు పుట్టినిల్లు వీరి కవితా హృదయం. శ్రీధరరావుగారి రచన 'ఏటికోళ్ళు.'

మానవుడు బుద్ధిజీవి. సృష్టిలోని తక్కిన ప్రాణులకు లేని హృదయ సంపన్నత, ఆలోచనాశక్తి, మానవుడి సొత్తులు. సృష్టిని, ప్రకృతిని పరిశీలిస్తూ 'ఏమి టీరహస్య మని' దైవాన్ని ప్రశ్నిస్తుంటాడు మానవుడు. 'ఎందుకీ వాదా' లని మథన పడుతుంటాడు. మానవ జీవితానికి సంబంధించిన అనేక అంశాలను గురించిన విపులమైన చర్చావేదిక 'ఏటికోళ్లు' గ్రంథం. ఇందులో 'శతపత్రము.' 'మాకందము' అని రెండు భాగాలున్నాయి. కవి స్వయంగా మనవిచేసికొన్నట్లు దైవానికి నమస్కరిస్తూ తన హృదయాన్ని నివేదిస్తున్నారు. 'ఏటికోళ్లు' అంటే 'నమస్కారములు' అని అర్థం. ఇది దేశీయపదం. కవి, తన దేశీయతాభిమానికి గుర్తుగా గ్రంథానికీపేరు పెట్టాగన్పిస్తుంది. అంతేకాదు, దేశీయమైన ఛందస్సును ఎన్నుకున్నారు. 'శతపత్రము' తేటగీతులతో, ఆటవెలదులతో సరళ సుందరంగా ఉంది. 'బహురుచి నిష్యంద'మైన కందపద్యాలతో 'మాకందము' మధురంగా ఉంది. 'సమస్త మానవజాతికి ఆంధ్రులు ఒక ప్రతీక' అని భావిస్తూ, కవి ఈ గ్రంథాన్ని ఆంధ్రులకు అంకితం చేయడంకూడా వీరి ఆంధ్రతాభిమానాన్ని సూచిస్తోంది. ఈ గ్రంథంలో కవి వెల్లడించిన భావాలన్నీ 'డెంద మనియెడు కాసారమందు మొలచి, నిత్యవృద్ధిని జెందిన సత్యాలు.'

హృదయ స్పందనమే కవితకు ధ్యేయమని, వ్యాకరణశాస్త్రాది విద్యాప్రాభవం 'హృదయము తాకని కవితకు' నిరర్థకమే అవుతుం దని అంటారు వీరు. కవిత్వంలో ఒకబండి కత్తదగిన సరకు' ముఖ్యంకాదని, ఆ రచనల్లో ఒక్కటైనా రసస్పందనం కలిగించేదిగా ఉండా లని వివరిస్తున్నారు. మాత్సర్యం కవితా హృదయానికి మచ్చగా భావించే వీరు శబ్దదోషాలకు ప్రాధాన్య మీయక, అర్థాన్ని, అనుభూతిని అందుకొని ఆనందించగల సహృదయతను మెచ్చుకుంటున్నారు పూర్వులు చేసిన 'కుకవినింద' అహంకార సూచక మని నిరసిస్తున్నారు. ఒకమాట చదివితే 'మఱల మఱల చదువగా మనసుపుట్టే' శైలి కవితకు ప్రాణం. అలాంటి కవిత సహృదయుని గుండెలో పాతుకొంటుం దని వీ రంటున్నారు. కవిత్వంపట్ల వీరికున్న విశిష్టమైన దృక్పథం ప్రశంసనీయంగా, ఆదర్శప్రాయంగా ఉంది.

సాహిత్యానికి అనుభూతి కేంద్రబిందువు. 'అనుభూతుల మాధురికి ఆలోచనల వెలుగును అలికితే కవిత రసాత్మకం' అంటారు సంజీవదేవ్.[1] అలాంటి కవిత 'ఏటికోళ్ళు.' ఇందులోని కవిత్వం ఆత్మాశ్రయం. అయితే, వ్యక్తిచైతన్యాన్ని సంఘశ్రేయస్సుకు అనుగుణంగా రూపొందించారు కవి. 'కష్టపడు వారి

కన్నీటి గాథను, అన్నమున కేడ్చువారల ఆర్తిని విషమని సామాన్యుడి గోడును దైవానికి నివేదిస్తున్నారు. బ్రతుకు తెరువు కరువైన విద్యాధికుల దుస్థితిని, ఆడు పిల్లల పెండ్లిండ్లకై ఆరాటపడే తల్లిదండ్రుల బాధలను, తన కవితలో పేర్కొన్నారు. దిక్కు లేని పిల్లలను, దయనీయమైన స్థితిలో ఉన్న బిచ్చగత్తెను చూసి, కవి హృదయం వేదన చెందుతోంది. 'అల్పుల కెప్పుడైన, న్యాయమను వది సీసృష్టియందు గలదే?' అని దైవాన్ని ప్రశ్నిస్తున్నారు. దీనజనులకు ప్రాతినిధ్యం వహిస్తూ, వారి కష్టాలను, కన్నీళ్ళను, తనరచనలో ప్రతి బింబింప జేసిన తీరు కవి హృదయంలోని సామాజిక నిష్ఠను వెల్లడిస్తోంది.

ఆస్తికత్వము, నాస్తికత్వము అనే వాదాలు పనికిరావని, భగవంతుడీ వాదాలన్నింటికి అతీతుడని, విశ్వవ్యాపకమైన ప్రకృతిశక్తిని గుర్తించడమే 'భక్తి' అని, అది 'భావదాస్యం కా'దని వీరంటున్నారు.'దేవుడే లేడనెడి యిండ్ల వాకడులలో పెరిగినా హృదయకుహర సీమలో చిన్నగంట మ్రోగుతోం' దని మానవ హృదయానికి స్వభావసిద్ధమైన భక్తిభావాన్ని ప్రతీకద్వారా వెల్లడిస్తున్నారు. 'పాలలో వెన్నవలె వస్తుజాలమందు వెలసిన దేవుణ్ణికనుగొనెడు నేర్పు' ఉండాలంటున్నారు. 'నాస్తిక దైత్యుని ఆగడాలను అణిచివేయడానికి నరసింహుడ వైనట్లే, ఆస్తికత్వం పేరుతో అన్యాయాలు సాగిస్తున్న వారికి నాస్తికుడవై గుణపాఠం నేర్పనున్నావా'అని దైవాన్ని ప్రశ్నిస్తున్నారు కవి. మానవాభ్యుదయం కోసం ముందు తరాలలో' 'దేవుని ప్రసక్తియే లేని జీవితమును, జాతి కుల మత రహితమౌ సార్వజనిక సంస్థను' ఆకాంక్షిస్తున్నారు కవి.

'దుడుకు గుణములను పుడమిలోన పాతిపెట్టడమే తన ఆశయమని, 'పుట్టిన దెందుకన్న ఎఱుకవ'లేక 'బ్రతుకు నెట్టడం' తగదని, ప్రతిమానవుడూ జీవిత కరమార్గాన్ని గుర్తించాలని ఆత్మ సంస్కారణాభిలాషను వ్యక్తం చేస్తున్నారు కవి. 'వహ్నిలో శుద్ధిగాను సువర్ణమునకే విలువ, కాబట్టి, ఆత్మ పరిశీలనంతో నడవడిని దిద్దుకోగోరుతున్నారు కవి. 'మంచి చెనగులకల నేతమనసుతో సేవచేస్తు'న్న తనకు 'సర్వమానవ సౌఖ్యమ్ము సంస్మరించు చిత్త పద్మమ్ము'ను ప్రసాదింపుమని ప్రార్థిస్తున్నారు.

'ప్రేమ మయుడవు - ప్రేమ మాస్వరుపీవు'- ఇదే నిజమైతే, మానవులకీ కష్టాలెందుకని దైవాన్ని నిలదీసి ప్రశ్నిస్తున్నారు కవి. ఐహిక సుఖాల మీద మక్కువ మానవుల కష్టాలకు మొట్టమొదటి కారణం. ఎన్నెన్ని జన్మలు తాపత్రయ పడినా'తిరుగలిని ప్రేమతో జామ పరగెగింజ బ్రదుకు'లో మార్పురాదు. అందుకే.' 'బిడ్డగా రాదె? సామి!' అని వేడికోలు.హృద్యంగా ఉన్న దీ పోలిక.

సర్వాంతర్యామిని తన హృదయేశ్వరునిగా భావించి, అతని ప్రేమకై పరతపించే మధురభక్తి వీరిది. 'ప్రేమ యిరువైపుల స్రవించు పెద్దయేఱు - ప్రేమ కిద్దరు లేనిది పెరుగబోదు' దని ప్రేమతత్త్వాన్ని నిరూపిస్తూ, 'ఒకడ వీవైన నొకడ నే నుందు'నని దైవానికి నివేదించుడంలోను, భగవద్భావనకు దూరమై 'విరహజీవితము గడప వేగుచున్న' తనను ఆదుకొమ్మని ప్రార్థించడంలోను, పరిణత హృదయంతో కూడిన పరమ భాగవత సంప్రదాయం కన్పిస్తోంది.

కులమతాలను గురించి వీరికి కొన్ని స్పష్టమైన అభిప్రాయా లున్నాయి. మతిమాధ్యం పనికిరాదని, దేవుడొక్కడే అని చెప్పే మతం కావాలంటారు కవి. మతంపేరుతో దారుణ మారణ హోమాలు జరగడంకంటె మతం లేకుండా మానవులు మహాత్ములై మెలగడం మంచిదంటారు వీరు. కులమత ప్రాతిపదికపై ఉద్యోగాలిచ్చే పద్ధతిని సమర్థించే వారికి 'క్షుత్పిపాసలు మానవ కోటి కెల్ల సహజ'మని గుర్తు చేస్తున్నారు కవి. కులం కారణంగా నిజమైన నిరుపేదలను నిర్లక్ష్యం చేయడాన్ని నిర్భయంగా విమర్శిస్తున్నారు. 'ఉన్నవారును, లేనివారన్న రెండు, కులములే యెల్లయెడలను వెలయు' కాలము ముందు ముందు రాగల దని హెచ్చరిస్తున్నారు. 'భువిపై గల మానవాళికొక్కటే కులం' కాగల దన్న ఆశాభావాన్ని వ్యక్తీకరిస్తున్నారు.

మనస్సును గురించి కవి చాల నిశితమైన పరిశీలనం చేశారు. 'మన సాక పరిధిని దాటిన ఘనసంకటకారి, అవుతుందని,' చేసిన చేతల కెల్లను మాసిన మనసే' కారణమైనపుడు 'తనువును ముద్దగ చేసి' విధించే శిక్షవలన మనసు మారదని అంటున్నారు వీరు. ధర్మశాస్త్రాలు, నీతులు తనకు తెలిసినా, మానవుడు ఆచరణలో అసమర్థుడవుతున్నాడు. మనస్సు 'పంకేజాతిము కదా!' నైజగుణాన్ని విడిచి పెట్టలేక పోతోంది.' అంటున్నారు. ఇంద్రియాలు, మనస్సనే ధనికుని వెంట నడిచే సేవకులని, 'మనసే కైవసమైతే' ఇంద్రియాలను జయించవచ్చునని వివరిస్తున్నారు.

వృత్తిరీత్యా వీరు వైద్యులు. మనః ప్రవృత్తిచేత విశ్వశక్తిని గుర్తించిన తాత్త్వికులు. అందుకే 'గుండెలు మార్చిన మాత్రపు, పిండమ్ములు మార్చినన్ లభించునె అమరా, ఖండమ్మగు జీవితమ్ము?' అని ప్రశ్నిస్తున్నారు. అంతమాత్రాన నిష్క్రియత్వానికి లోబడిన నీరస వేదాంత ధోరణి కాదు వీరిది. నిష్కామ సేవ వీరి ఆశయం. 'పేదలను రోగులను గొల్చు విధము జూపు'మని దైవాన్ని ప్రార్థిస్తున్నారు. వృత్తిలో నూనె ఇంకి పోవడం తప్పదు. 'పావు ప్రతియూర్పు కడసారి స్ఫురణ దెచ్చి, హెచ్చరించు,

నన్న వీరిమాటలను అనుక్షణం గుర్తుంచుకోగల్గితే మానవ జీవితం మంచిమార్గాన పయనిస్తుంది.

ఆధ్యాత్మిక సాధన దశలో సర్వాంతర్యామి స్వరూపం అస్పష్టంగా గోచరిస్తుంది. తన హృదయం తెలిపే గుసగుసలు, అలికిళ్ళు గమనించి,' తలపులనే పరదాలలో తాండవించే ప్రేమమయుని మనోజ్ఞరూప రేఖావిలాసం' కోసం అన్వేషిస్తున్నారు కవి. మానవుని కోరికలు, సందేహాలు దేవునికి విడ్డూరంగా తోచవచ్చు. అందుకే' మనుజుని దృక్పథ మూనుచు గొనుమా నా భావలహరి' అంటూ విన్నవిస్తున్నారు.

ఈ గ్రంథంలో ప్రధాన విషయం ఆధ్యాత్మిక చింతన. గ్రంథాన్ని ముగించిన మరుక్షణాన కలిగేది ఆధ్యాత్మికానుభూతి. 'నీరు గాలిని నీసిరి నిత్యము కావలసినంత వాడుచు కావరించితి'మను కవి తలంపు,'మాంసమయమైన గుండెలో మలగియున్న శక్తియెందు కడంగునో' చెప్పక సందేహంగానే మిగల్చడము. 'అందమగు దేహ మొకనాడు మందగించి ఎందుకో నిద్రపోవు నదెవరికెరుక?' అని ప్రశ్నించడము - ఇవన్నీ ఆధ్యాత్మిక చింతనను రేకెత్తించేవే, ఈమార్పులు వృద్ధిక్షయాలు, భంగురత్వము. ఎందుకని ఎన్నో ప్రశ్నలను కురిపిస్తున్నారు కవి. వీటికి సమాధానాలను అన్వేషించాలంటే మానవుడు భౌతిక ప్రపంచంనుంచి ఆధ్యాత్మిక ప్రపంచం వైపుకి దృష్టి సారించక తప్పదు.

డా॥ సి. నారాయణరెడ్డి తమసిద్ధాంత గ్రంథంలో ఆంగ్ల సాహిత్యంలోని 'మెటఫిజికల్' కవిత్వాన్ని గురించి పేర్కొన్నారు. పరతత్త్వాన్వేషణకు భౌతిక ప్రపంచాన్ని సాధనంగా స్వీకరిస్తూ, హేతుజిజ్ఞాసతో ప్రశ్నించడం దీని ప్రధాన లక్షణం. హేతుజిజ్ఞాసతో కూడిన ఆధ్యాత్మిక కవిత్వం తెలుగులో దాదాపుగా లేదనే చెప్పాలి. ఆలోటును తీర్చి 'చేదుం బువ్వైన ఆత్మశిక్షణ'ను మధురమైన కవితగా అందిస్తున్నారు డా॥ శ్రీధరరావు గారు. కవిత సార్థకతకు కాలమేకదా! గీటురాయి!' ప్రతిఫలం బేమొ కాలమే పలుకవలయు' నంటూ సెలవు తీసుకుంటున్నారు కవి.

ఎదపొరల్లో దోబూచులాడే తలపులను వెలువరించడానికి కవి పదాలను ప్రయోగిస్తారు. అయితే, హృదిలో మెదిలే భావాలన్నీ శబ్దరూపాన్ని పొందలేవు 'ఎన్నియో భావపుష్పములు జనియించి, వికసించి, రాలి'పోతున్నా, 'సౌరభ్యమున్, వన్నెయున్, నునుపున్ వీడని పద్యాల' వంటి మరికొన్ని భావాలు స్థిరమై, శాశ్వతమై, కావ్య గౌరవాన్ని దక్కించుకుంటాయి. భక్తుని అంతఃకరణంలోని ప్రేమ. కరుణ, సత్యధర్మనిరతి, మొదలైనవి వాడని పూవులే, ఎన్నడూ తావి వీడని పూవులే. అలాంటి పూవులు తెచ్చి భగవంతునికి సమర్పించే భక్తి భావంతో ముగిసింది 'శతపత్రము.'

మొత్తంగా కావ్యంఅంతా ఉత్సాహ జనకంగా ఉంది. పద్యాలన్నీ కమ్మని కవితా గుణంతోనిండి మళ్ళీమళ్ళీ చదవాలన్పించేటట్లున్నాయి. చదివినంతనే నోటికి పట్టువడే రీతిలో పద్యరచన సాగింది. 'వాడుకమాటల స్గానుచు భావము చక్కగ చెప్ప వాడెపో, పోడిమిగల్గు కోవిదుడు.' భాష విషయంలో వీరు పాటించిన సమన్వయపద్ధతి పదిమందికి ఆదర్శప్రాయం. 'కవితా కన్యకు లేనిపోని నగిలన్ గావించుట' మాని' ఇంపవుచిన్నారి అలంతి సొమ్ములను సమర్పించి, ఆత్మానందాన్ని కలిగించారు కవి. 'భూష లెప్పటికి భూష్యంబైన వస్తుప్రధానతి కాటంకము జేయరా' దన్న న్యాయాన్ని పాటించింది వీరి కావ్యకన్య.

భావవ్యక్తీకరణకు అనువైన అలంకారాలను అక్కడక్కడ సముచితంగా, సామర్థ్య వంతంగా వినియోగించుకున్నారు కవి. మానవుడి మంచిచెడుగుల వెనుక దేవుని ప్రేరణ ఉంటుందన్న విషయాన్ని 'ఇంటికాపు ఎలుక లేకయె జీతగాడేమిసేయు వీలుగా దన్న సంగతి బోలు'నని ఉపమాన బలంతో చక్కగా ప్రదర్శిస్తున్నారు. ఒక మంచివాని వలన జగమంతా మంచితనం వ్యాపిస్తుందన్న భావాన్ని 'ఒక దీపకళిక యునికికి, నికటము సర్వమ్ము వెలుగనేర్వదె' అంటూ అర్థాంతరన్యాసం ద్వారా సోపపత్తికంగా నిరూపిస్తున్నారు. 'ఎండిన వక్షస్థలమున, పండిన ఎముకల నిసుంగు బట్టుచు, నడువన్, బెండువడి, అర్ధనగ్నత, పిండానికి అలమ' బిచ్చగత్తెను స్వభావ సుందరంగా వర్ణిస్తూ, దృశ్య సాక్షాత్కారం చేస్తున్నారు. చిత్తకమలము, పంకేజాతము వంటి పదాలను సాభిప్రాయంగా, సందర్భానుసారంగా ప్రయోగించారు కవి. చిత్తపద్మము, కాలవాహిని, భావపుష్పములు వంటి సమస్త పదాలు వీరి రూపక నిర్మాణ నిపుణతను నిరూపిస్తున్నాయి.

చెప్పదలచినవిషయానికి, చెప్పే విధానానికి సమప్రాధాన్య మిచ్చి, రచన సాగించినందున ఎక్కడా కృతకత్వమన్నది లేకుండా అచ్చమైన కైత జాలువారింది. ఈ గ్రంథంలో కవి చేర్చిన అనువాదపు తునకలు సంస్కృతాంగ్ల భాషలలో వీరి కున్న పాటవాన్ని చాటుతూ, వీరి అనువాద చాతుర్యానికి మచ్చుతునకలుగా ఉన్నాయి.

తెలుగుదనం ఉట్టిపడే రచన వీరిది. సందర్భానుసారంగా అక్కడక్కడ జాతీయాలు, నుడికారాలు, సామెతలు వంటివి రచనలో చోటుచేసుకున్నాయి. మనసు బంగారము, మాటబంగారము, దీపముండంగ ఇల్లుదిద్దడం, దుక్కిదున్నక తొలకరి, పూలనమ్మినవీథిలో పుడక అమ్ము

పోవడం, వంటివి ఉదాహరణప్రాయంగా నిలుస్తాయి.

రచనలో సంప్రదాయాన్ని, నవ్యతను, సమన్వయించి నిగ్గుచూపించాలని వీరి అభిప్రాయం. 'క్రొత్త' 'ప్రాత' పదాలను ప్రయోగిస్తూ, ఆ వెంటనే క్రొత్త, పాతపదాలను కూడా ప్రయోగించి క్రొత్తపాతల కలయికను ఉదాహరించారు. అలాగే 'పుట్టుక' అనేపదాన్ని మరోసందర్భంలో 'పుటుక' అని ప్రయోగించి పరిణామ శీల మైన భాషాస్వరూపాన్ని పరోక్షంగా వెల్లడించారు. 'ఇస్తివి', 'వస్తివి' వంటి విరళ మైన ప్రయోగాలను కొన్నింటిని చూపించారు.

ఈనాడు సాహిత్యానికి ఇదమిత్థంగా ప్రమాణాలను నిర్ణయించడం కష్టమై పోయింది. అందుకే 'శిష్టులెవరో తెల్పి, సిద్ధాంతమును దెల్పి, ప్రస్తుతమ్మందు భాషయన్న, తెన్ను దెల్పి, పిదప ఎన్ను డీనా కవితా ప్రవంతిలోన తప్పు' అనే హెచ్చరికతో ముగించారు కవి. సమకాలీన సాహితీ ప్రపంచం పట్ల వీరికున్న సమ్యగవగాహనను, సమగ్ర మైన దృక్పథాన్ని వ్యక్తీకరిస్తోంది వీరు విసిరిన 'సవాల్'.

ఈ విధంగా సర్వాంగీణ మైన వీరి కవితా ప్రతిభ ఈ చిన్న గ్రంథంలోనే విశ్వరూప సందర్శన మిస్తోంది.

'ఒక సైంటిస్టు హేతువాద దృష్టితో వేదాంతానికి సమన్వయం కూర్చిన చక్కటిరాత' అని శ్రీ ఎం. కోదండ రామరెడ్డి ఈ గ్రంథాన్ని వ్యాఖ్యానించారు.4 'జంకు లేని, కవివి నీవు సమాజ బాంధవుడ వీవు' అని శ్రీ తుమ్మల వారు కవినిలా అభినందించారు.5 'ఈ సాహిత్య సృష్టాన్నం వివిధరస ప్రపూర్ణమై బహుజన సంతర్పణం చేయగల దని శ్రీ కాండిన్య పేర్కొన్నారు. 6

ఒక వినూత్న మైన ఆలోచనా దృక్పథాన్ని ప్రసారిస్తున్న ఇలాంటి ఉత్తమ కవితలను అందరూ ప్రోత్సహించాలి. అందువల్ల సాహిత్యం సుసంపన్న మవుతుంది. సాహిత్య రంగంలో ఎవరికి వారు అరలుకట్టుకొని ప్రస్థానించే మహత్త్వం అంతరించి, సౌహార్ద భావంతో సమన్వయ దృక్పథంతో అందరూ కలసి ముందుకు సాగా లని, ఆంధ్రసాహితీ క్షేత్రం మరింత విస్తృతమై, బంగారుపంటలతో విఖ్యాతినందు కోగల దని ఆకాంక్షిస్తూ... సెలవు.

1. 'అనిరుద్ధ చరిత్రము' ప్రథమాశ్వాసము. 9 వ పద్యం.
2. 'సమీక్షా రేఖలు' - వ్యాసం. 'సుకవిత' పుట 17.
3. 'ఆధునికాంధ్ర కవిత్వము' - పుట 434, 435.
4. 'భారతి' మాసపత్రిక. జూన్ 1978. పుట 77.
5. శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారు కవికి వ్రాసిన లేఖ. 12-1-1978.
6. 'మాతృశ్రీ' మాసపత్రిక. ఆగష్టు 79. పుట 27.

—•••—

# "బసవరాజు" వారి గీత పారిజాతపరిమళాలు

- శ్రీ డా. జి. బి. యస్. ఆచార్య, ఎం. ఏ., పి హెచ్. డి.

(గతసంచిక తరువాయి)

కోకిల కంఠాన్ని వినలేక చెవులు మూసుకునే వారు ఎవరూ వుండరు. భావకవితోద్యానంలో కవికోకిలల కంఠాలు తియ్యగా వినిపిస్తుంటాయి. కానీ

'కోయిలా కోయిలా
కూయబోకే ?
గుండెలూ బద్దలూ
చేయబోకే ?
తీయనీ రాగాలు
తీయబోకే !'

అని బసవరాజువారు అభ్యర్థిస్తుంటం మనకు విచిత్రంగానే వుంటుంది. అయినా వారి ఆవేదనకు కారణం ఏమిటో తెలుసుకున్న తరువాత వారి అభ్యర్థన సరయైనదే నని గ్రహించగలుగుతాము.

'చిట్టి నీ జ్ఞాపకం
చేయబోకే !
చితిలో ప్రాణాలు
తీయబోకే !'

అని వేడుకున్నారు. కోయిలను బతిమాలుకున్నారు. ఆ 'చిట్టి' ఎవరో కాదు.

వారి ముద్దులబిడ్డ 'మంగళ ప్రదమ్మ'. అసలు చిట్టికీ, కోయిలకీ, ఏమిటి సంబంధం? అని ఆలోచిస్తే చిట్టి కంఠం, కోయిలకంఠం ఒకటే అని. ప్రస్తుతం చిట్టికంఠం వినపడదు కాబట్టి కోయిలకంఠం వింటే చిట్టి జ్ఞాపకంవచ్చి బాధకలుగుతుం దని అర్థం చేసుకోవచ్చు. కవిగారి గుండెను బ్రద్దలుచేసుకుని బయటకురికిన భావప్రవాహమే అశ్రురాకృతిని దిద్దుకున్నది - కడుపుతీపిని అద్దుకున్నది.

పాశ్చాత్య ప్రభావంతో మన భావకవిత్వంలో 'ఎలిజీ' (స్మృతి) ప్రక్రియ మూడుపాయలూ - ఆరు నదులుగా ప్రవహించింది. ఆత్మస్మృతి, దేశనాయకస్మృతి అనే రెండు కన్నిటి కవితాధారలు భావకవి రెండుకళ్ళనుంచి వెల్లువలై పారాయి. ఆత్మస్మృతిలో మాతృస్మృతి, పితృస్మృతి, సతీస్మృతి, పుత్రిస్మృతి, మిత్రస్మృతి అనే పాయలు అంతర్గర్భితాలై వున్నాయి.

బసవరాజువారి కలంలోనూ, గళంలోనూ ఈస్మృతి ప్రక్రియ ఒక విలక్షణతను సంతరించుకున్నది 'రాళ్ళ' లో కాకపోయినా 'వాని' లో బసవరాజువారికో ప్రత్యేకస్థానం ఏర్పడింది. తరువాతి కవులకు బసవరాజువారి స్మృతి కవితలు ప్రమాణ ప్రదీపికలై ప్రజ్వలించాయి.

'ఎల్లజగముల నేలెడు
తల్లి మాయింట చిట్టి
పిల్లవుగా జన్మింపగ
నుల్లమునన్ గోరి వచ్చి
తమ్మా ఓ లోకమాత !
లెమ్మా నా స్వాగతమ్ము.'

అని పరమానందంతో పొంగిపోయిన కవి గారికి, అంతికాలంలోనే పుత్రికా వియోగం సంభవించింది. కవిగారి విధూ జీవితంలో, 'అమబ్బు ఈమబ్బు ఆకాశమధ్యాన అడ్డుకున్నప్పుడు' చిట్టితల్లి మంగళప్రదమ్మ రూపుదిద్దుకుంది. అంతలోనే కవిగారిని కనికరంలేని కసాయిదేవుడు కత్తిపెట్టి పొడిచాడు – మానని గాయం చేసాడు.

'తపసుగ ర్వాన యే
తప్పు జేశానో, నా
చిట్టి, యీ యెడబాటు
శిక్ష తగిలింది.'

అని హృదయవిదారకంగా విలపించారు.

'మరువలేదే నిన్ను మా కన్నతల్లి'

అని స్మరిస్తూ –

'కోయిల లోకాన వచ్చి కూసిపోయింది
పండొకటి చేతిలో బడి జారిపోయె'

అనే జీవంగల భావంతో స్మృతి సాహిత్యానికి ఉజ్జీవాన్ని కలిగించారు. ఆకాశం చిల్లిపడ్డట్లు వర్షం ఏకధారగా వంధవృష్టి కురిపించగా – క్రూరమైన కాళరాత్రి – ఘోరమైన రుద్రభూమిలో తమ కన్నతల్లి మంగళప్రదమ్మ తడుస్తు వణకుచున్నదని బాధపడుతూ –

'ప్రణయసామ్రాజ్య పట్ట
భద్రుడవై నిద్రాళుల
పరమ కృపాపూర్ణ దృష్టి
పాలించెడు పరమేశా!
రుద్రభూమి నేకాకిగ
నిద్రించెడు మమ్మ గన్న
మంగళప్రదను నిద్రా
భంగ మువవకుండ గాచి
కరుణామృత ధారల నా
కలి దప్పుల బాధ దీర్చి
చల్లనైన జోలపాడి
మెల్లమెల్ల జోకొట్టుము !
ఈసాయము చేయుము నీ
ఋణము దీర్చుకొందు మయ్యా
ఈ జన్మము గాకున్నను
నింకొక జన్మముననైన !'

అని పరమేశ్వరుణ్ణి పరిపరివిధాల ప్రార్థించారు. పరమేశ్వరుని ఋణం తీర్చుకోవటానికి మరో జన్మకైనా ఎత్తడానికి సిద్ధపడిన కవిగారి ఆవేదన ఎంతటిదో స్పష్టమౌతుంది. పిచ్చివాడిలా కనపడ్డ ప్రతివారినీ తమ కన్నబిడ్డను రక్షించవలసిందిగా వేడుకున్నారు.

'ప్రళయకాలం తా భీల నభో
దళిత ఘోర రవముల
జలిపిడుగా! గర్జింపక
నిలిచి నాదు మనవి వినుము !'

అని తమబిడ్డ ఒంటరిగా కటిక నేల రుద్రభూమిలో ఒడలుమరచి నిద్రిస్తున్నదని, ఆనట తనప్రతాపాన్ని చూపవద్దని కోరుకున్నారు. చలిపిడుగు తీవ్రతను దీర్ఘసమాసంలో ధ్వనింపచేసారు. ప్రకృతిలో లీనమైన పాపాయిని ప్రకృతిలోనే చూసుకొని సంతృప్తిపడటం అలవాటు చేసుకున్నారు. అందుకే–

'వికసించి నవ్వేటి నీ పువ్వులలో
చిరునవ్వు నీ మోము చూచి మురిసేను!
వెన్నెలలోక మునద్దు పఱిగిన్న వెనుక
మెత్తన్ని మబ్బుపొత్తిళ్ళలో దాదిగ
జజ్జుని నుంట వుయ్యాల లూగేటి
చంద్రుణ్ణి నీవని పట్ట బొయ్యేను?

అని తమ వెర్రిచేష్టల్ని లోకానికి తెలియజేసారు. కన్నబిడ్డను కోల్పోయి వెర్రి ముర్రి ఆలోచనలతో వెర్రెత్తి పోయిన కవిగారికి లోకమంతా వెర్రిదైనట్లు తోచింది. అంతేకాదు తమబిడ్డను బ్రదికింపజాలని 'సంవత్సరాది' పర్వదినం సైతం వ్యర్థమైనదే అని భావించారు. వెనక 'పెట్టిపుట్టి' బిడ్డను సంపాదించుకున్నప్పటికీ–

'పెట్టి యెవరిని యేమి
తిట్టుకున్నా మొ?
ఇచ్చిన దైవమూ
మరచిపోడాయె?'

అని తాము ఎన్నడో చేసిన నేరానికి ఇప్పుడీ విధంగా శిక్ష జరిగిందని వూహించారు. అసలు పెట్టకపోయినా పరవా లేదుగాని పెట్టి తిట్టడం మాత్రం మహాపాపం అనే నమ్మకం లోకంలో ఒకటుంది. ఆ లోకోక్తినే కవిగారు తమకు అన్వయించుకున్నారు – తాము చెప్పదలుచుకున్న భావానికి దీప్తిని కూర్చుకున్నారు. దైవానికి మతిమరపు గుణం వుంటే ఎంత బాగుండును? కానీ ఇచ్చిన దాన్ని పుచ్చుకోకుండా మానడు. అసలు దైవానికి అదో హక్కు. ఆహక్కును వినియోగించుకోకుండా వుంటాడా, మాయదారి దేవుడు! మనోవ్యథను మిగులుస్తాడు– మనస్తాపాన్ని రగిలిస్తాడు. అయినా మళ్ళీ ఇస్తాడుగా! రూపంలో మార్పుండొచ్చుగానీ 'ఫలం' ఒకటే! అందుకే–

'వాడిన పూవున కేటికి మరలను
పరిమళ మొసగెదు దేవా?
ఎండిపోయినట్టి బావి నూటల
నేటికి నూరించెదు దేవా?
... ... ... ...
అంధకార గర్భ నరక వానికి
నానంద తేజ మేటికి దేవా?'

అని 'నవజీవనము' అనే ఖండికలో భగవంతుని చిద్విలాసాలకు విస్తుపోయారు. కొంతకాలం గడిచింతర్వాత 'దీపావళి' వచ్చింది. మనకందరికీలాగ వుత్తుత్తదీపావళి కాదు. దివ్యదీపావళి. వేదాద్రినరసింహ దేవుడు వారి యింట దీపమైనాడు. పరమాత్ముడు వేంచేసి 'పటమటలంక'[3] లో ఉయ్యాల తొట్టిలో వూగుతున్నాడు. కవిగారు అమాయికుడూ, ఆకాజీవి

కాబట్టే పాపాయిరాకతో, మళ్ళీ బ్రతుకు నవనవానంద బృందావనం అయింది. వేదవృక్షంలా వేదాద్రినీడ తమ వంశ వృక్షం శాశ్వతంగా నిలవాలని ఆశించారు. 'పాపాయి సాక్షాత్తు పరమాత్ముడండి!' అంటూ జేజేలు పలికారు. 'దిన దినము పాపణ్ణి దీవించి పొండీ' అని దేవతల్ని ఆహ్వానించారు.

'వేదాద్రి శిఖరాన వెలిగేటి జ్యోతి
పావురిగుడిసెలో దీపమై వున్నె!
స్వర్గపుద్యానాల వాసించు పూవు
నా మోటు చేతిలో నలిగిపోయేనె?
భూర్భువర్లోకాల బోయేటి పిట్ట
కటిక నా కౌగిట కైదులో వున్నె?
పరమాత్ముడో జగద్వ్యాపి పాపాయి
ఇరుకు నా గుండెలో యిమిడిపోయేనె?'

అని వుపశమనం పొంది, ముట్టుకుంటే ఎక్కడ మాసిపోతాడో అని అతిజాగ్రత్తగా పెంచసాగారు. అసలే ఒకసారి దెబ్బతిన్న హృదయం కదా! అందులోనూ ఇది వంశోద్ధారకుని విషయం. పున్నామ నరకంనుంచి తల్లిదండ్రుల్ని తప్పించే పుత్రుణ్ణి పువ్వుల్లో పెట్టి పెంచుకోవాలని ఎవరికుండదు? కవిగారు పాపాయి సంరక్షణకోసం దేవతల్ని కూడా ఆహ్వానించి ఎంతో కట్టుదిట్టం చేసారు. దయమాలిన మృత్యువుకు ఆ కట్టుదిట్టం ఒక లెక్కా? కవిగారి బ్రతుకు నందనంలోకి మళ్ళీ 'శిశిరం' ప్రవేశించింది. మంగళప్రదమ్మ మరణ దుఃఖం నుంచి తేరుకోకముందే పుత్రవియోగ ప్రవాహంలో మునిగి పోవలసివచ్చింది.

'వేదాద్రి శిఖరాన వెలిగిన్న జ్యోతి
మినుకు మని కాసేపు మనికిపోయింది!
దేవలోకమునుంచి దిగినట్టిగంగ
వచ్చిన్న దారినే పట్టి మళ్ళింది!
పంజరం దూరిన బంగారు పిట్ట
తలుపుదీసేవేపు తర్లిపోయింది!
కాపురమ్మొచ్చిన కన్నపాపాయి
యిల్లుఖాళీచేసి వెళ్ళి పోయాడు![4]

అని పంతధోరణిలో వేదాంతాన్ని వల్లించటం తప్ప వేరే యేమీ చేయలేకపోయారు. పండు అందినట్లే అందిమాయమైందని పలవించారు. 'ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు.' అన్న మామూలు వేదాంతాన్ని స్ఫురింపజేసారు. మామూలు ఇళ్లైతే ఒకళ్లు ఖాళీచేస్తే మరొకళ్లు వచ్చిచేరతారు. కానీ ఈయిల్లు అలాంటిది కాదు. ఒకళ్ళు ఖాళీచేస్తే అలా ఖాళీగావే వుండిపోతుంది. శూన్యమై బిక్కుబిక్కుమంటుంది. అందుకే కవిగారు 'నిలువూన దోచేశావ్ దేవా!' అని బావురుమన్నారు. కోరికలు నెరవేరితే 'నిలువుదోపిడి' సంతోషంగా ఇచ్చేవాళ్ళు, భరించలేని కష్టాలు – ప్రాణనష్టాలు వస్తే ఆ దేవుణ్ణి 'దొంగ' అని తిడతారు. లోకం ఎంతవిచిత్రమైనది? ఈ విచిత్రమైన లోకవృత్తే కవిగారికీ చిత్తప్రవృత్తి అయింది.

కవి లోకాతీతుడు కాదు గదా! కన్నతండ్రిగా నిజజీవితంలో పెద్దలకు ఏమి చేయటానికి అవకాశం లేకపోయినా కావ్యజీవితంలో కరిగిపోని, తరిగిపోని ముద్దూముచ్చట్లు చేసుకున్నారు – చూసుకున్నారు. కన్నతండ్రిగా కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నారు.

తల్లీతండ్రీ తానేఅయి ప్రాణంకన్నా ప్రాణంగా తమను పెంచి పెద్ద చేసిన కన్నతండ్రి ఆత్మకు శాంతికలగాలని కోరుతుంటూ 'పితృస్మృతి' అనే ఖండికను రచించి తమ ఋణం తీర్చుకున్నారు.

'దేశనాయక స్మృతి' లో సి. ఆర్. దాసును, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను స్మరించారు. చిత్తగంజను డన్నను, మన్మథుడన్నను ఇంచుమించు ఒకటే అను దృష్టితో –

'ఊరేగు మన్మథ ఊరేగవోయి
పెండ్లికొడుకూ లాగు
పల్లకీలోయెక్కి ఊరేగు ......'

అని గీతాన్ని రచించారు.

'యమునాస్వాంతము' అనే పేరుతో 'ఆంధ్రరత్న' సంస్మరణకై ఇలా వ్రాసారు.

'ఏలాపాడే వింక యమునా కళ్యాణి, నే
లీలామానవుడు గోపాలుడు లేడాయె?
నేలా ......
ఎంత చించుకొన్న
గొంతు పెగలదాయె
... ... ... ...
ఈనాటి యీనేస్త
మేజన్మకో తిరిగి
కన్నీళ్ళు గారవకె
కడుపు చెరువయ్యేనే.'

గోపాలకృష్ణయ్యగారికి ఇష్టమైన రాగం 'యమునా కళ్యాణి' ని పాటలో పాడగారు. ఆత్మీయతా ఆర్ద్రతల దారి తీయగా 'గొంతు పెగలక' గద్గదస్వరమేర్పడింది. కన్నీళ్ళు గారవకె కడుపు చెరువై పోయింది. 'కడుపు చెరువై పోయింద'నే చక్కని తెలుగు నుడికారంలో ఎంతటి భావతీవ్రత?

'మంటుకొనిపోతున్న వండోయ్! లోకాలు
మంట లార్పేయంగ రండోయ్!

అంటూ ప్రపంచ యుద్ధానికి తల్లడిల్లిపోయి, మనుజమాత్రులార్పలేరీ మంటలను, ప్రళయేశుడే కరుణించి శాంతింపజేయాలని ప్రార్థించారు. ఈ గీతంలో కవిగారి ఆవేదన ఆవేశంతో అగ్రులు చాచింది– అమరుల అభయాన్ని అర్థించింది.

11-11-32 నవంబరు తేదీని ప్రపంచంలో అన్ని దేశాలలోనూ యుద్ధంలో చచ్చినవారనీ, జయించినవారినీ కూడా స్మరించటానికి సభలు చేసారు. ఆరోజు ఢిల్లీరాజధానిలో ఆంగ్లేయులు విజయకోలాహలం చేసారు. ఆవేదనలో కవిగారు కుతుబ్ మినారును చేరుకొని, అచ్చటి చిత్రాన్ని చూచి, తమలో తాము ఎన్నో ప్రశ్నలు వేసుకున్నారు.

ఢిల్లీసామ్రాజ్య మెవరిది? ఇప్పుడు విజయ కోలాహలం చేస్తున్న ఆంగ్లేయులదా? కుతుబ్ మీనారువిజయ స్తంభమును కట్టించిన ముసల్మానులదా? పాండవులకు, అశోక, పృథ్వీరాజాదులకు వారసులైన ఆర్యులదా? ఒక ప్రక్క కుతుబ్ మీనారు, ప్రక్కన అశోక స్తంభము. మరో ప్రక్క మసీదు, ఖిల్లా, ఇంకో ప్రక్కన ఆర్యదేవాలయమూ, గర్గమూ! పాడై రూపుమాసి పోతూవున్న ఈ వుభయ దృశ్యాలపైనీ పరదేశవాసులైన ఆంగ్లేయుల పరిపాలనా!! భావ కవిసమ్రాట్టు నైన నాది కాదా యీఢిల్లీ! అని తర్కించుకొని -

'ఇది మొగల్ దివాణమా!
ప్రళయ శివ మహాశ్మశానమా?
ఇది విజయ స్తంభమా?
చలవిద్యుచ్చంద్ర చూడ దంభమా?
ఇవి జీర్ణసమాధులా?
ప్రమథగణ నివాసవీథులా?
ఇది యవన విలాసమా?
నటేశ తాండవ విలాసమా!

అని 'కుతుబ్ మీనార్' అనే కన్నీటి కవితను బీభత్సరసస్ఫోరకంగా ప్రకటింప జేసారు. గతవైభవాన్ని స్మరించారు. గతవీథుల్లో విహరించారు. దేశభక్తి పద్యానికి గతవైభవస్మరణ మొకదళం కదా!

(సశేషం)

---

3 కృష్ణాజిల్లా విజయవాడదగ్గర పటమట గ్రామంలో మేనమామ లగు గోవిందరాజులవారింట్లో.

4. 'ఈగీతం మా బసవరాజు పాటలన్నింటికీ కిరీటం. తుదపంక్తి ఈ పాటకు తురాయి' - శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి 'బసవరాజు అప్పారావు మధురస్మృతి'

బసవరాజు అప్పారావు గీతాలు. పుట. 9 పునర్ముద్రణ. నవంబరు 1965.

# సాహిత్యము - దాని ప్రభావము

- విద్వాన్ శ్రీ కోమాండూరి రామానుజాచార్యులు, ఎం.ఏ.

సాహిత్య విద్య సకల శాస్త్రార్థ హృద్య. ఇదియొక బ్రహ్మవిద్యయు - రాజవిద్యయును. సకలద్రవ్యములును, పరబ్రహ్మమునందు నిమిడియున్నట్లుగా చతుర్దశవిద్యలు - చతుష్షష్టికళలు. ఈ సాహిత్య విద్యయందు నిమిడియున్నవి. అశేష వేద శాస్త్రసారాత్మకము, శ్రీమద్రామాయణ మని మహర్షి వాల్మీకి ప్రవచించియున్నారు. అట్లే సకలశాస్త్ర సారము మహాభారత మని వ్యాసభగవానులు. భారతమం దున్న విషయములే అఖిలశాస్త్రములం దున్నవి. ఇందులేని వెందును లేవు. ఎందును లేనివియు నిందు కలవనుట నిశ్చయము. 'య దిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్' అని ధర్మతత్త్వజ్ఞులు .... పరగుచుండ జేసె భారతంబు అని వాగనుశాసనులు. ఇది అనుభవైక సాక్షిక మైన - పరమ సత్యము.

అఖిలచేతనాచేతనములకు నంతర్యామిగా బ్రహ్మము ఎట్లు విలసిల్లుచున్నదో అట్లే కావ్యములందు ధ్వని ఆత్మగా భాసిల్లుచున్నది 'ధ్వని రాత్మా కావ్యస్య'

ఈసాహిత్యవిద్యయు ఇతరవిద్యలవలెగాక స్వయమానందరూపమై భావుకోత్తములను పరమానందరస నిమగ్నులను చేయును.

విశ్వశ్రేయస్సును కోరు కావ్యములన్నియు విష్ణ్వంశ కలవి. అతడే పరబ్రహ్మ. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని వేదము. సుబాలోపనిషత్తుకూడ సాహిత్యవిద్యను పరబ్రహ్మస్వరూపముగా ప్రతిపాదించుటచే ఇది బ్రహ్మవిద్యయు నై యున్నది.

అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః। యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే. అపారమగు నీకావ్య ప్రపంచమున నీకవి యొక్కడే బ్రహ్మ. తత్ప్రకాశికవిద్య కావున ఇదియును బ్రహ్మవిద్య యగును. 'యన్నాభిజాతా దరవిందకోశాత్' బ్రహ్మాభి రాసీత్ యత ఏష లోకః। శ్రీమన్నారాయణుని నాభి కమలమునుండి ఆవిర్భవించిన బ్రహ్మకంటెను కవిబ్రహ్మ అత్యధికశక్తి కలవాడు. బ్రహ్మసృష్టి విధివిహిత నియమ సహితమై యుండును. సూర్యచంద్రులు తూర్పుననే ఉదయింతురు. తామరలు నీటిలోనే జనించును. బంగారము పరిమళవిహీనమై యుండును. ప్రాణము పంచభూతాత్మకమైన శరీరమందే యుండును. ఆనియమము నుల్లంఘింప జాలడు. దీనిని కాదని బ్రహ్మ చతుర్ముఖుడయ్యు సృష్టి యొనర్ప జాలడు.

ఇక కవిబ్రహ్మయన్నో తనసంకల్పానుసారముగ సర్వప్రపంచమును పరివర్తన చెందించును. 'భానుః ప్రతీచ్యా ముదియాయ దీప్తః॥ విసృజతి హిమగర్భైరగ్నిమిందు ర్మయూఖైః॥ హసన్తికాయా ముదభూత్కుశేశయం॥' ఇట్లే యతని సృష్టి. ఇంకను 'హేమ్నః పరమామోదః' చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగాత్ రూపోచ్చయేన విధినా మనసా కృతానుః' చిత్తరువులకు ప్రాణములు పోసి లోకోత్తర సౌందర్యరాసులుగా సృష్టిచేయును. కావున నీసాహిత్య విద్య బ్రహ్మవిద్యయు నాయెను. ఇది యొకవిధముగ రాజవిద్యయు నగును. భగవద్రామానుజముని 'విద్యానాం రాజా' యనిరి. ఇది యత్యంత పవిత్రమైనది

రాజు లుత్తమ పరిపాలనముచే ప్రజలను రంజింపఁ జేసినట్లుగా కవులు కాంతా సమ్మితము లగు తన కావ్యములచే భిన్న భిన్న రుచులు కల ప్రకృతులను రంజింపఁ జేయుదురు. కవులు రాజులుతుల్యశీలురుగా వర్ణింపబడినారు మహామనీషి యగు మాఘకవిచే.

క్షణశయిత విబుద్ధాః
కల్పయంత ప్రయోగాః
ఉదధి మహతి రాజ్యే
కావ్యవద్దుర్విగాహే।
గహన మపరరాత్ర
ప్రాప్తనిద్రా ప్రసాదాః
కవయ ఇవ మహీపాః
చింతయంత్యర్థ జాతమ్॥

అని సాధన సముదాయమందు నిరతిశయ సుఖావహమైనదియు అక్షయమైనదియు. అటులనే సాహిత్య విద్యయు కావ్యం యశసేఽర్థకృతే... సద్యః పరనిర్వృతయే అన్నట్లు దేశాంతరమందో కాలాంతరమందో కాక తత్క్షణమే విగళిత వేద్యాంతర బ్రహ్మానందరస సబ్రహ్మచారి రసాస్వాద మందించును.

ఉత్తమ కావ్య రసాస్వాదము సకల కళా ప్రావీణ్యమును నిరతిశయ నిరవధికానందమును నొనగూర్చునని భామహుని బంగారుపలుకు. కావ్యము సాహిత్యము రెండును పర్యాయపదములు. సాహిత్య విద్యా ప్రభావమువలన మయూరునకు కుష్ఠవ్యాధి పోవుటయే గాక! మూకునకు నిరర్గళ మృదుమధుర కవితాస్రవంతియు నావిర్భవించెను. ఇట్లమంగళమును పరిహరించి, మంగళముల నిచ్చును. సాధనారంభమునుండియే నిరతిశయ సుఖముకలిగించు ననుట నిస్సంశయము. సాహిత్య విద్యారసము నొంద రాస్వాదించినను తరుగక పెరుగుచు క్రొంగ్రొత్త చవు లూరించుచుండును కాన నిది యక్షయమైనది.

ఇట్టి సాహిత్య విద్యకు ప్రవర్తకులు ఋతంభర ప్రజ్ఞానిధులగు మహాకవులు. దీనికే కావ్యకళ యనియు పేరుపెట్టిరి. చతుస్సాగర పర్యంతమైన భూమికి – సాగరములకును – ఎల్లలు కలవు. కాని కావ్యకళానిధులగు కవిపుంగవుల ప్రజ్ఞకు అవధులు లేవని 'రాజశేఖరుని వంటి మహాకవు లెందరో పల్కిరి. ఇంకను ఈ విశాలమగు విశ్వమందు అప్రమేయమగు పదార్థ మొక్కటున్నదని చెప్పగలని యున్నచో నది కవిపుంగవుల ప్రజ్ఞ యొక్కటియే – యని ప్రతిజ్ఞ చేసి చెప్పవచ్చును. ఇంకను కావ్యకళ యప్రమేయ తేజశ్శాలిని. నూర్గురు సూర్యు లుదయించి నశింపజేయలేని – అంతరతమస్సును నిర్మూలింపఁ జేయగలశక్తి ఈ కావ్యకళకే కలదు. అందుచే దీనిని 'తేజోమయీవాక్కని ఉపనిషత్తు ప్రవచించినది.

వివిధసూక్తి విచిత్ర మధురవాక్య విన్యాస విలాసములతో విశ్వమును మోహింప చేయుచు–విషయాంతర దర్శనాభిరుచి విముఖత్వము నాపాదించుచు–దిన మొక క్షణముగా తలపించుచు సాహిత్య విద్యామృతకళ సహృదయ హృదయముల నాకర్షించును. ఎంత కఠోర శాస్త్రమైనను – కావ్యామృత కళాభావితమై – మృదుమధుర విధురస నిష్యందియగును. ఇది పరమసత్యము.

అజ్ఞానజన్యమైన సంసార సాగరమును–విద్యా నౌకతో తరించి అమరత్వము పొందవలెనని ఉపనిషత్సూక్తి ముఖ్యముగా ధర్మార్థకామరూప–త్రివర్గము నేకాక – అమృతత్వమును ప్రసాదింపఁగల సాహిత్యవిద్య నుద్దేశించియే,అను విషయమును అభిజ్ఞాన శాకుంతల నాటకాంతమున మహాకవి 'మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవం పరిగత శక్తిరాత్మభూః॥ అని కావ్యవిద్యోపాసనా మహిమచే – వాగర్థ స్వరూపుడైన పరమాత్మ పునర్భవరాహిత్యమును ప్రసాదించుగాక! ఇది పరమార్థ భాషితము. ఇందు సందియ మందనక్కర లేదు. సాహిత్యవిద్య ఇంతటి సర్వోన్నతమైనది. సర్వోత్కృష్టమైనదియు.

సర్వజ్ఞుడగు భగవంతుని గుణములను ప్రస్తుతించిన వేదము – తాను వర్ణించిన ఘనత చాల దని తలచి వైయాకరణియనియో–తార్కికుడనియో–నైయాయికుడనియో– మీమాంసకుడనియో యనక 'అనంత మవ్యయం కవిం, కవిం కవీనాం కవిః' అని వేదాంతజ్ఞాన పూర్ణుడని కాక–కావ్యకళా ప్రపూర్ణుడగు కవి యని సాహిత్య విద్యా సామ్రాజ్య పట్టాభిషిక్తుని చేసి తనపేరు సార్థక పరచికొనినది. వేద మనగా యథార్థమును గుర్తింప చేయునది. కావున కవియనగా సర్వజ్ఞుడని–అతని కర్మ కావ్య మని ఆరాత్సిద్ధము.

మహాతపస్సంపన్నులు – పరమ సాత్వికులునైన కవుల వాఙ్మయము – సత్వగుణ ప్రధానమై యుండుట వల్లనే, త్రికాల సత్యమై– భూత భవిష్యద్వర్తమానములకు సేతువై – సర్వ ప్రపంచమునకు శాశ్వతముగ నిత్యనూతన జీవదర్శనీయమై నిలచియున్నది. రాజస తామస వాఙ్మయము, ఆరిపోవనున్న దీపకళిక వలె భగ్గున మండిపోవును.

ఈ సాహిత్య కావ్యకళా విద్యారూపిణి–విద్యావిజ్ఞాన వృద్ధుల ఆశీస్సు పొందనిదే రాణింపదని– కవికులగురు వగు కాళిదాసు– 'ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానం' అనెను. ఇది వాల్మీకి–వ్యాసుల సంప్రదాయము.

జన్మప్రభృతి సత్యాంతే – వేదిగాం బ్రహ్మవాదినీం త్వయా చ కావ్య

మిత్యుక్తం, తస్మాత్కార్యం భవిష్యతి॥ బ్రహ్మవాదినియగు నీ వాక్కు సత్యమైనది. అని బ్రహ్మయొక్క ఆశీర్వాదమును పరమర్షి వ్యాసులు పొందిరి.

ఇట్లు కవులు తమ సాహిత్య విద్యాజయ ఘంటను మ్రోయించి, కీర్తి సౌరభమును సకలాశలకు వెదజల్లుచుందురు. దాని ధ్వనివ్యాప్తిలో కల - తారతమ్యమును బట్టి ఆఘంటకు మూల్యము కవి పండిత విమర్శక లోకము నిర్ణయించును.

విద్యాంతరములందు అతిహేయముగా నుపపాదింపబడిన జుగుప్సాదులను ఈ సాహిత్యవిద్య మహిమచే రసతుందిలములనుగా చేసి కవులు సహృదయ హృదయములను ఆనంద 'డోలికల' నుయ్యాల లూగింతురు.

ఎన్ని యుగములు మారినను సాహిత్య విద్యాఫలము వన్నె మారనిది, రుచి తరుగనిది. అంతియేకాక కాలము కడచిన కొలదియు రుచి యతిశయించుటేగాక వన్నెయు వాసియు పెరుగును. ఈ విద్యను సాధించిన కవులు రససిద్ధులు. వారికి వారి కావ్యములకు జరామరణములు లేవు. సత్త్వతత్త్వ ప్రబోధిని, సర్వానవద్య, సకల శాస్త్రార్థహృద్య అను కవివరేణ్యుల సాహిత్యవిద్య కాలతీత్వ మున్నంతవఱకు నిలిచియుండును. ఇందులకు సందియము లేదు.

జయంతి తే సుకృతినో
 రససిద్ధాః కవీశ్వరాః ।
సర్వానవద్యా సాహిత్య
 విద్యా విజయతాం చిరమ్ ॥

—•••—

# తెలుగువారు - ప్రాకృత భాషా సేవ

- శ్రీ వెలుదండ నిత్యానందరావు.

శాతవాహన యుగము ప్రాకృత భాషకు స్వర్ణయుగము. హాలుడు స్వయముగా కవియేకాక కవిపండిత జనపోషకుడు. తన ఆస్థానకవులు చెప్పిన గాథలను కూర్చి భావితరములకు కానుకగా 'గాథా సప్తశతి' అను గ్రంథమును సంతరించెను. దీనికి ప్రాకృతమున 'గాహాకోసో' అని పేరు. గాథ నేడు మనము తలంచే కథ కాదు. అది ప్రాకృత విషమచ్ఛందో భేదము. గాహగా, గాహా, ఎగ్గాహా, ఉగ్గాహా, గాహిణి, సింగిణీ, ఖండ ఆ అను సప్తవిధగాథలు కలవు. ఇది మాత్రాబద్ధము. ప్రతి గాథకు నాలుగు పాదములు. మొత్తము నాలుగు పాదములకు కలిసి కనీసము 54 మాత్రలుండి, 64 మాత్రలకు మించకుండ నుండవలెను. ప్రథమ పాదమున 12 మాత్రలు. సరి పాదములు గుర్వంతములుగా నుండును. బేసిని జగణ ముండదు. ఆరవగణము మాత్రము ఒక ప్రత్యేక నియమము ననుసరించును. 64 మాత్రలు సంపూర్ణముగా నున్న గాథకు 'ఖండ ఆ' అని పేరు. తెలుగులో నిది కందమని చెప్పవచ్చును.

కుమారిల, హాల, కళ్యాణ శీల, మున్నగు 350 మంది రచయిత (త్రు) ల ఏడువందల గాథలు కలవు. ఈ గ్రంథము ఆంధ్రుల సాంఘికాచారములను, వేషములను, నమ్మకములను కడు చక్కగా వర్ణించినది. ప్రసంగవశమున 'గాథాసప్తశతి' ని గురించి తెలుసుకుంటారు. కనుక ఇక్కడ ఎక్కువగా వ్రాయను.

శాతవాహన యుగార్ణవమున వెలువడిన మరియొక యమూల్యరత్నము గుణాఢ్యుని బృహత్కథ. గుణాఢ్యుడరణ్యమున వసించుచు భూర్జపత్రముల పైని నెత్తుటి అక్షరములతో పైశాచిక భాషలో బృహత్కథను వెలయించి రాజువద్ద కంపెను. క్రొత్తగా నేర్చిన సంస్కృత భాషపై మోజులో మునిగిపోయిన శాతవాహనప్రభువు దానిని నిరాకరించుటచే గుణాఢ్యుడు ఆ గ్రంథము నగ్నిదేవున కొక్కొక్క పత్రము నే యర్పించుచుండెను. ఇది తెలిసి రాజు తన తప్పు మన్నించి, గ్రంథదహనోద్యమము మానుమని ప్రార్థించెను. గుణాఢ్యుడు మానెను. కాని అప్పటికే ఏడు లంబకముల నగ్నిదేవుడు భుజించెను. ఆంధ్రుల దురదృష్టవశాత్తు మిగిలిన ఒక్క లంబకముకూడ నేడు అలభ్యము. సోమదేవుడు చేసిన 'కథాసరిత్సాగర' మను సంస్కృతానువాదము మాత్రము లభించుచున్నది.

కుతూహలుడు మహారాష్ట్రి ప్రాకృత భాషలో 1800 పద్యములలో వ్రాసిన 'లీలావఈ' (లీలావతీ) కావ్యము కూడ ఈ కాలముననే వెలువడెను. శాతవాహన చక్రవర్తి హాలుడు లీలావతిని పెండ్లిచేసుకొన్న విధము, వారి ప్రేమగాథ ఇందు వర్ణితములు.

ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్ఫలాయనులు వెలయించిన ప్రాకృత శాసనములు ఎన్నియో దొరకినవి. శాసనకవుల ప్రతిభా, వ్యుత్పత్తి విశేషములు ప్రస్ఫుటముగా నిందు గోచరించును. కాని వీరి ప్రాకృత సాహిత్యము, వెలికిరాకపోవుట విచారకరము.

బౌద్ధమతమునకు నిధులైన 'పిటకములు' అశోకుని కాలమున ప్రాకృత భేదమైన 'మాగధి'లో వ్రాయబడెను. వీటిని కళింగులు మరియొక ప్రాకృత భేదమైన 'పాళి' భాషలోనికి అనువదింప జేసిరి.

కాకతి ప్రతాపరుద్రుని యాస్థానము కవిపండితులకు నిలయము. ప్రతాపరుద్రుని యాస్థానమునకేకాక సకల సంస్కృత, తెలుగు సాహిత్యములకే శిరో

భూషణము వంటివాడు. ప్రచండ సంస్కృత విద్వత్కవి విద్యానాథుడు. ఇతని సంస్కృతాలంకారిక గ్రంథ మగు 'ప్రతాపరుద్ర యశోభూషణము' లో కొన్ని ప్రాకృత గాథ లున్నవి. వాటి సంఖ్య ఇట చూపబడుచున్నది.

| | |
|---|---|
| I నాయక ప్రకరణమున | 3 |
| II కావ్య ప్రకరణమున | 7 |
| III నాటక ప్రకరణమున | 5 |
| IV రస ప్రకరణమున | 38 |
| V దోష ప్రకరణమున | 1 |
| VI గుణ ప్రకరణమున | 9 |

6 ప్రకరణములలో కలసి 63 మొత్తం గాథలు.

పైదానినిబట్టి విద్యానాథ కవీంద్రులు సంస్కృత కావ్య నిర్మాణ దక్షులే కాక ప్రాకృత గాథా నిర్మాణ కుశలు లనియు విశద మగుచున్నది. 3

రెడ్డిరాజుల కాలములో జన్మించిన శ్రీనాథుడు 'నూనూగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి' నాంధ్రీకరించెను. కాని అది అలభ్యము. క్రీడాభిరామములో నున్న రెండు సప్తశతి పద్యములను మానవల్లి వారు వెలికి దీసిరి. పూర్వము తాము రచించిన వాటిని తరువాతి కావ్యములలో ప్రవేశ పెట్టుట పూర్వ కవులకు పరిపాటి. ఇందుకు ఎన్నియో నిదర్శనములు చూపవచ్చును. అవిధముగనే శ్రీనాథుడు కూడ సప్తశతి పద్యములను క్రీడాభిరామములో వాడుకొనవచ్చును.

గాథ॥ విక్కిణ ఇమాహ మాస -
మ్మిపామరో పాఇడింప ఇవేణ ణిద్దూమ
ముమ్మురచ్చిఅ- సామలి యథణో పడి
చ్ఛన్తో

అనువాదం :-

మాఘమాసంబు పులివలె మలయుచుండ
బచ్చడం బమ్మికొన్నాడు పసరమునకు
ముదిత చన్నులు పొంగలేని ముర్మురములు
చలికి నోరగోయ కేలుండు సైరికుండు॥

సైరికుడనగా రైతు. ముదిత చన్నులు పొంగలేని కుంపట్లు. వాటివేడిని చూసుకొని రైతు పసరమునకై పచ్చడం బమ్ముకున్నాడు.

ఎంతటి కమనీయ కల్పన గాథాకవులది. 'పచ్చడంకన్న పడతి పాలిండ్లే వెచ్చన'ను చమత్కారము.

గాథ :- రుఝ్ఝావాఉత్తిణి ఏ
ఘరమ్మి గోఊణణీ సహాణి సణ్ణమ్
దావే ఇవగ అవ ఇఅం.
జ్జుజ్జోఓ జలహరాణం॥

అనువాదము :

పటు ఘనాగమ పవనో త్పాతాలయములో
ఛిద్రంబునం బట్టెకం
కటిపై ముచ్చముడింగ నిర్భరవియో
గ గ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచునున్న పాంథవనితన్
గ జ్ఞావచః ప్రేషియన్
దటి దుద్యోతము చూపునట్ల నడురే
ధారాధర శ్రేణికన్

వానాకాలం విరహాన్ని ఎక్కువ చేస్తుంది. నాయిక పోషిత భర్తృక, ఆమె నిర్భరవియోగ గ్లానిచే శోషించి పట్టెమంచంపై పడిపోయింది. ఆమె దుస్థితి గాంచలేక, జాలితో తటిల్లత కాంతి యనే టార్చివేసి ధారాధరునికి చూపి దయదలచమంటుంది. దీనికే నా అనువాదంకూడ వ్రాయుచున్నాను.

వానకాలమందు పడిపోయె మంచాన
విరహ నోర్వలేక తరుణి. జాలి
మీర వేడుకొనియె మేఘుని ఆమెపై
కరుణ జూపుమనుచు మెఱుపుకన్నె॥

జగద్విదితమైన 'వారణ సేయ దావ గొనవా!' అను శ్రీనాథ పద్యము 'కస్స వణహో ఇగోసా' అను గాథకను వాదము 4

శ్రీ ఆరుద్రగారు సమగ్రాంధ్ర సాహిత్యమున పేర్కొనని మరియొక పద్యమును ఇట ఉదాహరింతును. 1881 లో ఆల్బ్రెక్ట్ వీబర్ పరిష్కరించిన 'గాథా సప్తశతి' ముద్రణలో దొరికిన శ్రీనాథ పద్యమిది.

గాథ :- లచ్ఛిదుహీ ఆ జామాదా
హారీ తథ అఘరిణీ గంగా
అమయ మియంక సుదా
అహో కుటుంబం మహాదహిణో॥

ఆరయ జీవనం బమృత
మల్లుడు విష్ణువు, సొమ్ములన్నియున్
సారఘరత్నము లొక్కడుకు
చంద్రుడు, కూతురు లక్ష్మిగాలు భా
గీరథి, తా సముద్రు డని
కీర్తన సేయుదు రెల్లవారు నా
క్షీరపయోధి సన్మలకు
జెల్లనె యిట్లు సమస్త భాగ్యముల్.

క్షీరసముద్రుని వివరములన్నియు కల వీపద్యంలో. సముద్రుని భార్య గంగ, కొడుకు చంద్రుడు, కూతురు శ్రీ, అల్లుడు హరి, నగలు రత్నములే ఎంత అదృష్టము క్షీరసముద్రునిది!

నా అనువాదమును కూడ నాలకింపుడు.

అలు గంగమ్మ, సిరిబిడ్డ, అల్లుడు హరి,
చంద్రుడు సుతుండు, రత్నముల్
చక్కనైన
యాభరణములు, జీవిత మమృతమయము
ఏమి క్షీరసాగరు భాగ్యమెంచిచూడ 5

సర్వజ్ఞ పెదకోమటి వేమారెడ్డి ప్రభువు (1402-1420) గొప్ప సంస్కృత కవియే గాక ప్రాకృత భాషావేత్తకూడ. 'సప్తశతీసార' మను పేర నూరు గాథలను వ్యాఖ్యానించెను. మరి మిగిలిన గాథల వ్యాఖ్య నతడు రచించినను మనకు లభించ లేదో లేక యతడు వ్రాయనే లేదో తెలియదు.

(సశేషము)

# ఏకవీర - దాని వైశిష్ట్యము

- శ్రీ పి. వి. ఎస్. ఆర్. కె. శర్మ

1934 నాటికే 'దేశము పట్టరానంత కవి'యై తర్వాత వేయిపడగలు, చెలియలికట్ట, మొదలైన నవలలు వ్రాసి 'ఆయన నవలాకారుడే కాని కవిగాడు' అనిపించుకున్న ప్రతిభాశాలి విశ్వనాథ. 'ఆర్ష సంప్రదాయము నందలి పవిత్రతను, విశిష్టతను, యుక్తిప్రయుక్తులతో సమర్థించి తనకుగల ఊహాబలముతో గ న నా- విన్నాణముతో' విశ్వనాథ వారు వ్రాసిన నవలలలో ఏకవీర విశిష్టమైనది.

ఏకవీర కాల్పనికోద్యమ ప్రభావముతో వెలువడిన చారిత్రక నవల. ఇది మధుర నేలిన నాయక రాజులకు చెంది-న

జీవితంలో మనిషి కర్తృత్వంవహించే భాగంతోపాటు కర్తృత్వం వహించకుండానే సంభవించే భాగమైన విధి వ్రాతకు ఏకవీరయందు ప్రాధాన్యమివ్వడమైనది.

కుట్టాన్ మరియు మీనాక్షి, వీరభూపతి మరియు ఏకవీర, ప్రేమించుకొందురు. విధి వక్రించి, వీరభూపతికి మీనాక్షితోను, కుట్టాన్‌కు ఏకవీరతోను వివాహమగును. కుట్టాన్ తనకు మీనాక్షియెడల గల ప్రేమను సోదరీప్రేమగా మార్చుకొని ఏకవీరను ప్రేమించినవిషయ మెరుగక యొకపరి వీరభూపతి కౌగిలించిన ఏకవీర తనపాపప్రక్షాళనకై ఉద్యమించగా కుట్టాన్ ఆమెను ఓదార్చి కౌగిలించును. కుట్టాన్ కౌగిలిలోనే ఆమె మరణించును. వీరభూపతి సన్యసించును. ఇది స్థూలముగ నిందలి కథాంశము.

కుట్టాన్ గదిలో మంచముపై కూర్చుండగా ఏకవీర నిలుచుండి తలవంచుకొని పూలచెండుతీసి దీర్ఘమును సన్నదియునైన మాల నొక సూత్రాకర్షణముచేత హ్రస్వమును, జిక్కనయు జేసి మరల మరల దీర్ఘీకరించి యతనివంక తలయెత్తి భావాభిరామముగ జూచెను. 'వ్యతిరేక సూత్రమాకర్షణముగా జేతికి దగిలిసూత్రము పాడుగై పోయెను. జాజులు, మల్లెలు, గన్నేరులు, మందారములు విడివిడిగా నయిపోయినవి.' అజ్ఞాతముగా తగులుట విధికృత మని యర్థము. పూలు విడి విడి యగుట వారిప్రేమ కేక సూత్రత లేక పోవుట యనుకొనవలెను. కావుననే ఏకవీర ఈపూలదండ వేసిన తర్వాత ఇరువురు వేఱొక శయ్యపై నిదురించినారు.

'తూర్పున బుట్టిన మబ్బు చుట్టుపట్లనున్న పదిమబ్బుల గలుపుకొని వాన యొలుకబోసినదే యనిపించినది. ఇంతలో నొక పెద్దగాలి వచ్చి దానిని పునరేకాదశగా విడబఱచెను. సూర్యుడు మాత్ర మప్పుడప్పుడు పలుచనిమబ్బులలో నుండి మందరశ్ముల వెలయించుచునే కాని ఇంతలో మఱల నొక నల్లకాముకుల గుమ్మువంటి మేఘ మడ్డువచ్చి యతనిలోకమును వేరుపఱచును.' కుట్టాన్ తనకు మీనాక్షికి గల పూర్వసంబంధమును గూర్చి వీరభూపతికి జెప్పువరకు మీనాక్షి యోగినివలె గడపినది. చెప్పిన తర్వాత వీరభూపతిపై ప్రేమను పెంచుకొన్నది. ఎడబాటును సహించలేక పోవుచున్నది. కాని వీరభూపతి రాజాస్థానమున కేగి వారములరోజులవరకు మీనాక్షి సేతుపతుల సంబంధమును తలపోయుచు ఇంటికి రాడాయెను. ఇట్టిసంఘటన మంతయుపై వర్ణనయందు ఇమిడియున్నది.

ఈనవలయందు మీనాక్షి పలుమారులు పార్వతితో పోల్చబడినది. ఆమె ఏకవీరగృహమున కరుగునపుడు రాజశకటము నధిరోహించినది. 'పార్వతీదేవికి హిమవద్రాజు పంపించిన సారెవలె మీనాక్షీదేవికి ప్రతిసంవత్సరారంభ వేళాకృత కళ్యాణ పరిగుంఫిత మంటపమువలె నాబండి వీధివెంట జరజర దొరలిపోయినది'. అని సాభిప్రాయముగా చెప్పెను.

ఏకవీర తలంటిపోసికొని తన మంచము మీద తెల్లని చీరదాల్చి నిదురపోయిన- పెండ్లియయిన తర్వాతి మూడు నెలల నాటి-కథ స్మృతికి వచ్చెను. కుట్టాన్‌కు తెల్లచీర కట్టిన ఏకవీరను జూచినట్లయ్యెను. మనసులోనే ఆమె యొడలంతయు ముద్దులతో నింపెను. ఆమె రహోవిస్రబ్ధయై యతని యెదురొమ్ముపై విశ్రమించెను. అపుడు గుబ్బపు వాళ్ళపిల్ల అమృతము తొంగిచూచెను. కుట్టాన్‌కు నవ్వు వచ్చెను.

అమృతమును ధర్మమునకు ప్రతీకగ దీసికొన్నచో ధర్మము తొంగిచూచె ననవలయును. ధర్మముయొక్క రూపము సంపూర్ణముగా కనబడక తొంగిచూచుట వలన కుట్టాన్‌కు నవ్వు రావచ్చును.

శ్రావణ బహుళ దశమినాడు మధురలో వర్షము కుండలతో దిగబోసెను. గవాక్షమునుండి జాజిపందిరివంక జూచుచున్నది. జాజిఆకుల పూవుల చివరల చినుకులు ముత్యములవలె కులుకుచున్నవి. ఆ నిలిచిన ముత్యము క్రొత్త నీటిబొట్టుచే దఱుమబడి నేలబడి యాస్థానమున క్రొత్త నీటి బిందువు నిలుచుండెను. ఈ నీటిబొట్ల వర్ణన ఏకవీర ఆలోచనాధారకు చిహ్నముగా గ్రహింపవచ్చును.

వాన తగ్గుతూ కురుస్తూఉండగా చాల సేపటికి ఆలోచననుండి తేరుకొనెను. అప్పుడామె తల విరబోసికొన్నది. ఎదురొమ్ము దిగ్వాసముగా నున్నది. 'అమృతము తన పెద్దకన్నులు మఱింత పెద్దవిగా

చేసికొని ఏకవీర వంకఁ దదేకదృష్టితో జూచుచున్నది.' ఏకవీర తొందరగా తల ముడివైచుకొని, కేలువ యెదురొమ్ము మీదికి లాగుకొన్నది. ఇచట గూడ ధర్మమునకు అమృతము ప్రతీక అని తెలియును.

సేతుపతి క్రమముగా ఏకవీరవైపు మనసు త్రిప్పుకొనుచుండెను. కాని ఏకవీర అన్యమనస్కముగ నుంటున్నది. 'రెండు సంవత్సరాలుగా నామెలో నొక క్రొత్తమార్పు వచ్చినది' ఇది సమ్మతము కాదనుట కా యన్నట్లు అమృతము మఱల వచ్చి తొంగిచూచి పాఱిపోయెను. 'ఏకవీర కలవరపడెను!

'వైవైనది పతిప్రేమ జారిపోవుట తోచిన కాంత మొగమువలె తన చివరల తెల్లబడజొచ్చెను. ఆమెలోని రాగచ్ఛాయ విరిగిపోఁ జొచ్చెను.' మీనాక్షికై వీరభూపతి ప్రేమ జారపోవుట నిది సూచించును.

కుట్టాన్ తాను ప్రేమించిన మీనాక్షియే వీరభూపతి భార్యయని తెలుసుకొన్న సందర్భమున 'ఎదురుగాఁ గమ్మరవాని కొలిమిలోఁ బండ్రాగిన ఇనుము గుండువలె సూర్యోదయ మైనది' అన్న వర్ణన కుట్టాన్ హృదయములో గల్గిన అంతులేని తాపమును, ఆందోళనను వ్యక్తముచేయుచున్నది. ఇట్లెల్లయెడల వక్తవ్యాంశము ప్రతిబింబింపజేయబడినది.

'నాగలి నట్టున లాగుచున్న పొలము కాపు బెట్టుండియుండి తన మొగమున నిలిచిన వాననీరు తలకదల్చి విదల్చుకొనుచుండె. నని చెప్పినతీరు రచయిత సునిశిత పరిశీలనా నైపుణికి తార్కాణ.

తెల్లని చిక్కని మేఘములు ఒకటి రెండు కాన్పులైన ముగ్ధ పురంధ్రీరహో వేళా స్పష్ట దీపపు వెలుగున మెఱయు పొత్తికడుపట్లు రమ్యముగా నుండెను.' అనుట వీరికే తగియున్నది.

'అమృతమును శిక్షించవలెనని ఏకవీర, ఏకవీరకు కనబడకుండ నమృతము, మేఘపు మఱుగున నున్న పలుచని చీకటులు వెన్నెల యొకదాని నొకటి పొఱదోఁలగా దప్పించుకొని తారాడగా నొప్పినట్లుగా నియుపుగు శరద్రాత్రుల కొక సాటువ తెచ్చుకొనిరి. ఇందలి ఉపమానము మనోహరము గదా!

కుట్టాన్ తనను ప్రేమించు ... కలలోని మాట ... కొని, తన పూర్వప్రేమో... మూర్తిని ఊహించి సాత్త్విక భావములకు లోనుకాగా అమృతము తన వంక దొంగి చూచుచున్నట్లులికి పడినది ...రం జీవిగుంబు, (ధర్మము చేయుము) తన చెవుల బడినది. దొడ్డిలో పూలన్నియు బంగారు, వెండి నాణెములవలె, నవరత్నములవలె, ధనలక్ష్మి తాండవించి నట్లయ్యెనని చెప్పుట తనచుట్టును అనంత సంపదలున్నను ఏకవీర మనస్సులో మాత్రము దారిద్ర్య ముండె ననుటను చక్కగా వ్యక్తము చేయుచున్నది. ఇచట పుష్పములు క్రమముగా నవరత్నములతో పోల్చబడుట, 'శిశిర చంద్రజ్యోత్స్న కలహాంతరిత వోలె జలదాంతర్నిగూఢ బాష్పమై విముఖకాగా, మొగిలిపొట్టలలో నీరునిలచి ఖండితా సజలదీర్ఘ సితా పాంగభ్రాంతి గల్పింప ...' మొదలైన విధముగాగల అష్టవిధనాయికా వర్ణనలు చూచినచో వీరి వర్ణనలలో నొకక్రమము గ్రంథమంతట గోచరించును.

ఒకచిత్రమును గీయునపుడు చిత్రకారుడు ఏయవయవమునే పరిమాణములో గీయవలెనో, ఏభాగమున కేరంగు వేసిన శోభగూర్చునో మిక్కిలి శ్రద్ధగ మననము చేసికొని అప్రమత్తతతో గీయును. అట్టి అప్రమత్తతయే నవలా కారునకు నెంతేని యావసరము. ఇట్టి నైపుణ్యము నే విశ్వనాథ సత్యనారాయణగారు నవలా కారుడుగా ఏకవీరలో నణువణువున ప్రదర్శించినారు.

ఈశతాబ్ది మొదటి భాగములో వీచిన స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంత ప్రభంజనము నిరసింపదగిన దని తెల్పుట, అమలిన శృంగార తత్త్వములోని లోపమును స్పష్టము చేయుట, సంఘ ధర్మమునకు నష్టము రాకుండుట అనునవి ఈ నవలా రచనోద్దేశములుగా భావింపవచ్చును. వీరికి సంప్రదాయము నెడల గల పక్షపాతము గ్రహించినచో వీరే ఒక సందర్భమునపల్కిన 'ఒకమహాకవి వాక్కులోనీ భద్రత కొఱకంతో ప్రయత్నించును.' అను వాక్యము వారికే అన్వయించినచో నది స్వభావోక్తియే.

ఒకానొక విమర్శకుడు తెల్పినట్లు 'ఉత్తమరచయిత ఎవరైనా తన రచన ద్వారా తానుకోరే సమాజ స్వరూపావిష్కృతికి పూనుకొంటాడు.' అన్న మాటలు ఈ నవల యెడల అక్షరసత్యములు.

1. పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు, కథాకథన శిల్ప సూత్రాచార్యులు. వేద వేదాంగాది మహాగ్రంథస్థ మహావిషయ నిష్ణాతులు, బహు విషయ వ్యాఖ్యాతలు, కావ్యకథాశిల్ప రహస్య వేత్తలు, అనే దృష్టితో అపూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేను నిలుస్తాను, అని సగర్వంగా చెప్పుకొన్న విశ్వనాథ వారి బహుముఖ ప్రజ్ఞకు మరోరూపమే ఏకవీర.

— ... —

# సౌందరనందము - సాహితీ తీర్థము

- శ్రీమతి కె. వి. రంగనాయకి

( గత సంచిక తరువాయి )

రసోచితముగా పాత్రోన్మీలనము చేయు వీరి [పింగళి కాటూరి కవుల] సిద్ధహస్తత హృద్యముగానుండును.

నందుడు సన్న్యాసమును స్వీకరించినను సుందరిపై ప్రణయము పోలేదు. వారి స్నిగ్ధప్రణయము ఈ పద్యమున స్పష్టతరము. మరియు

'అన్నయనుజ్ఞలేక యడుగు
గావలఁ బెట్టగ శక్తి లేదు, త
త్సన్నిధి కేగి నా వగపు
చెందము చెప్పఁగ శక్తి లేదు నా
ఖిన్నత చూచి పొమ్మనుచు
గెంటుము బో యిటువంటి రూపులో
విన్నలయింప నీ యొకుఁడ
నిల్పెడి శక్తియు లేదు ప్రేయసీ'

అతని రసార్ద్రత, స్వభావసిద్ధమగు సౌకుమార్యము, చక్కగా నుత్పలమున నదికినవి.

నందుని విన్నపమున సుందరియును దీక్షగ్రహించును. ఆదీక్షాగ్రహణమునకు ఉచితముగా పరమ విలాసిని యగు సుందరి పరివర్తన చెందినది. 'భిక్షాగమనపు' 'నిరీక్షణము'న పాఠకులకు ప్రత్యక్షమైన శృంగారరసాధి దేవత 'అనుజ్ఞ'లో గన్పట్టలేనంతగా మారినది. ఆమార్పును అనన్యసామాన్యముగా చిత్రించిరి. ఆ చిత్రణములోని మార్దవము అక్షర సముదాయమున రూపుకట్టినది. ఈచిత్రణములో నందుని కన్న సుందరికి ధర్మదీక్షాయోగ్యత చక్కగా సరిపడినది. ఇది సజీవ చిత్రము.

బుద్ధుడు నందుని తనతో తోడ్కొని పోవును. సుందరి యొరుగు తెన్నులు చూచినది. విసివినది. క్రమక్రమముగా నందునివృత్తాంతమును విన్నది. సుందరికి ఆయువు క్రుంగినంతపని యైనది. తన అక్కసుతీగ మెత్తని కినుకతో గౌరవమున నెడిరీతి నుపాలంభించినది. ప్రొద్దు క్రుంకినది. ఈ ఘట్టమున కవుల సమర్థత సువ్యక్తము. ఉత్తమ కావ్యగౌరవమునకు ఇట్టి పట్టులన్నియే రమణీయతనాపాదించును.

'అంతట భాను మంతుఁడప
రాంబుధి గ్రుంకగ నత్తలోదరీ
స్వాంతమునందుఁబోలెఁ గల
యన్ దెసలెల్లఁ దముంబు ప్రాఁకె నా
కాంతను బుజ్జగించు చెలి
కత్తెలు నిత్తెడి నాసపోల్కి నా
కృంత వెలుంగు వాఁప నుద
యించెను దాగక లక్కడక్కడన్'

ఇచ్చట కథకును కాలవర్ణనమునకును, చక్కగా మేళన కుదిరినది. కవుల భావైక్యమునకు లెనే ప్రకృతివర్ణనయు, కథయు, నేకత వహించినవి. ఇది ఉత్తమ శిల్ప పద్ధతి.

బౌద్ధవిహారభూమి ధర్మదేవత స్వయముగా కోరి కట్టించుకొన్న కొలువుకూటము. ధర్మదేవతముందు కామక్రోధాది వికారములకు అవకాశము లేదు. ఆసన్నివేశ వర్ణనము కూడ కలతో సమన్వయించును.

స్మరదుర్మదుఁ బట్టి సంరివారంబుగాఁ
బసువరించిన యజ్ఞవాటిపోల
గ్మ సంక్షోభ మహోపద్రవము లేక
నిశ్చలం బగు శాంత నీరధి లెఁ
బ్రావృట్పయోధరావరణమ్ము తొలఁగి ని
ర్మల మైన శారదాభ్రమ్ము పోలెఁ
ప్రశమిత రాజ సాంధమై మఱి శుద్ధ
సత్త్వప్రకాశమౌ స్వాంతము వలె,
శాంతి పావన గంభీర సరళ భావ
బంధురం బయి ధర్మదేవత స్వయమ్ము
కోరి కట్టించుకొన్నట్టి కొల్వుకూట
మనఁగ నొప్పారు బౌద్ధ విహారభూమి'

ఇందు తొలిపాదమున మారధర్షణము సముచితము. బౌద్ధసంప్రదాయమున బుద్ధశ్వసమయమున గౌతముడు మారధర్షణమును చేసెను. ఆవిషయమే ధ్వనితమైనది.

మరియొక విశేషము. మన్మథ మన్మథుఁడగు నందుని కాముక వ్యాపారమును నిర్మూలించుట మొదలగు నవస్థాగుణములును భవిష్యత్సాత్త్విక గుణములును సూచింపబడినవి. సీసపద్యమునందలి పూర్వార్థముల నందుని పూర్వావస్థను ఉత్తరార్థముల నందునకు కలుగబోవు ప్రశాంతపరిణామమును చక్కగా సూచితమై ప్రకృతిక భాగతమగు బౌద్ధవిహార వర్ణనము మనోహరముగా సాగినది.

ఇట్టిరమ్యత సౌందరనందము నందు ఎల్లయెడల సహృదయ హృదయానందకరముగా నుండును. కథావస్తువునకును దానిని పొదువు కవితా వైభవమునకును, సామరస్యము ప్రాణసమానమైనది. ఆ జాగ్రత సౌందరనంద కవులకు సహజముగా వచ్చినది.

తిక్కనకు పాత్రల స్వభావ చిత్రణమున ప్రాధాన్యమొసగు శిల్పమున నభిమానము. తరువాతి కావ్య ప్రబంధములలో నీస్వభావచిత్రణ కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్నములలో మరల పల్లవించినది.

మరల నాచిత్రణమే సౌందరనంద కవులకు చేపడినది. ఈచిత్రణము కావ్యమునకు ఒక సౌందర్యమును ఒక నిండుతనమును సమకూర్చినది. సౌందర నంద కావ్యములో అధిక భాగములు పాత్రల వచనములే! కవుల మాటలు తక్కువ అని గమనింపదగును.

'బుద్ధగతమైన పెనుభక్తి ముందులాగ
నెలదిపై రక్తి లాగ వెన్వెనుక కతని'

తుద కేమగునో గురుడన్న భీతి యొక్కట, తెడి యూరునో మకరికాలత యన్న భయం బొకంట.

'ఎడయగ ధర్మరాగ మెటు లేనొక మందడుగేయ రెండు మూఁడడుగులు ప్రేమ ధర్మమపు డాతని వెన్కకుఁ ద్రోయు' ఈశిల్పము నందుని ప్రేయసీ ముఖ విశేషక దర్శనము గౌతమబుద్ధ సందర్శనమున కంటె బలవత్తర మైనను రెండును వెనుకముందులై తహతహ లాడించినవి. అప్పటి నందుని యవస్థ విపులముగా వర్ణించుటకంటె ఈకొలది మాటలలోనే హృదయమునకు హత్తుకొనునట్లు చిత్రింప బడినది. ఇది ఈకవుల కృతహస్తత.

'సదనము మొగి పై...సాగినడచుచున్.'

'తనకోసమెదురు తెన్నులు ...

కాదనుచున్'

'మునివర్యు నిలిపి ప్రభూ!......

యరుగుచుండె'

ఈ పద్యములలోని శిల్పము ఆ న్వపసి తుని అంతరింద్రియ బహిరింద్రియములకు ఇంచుకంతయు సానుకూల్యము లేని గతియు, ఆతని అవశత. హృదయదౌర్బల్యము, స్పష్టతరముగ కన్నులకు కట్టుచున్నవి. ఆనందుని అవ్యవస్థను బుద్ధుఁ డెఱిగియు ననుగ్రహించు పూనికనో వదలలేదు.

నందుని పరివ్రాజక దీక్షావృత్తాంతము సుందరి యెఱుగదు. సుందరికడ నందు డొనర్చిన సమయమును భగ్నమైనది: అగుటచే సుందరికి మరింత నాథప్రత్యాగమనప్రతీక్ష యినుమడించినది. ఆప్రతీక్షా సంభ్రమము,

'ఈదారిఁ జూచుఁ బదపడి
యాదారిం జూచుఁ గలయ నంతటఁ
జూచున్.
'గా' దను 'నగునా' యనుఁ 'గా
నీ!దండింపకయె విడుతునే యితనిననున్.
తన వెనుకవచ్చి నిల్చెనో
యనుకొని వెనుదిరిగిచూచు నాసమెయిన్ జ
య్యన మతి వీథులదెసఁ గనుఁ
గొనుఁదాఁ దననీడ చూచుకొని
యుల్కిపడున్'- ఒక్కొక్కదాని కరు

వదినాల్గు లఘువులుం కిల రెండు కంద పద్యములలో లోకోత్తర మధురముగా వెలయించిరి. సుందరి హృదయ స్థైర్యము లేమి కంద పద్యరచనమున సూచితము. ఇది యొక రచనా శిల్పము.

నందునకు సన్న్యాస మిప్పించినాఁడు గాని ఆతని హృదయమునకు తగిన శాంతిని గౌతముఁడు మొదట ఉపదేశించలేదు. తిరువాత సమయమును జూచి ఆగౌతముఁడు ఈనందుని వగపువిని, కని, ఉపదేశామృతముచే నాతని హృదయవ్యథాగ్నిని చల్లార్చి తేరుకొనఁ జేయుటకై అరుదెంచెను. అప్పటి నందుని హృదయము జ్ఞానోన్ముఖమైనది. ఆతనిలో నాతనికి బహిర్భావ శబలత యేర్పడినది. ఆనందుని భావశబలతను

'తనబాలిశత్వమ్ముఁ గానే మునినేను
గౌతముండనెడి నిగ్గరితనమ్ము
తనపాటు చూడఁగా మనసొప్పకప్పుడే
విడిచిపుచ్చనటన్న వట్టియాస
తనచేతి యాత్రపాత్రము జారగిలఁద్రోసి
నతఁడె కా యన్న దెసంత యీసు
పూజ్యపాదుని వెస పొందమిన తనకట్టు
భాగమ్మునకు నాత్మ పాపశంక
యొక్కొక్కటిగాఁ బుట్టి యొకటి
నొకటి
పాలియఁగాఁ జేసి, యంతలోఁ బొత్తుగూడి
వెండినాడనుపి 'నందుని హృదమనసు
తాళజాలనియంత గగ్గోలు చేసె'

ఇత్యాది పద్యములలో మనోహరముగా వ్యక్తీకరించిరి.

ఆనందుని హృదయమున భావపరంపరాతి వేగమునగలిగిన గగ్గోలునకు తాళలేక పోయెను. నందుని యాందోళనమును పాఠకులకు సువ్యక్తమొనరించిరి. అంత గగ్గోలున నున్న నందుఁడు గురుని దర్శింపగనే కేల్దోయి ఘటింపగల్గెను కాని 'భగవతే నమః' అనలేఁ డయ్యెను.

ఇది సమాజస్థితి అతిభరములగు వ్యథలతో గగ్గోలుపడిన నందుని నాలుక మంటినది. స్వరమున పుష్టిలేదు. చేతులు జోడించెను. ఉచ్చారణ లేదు. చేతులవలె నని లోచనగాలేదేమో? అంతగగ్గోలు పడిన నందునకు తన ఆత్మయే తనదిగాని స్థితిగా నున్నది. ఆస్థితి 'భగవతేనమ' వాక్యములో అభివ్యక్తము.

ఈ సౌందర నందమునకు కవులొక అపూర్వపు సొగసును కల్పించిరి. అది సర్గల మధ్యనున్న పద్యరచన. ఇది నాటకాంతర్గతములగు చూళికలవలె నున్నది. ఏతదనుగుణముగనే నాటకముగ్ఛదలో కావ్యము నడచినది. ఈ సర్గమధ్యస్థములగు పద్యములే రంగస్థల దృశ్యములవలె నెలకొన్నవి.

గౌతమబుద్ధుని పురప్రవేశము, జనులు తలకొక విధమున పలుకుట, ఆతని ధర్మోపదేశము, దీక్షాగ్రహణము, వారి వారి మనోభావ చిత్రణములలో నీకావ్యమునకు ధర్మములను ప్రసంగించినవి.

సుందరీ నందులు విలాసమున నుండగా బుద్ధుని ప్రవేశ నిర్గమనములు నాటక ప్రవేశ నిర్గమనములను తలపించుచున్నవి. అచ్చట పాత్రముల మనోభావ వర్ణనము సన్నివేశవర్ణనము రంగనిర్మాణ పారీణతను, సందర్భ శుద్ధిని, స్పష్టీకరించుచున్నది.

క్రొత్తగా పరివ్రాజక దీక్ష నందుకొన్న నందుడు ప్రాత వాసనలు హృదయమున మోసులెత్త ఒంటిపాటువఁజేరి తనప్రాణధనమైన, తనప్రాణమైన, చెలిని గూర్చి విలపించుట, తనదీనస్థితికి తానే వాపోవుట, తన యున్నకు తెలియచేయలేక అభిమానపడుట, ఇది అచ్చమైన శిల్పము. నటించు పాత్ర హావభావములు ఆంగికములైన చాలనాదులచే ఎట్లవగతములగునో అట్లే ఆపద సంపుటినుండి ఆనాటి

పాత్రలు పతితల హృదయములకు ప్రతీకములగును.

ధర్మోపదేశము సేయుటకై నందుని కడకు బుద్ధుడు వచ్చును. ఆ బుద్ధుని చూచినప్పటి నందుడు.

'తం బాలికత్వమ్ముగ నానేము వినానేము
గౌతముండనెడి స్వగురి తనమ్ము
తనపాలు చూడగా మనసొప్పకప్పుడే
విడచిపుచ్చునటన్న వెట్టి మాన
తని చేతి యమృతపాత్రము బోరగిలఁద్రోసి
నతఁడె కాకున్న దివ్వంతియాను
పూజ్యపాదుని దెసఁ బోడమిన తన చెట్ట
భావమ్మునకు నాత్మ వాపశంక'

ఈ భావము, ఉస్థిత నాటకము చూచుచున్నప్పుడు మనకు ప్రత్యక్షమున నభినయించు పాత్రవలెనే నందుని పాత్ర పరిపుష్టమైనది.

ఈ కావ్యమునందలి పాత్రలు, వర్ణనలు, సర్గారంభాదులు, సర్గల మధ్యల యందలి పద్యములు వీనినిగూర్చి వ్యాఖ్యానింప వలసినది చాల కలదు. శృంగార శాంతములకు కల అంగాంగి భావమును కూడ ప్రత్యేకముగా వివరింప వలయును.

గురుల జంటవలెనే ఈ కవుల జంటయు ఏకమైన మనస్సుతో సముచిత సన్నివేశమధురమగు మహాకావ్యమును ఆంధ్రసహృదయుల కందించినది. ఇది అద్భుతమైన సాహితీ సృష్టియు.

—•••—

* 'ఆలస్యం అమృతం విషం' అనుసూక్తి నేటికైనా రాజకీయవేత్తలందఱు గ్రహింపవలసి యున్నది.

* నేటి లోకసభ యువతీ విలసితమైనది. వాస్త.
ప్రాతికంపు వదలలేదని కొందరి భావన !!

# ఆంధ్ర సాహితీ భువన ప్రాంగణంలో స్త్రీలు సంతరించిన రంగవల్లికలు

— శ్రీ సోమసుందర్.

శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలం- ఆంధ్రసాహితికి సర్వతోముఖ సంవృద్ధమైంది. స్వర్ణయుగంగా రూపొందింది. ఈ విషయంలో చరిత్రాభిజ్ఞుల అభిప్రాయం ఏకోన్ముఖమైనదే! శ్రీకృష్ణదేవరాయలు పటుతరా పరిపాలనాదక్షుడేగా, అంతేకాక రసజ్ఞశేఖరుడుగా కళాశీలిని. అతని రాజ్యకాలం శాంతి సుఖసంపదల కాలవాలమై, సర్వకళా వికసించడానికి దోహదం చేసింది. సమాజంలో సగభాగమైన లలనామణులలో కూడ చైతన్యం ఆ యుగంలో పెంపెసలారింది. ఎందరో కవయిత్రులుగా రూపొందారు.

ఆంధ్రభారతి సకలకళాసముపేతగా తనరారిన ఆ యుగంలో ప్రబంధసాహితి రూపొందింది. కవులు తమ శేముషిని అపారంగా ప్రదర్శించారు. ప్రజ్ఞాపాటవాలు అగ్రతాంబూలాలు అందుకొన్నాయి. సాహితీ శిల్పసమారాధన ఒక్కొక్క దశలో వెక్కసంగాకూడ ప్రవర్తితమైంది. ఆ యుగంలో ఎందరో కవయిత్రులు ఆవిర్భవించినా అధిక సంఖ్యాకులు కవులకో రంజన్యులకో ప్రియంవదలై మానసికోల్లాసం కలిగిస్తూ కనుమరుగై నేపథ్యంలో ఉండిపోయారు. అంతగాని స్త్రీ ప్రాతినిధ్యం అసలే లేదని కాదు. పురుషుల సంఖ్యకు సమతుల్యంగా లేకపోయిందని. ఆ యుగ ప్రధాన కవితాధారలో పాలుపంచుకోగలిగినవారు కొద్దిమందే! కావ్యశ్రేణిలో ప్రత్యక్షం కాకపోయినా ఆ యుగంలో మోహనాంగి అనే విదుషి కవులకు తలలో నాలుకగా మనినట్లు చరిత్ర వెల్లడి చేస్తోంది. ఆనాడు కవులంతా మినహాయింపులు లేకుండా శృంగారరసానికి ఆరాధ్యపీఠం కల్పించారు. ప్రధాన కావ్య జీవనధార శృంగారమైనపుడు కవయిత్రులూ దానికే తోడ్పడగలరనడంలో విశేషం లేదు.

శ్రీకృష్ణదేవరాయల కాలంనాటిదిగా ఎందుకో పరిగణింపబడుతూ వచ్చిన కవయిత్రి మొల్ల లలిత ప్రబంధరీతిలో రామాయణం విరచించింది. జనసామాన్యానికి రామాయణ రామణీయకత్వాన్ని అందుబాటులోనికి తెచ్చింది. ఆ కావ్యంలో సైతం సమయోచితంగా శృంగారరస పోషణకు గల అవకాశాలన్నిటినీ అన్వేషించకపోలేదు. శ్లేషాలంకారశిల్పమర్యాదలనూ చొప్పించకపోలేదు.

'సురతము లేక యుస్సురను
...టి మగం డుడికించు కాంతయున్,
సరసమెరుంగు చంద్రముఖి
సావడిదంటయు బెరుకత్తెయున్,
పరపురుషాభిలాషమును
బాయని భామిని పోటుకత్తెనన్,
బరగిన భామలాది యుప
భర్తల కూడి చరించిరత్తరిన్. (పు. 35)

సమకాలీన సామాజిక వాస్తవికతను ఎరిగో ఎరగకో తమ కావ్యగత సందర్భాల కెక్కించడం కవులందరికీ పరిపాటే! ఈ పరిపాటి ఒక్కొక్కప్పుడంతో గుడ్డిగా కాలగత, చరిత్రగత, స్థితులను గమనించనంత దోషంగా రూపొందకనూపోలేదు. శ్రీనాథునంతటివానికే ఈ దోషం తప్పలేదు. కాశీఖండంలో శివశర్మ యాత్రకు బయల్వెడలిన సందర్భంలో- కవి తనసమకాలీన కాంచీపుర స్త్రీల సమూనాలనే శివశర్మ కాలం నాటివిగా భావించి వర్ణించు

కుంటూపోయాడు. అల్లసాని పెద్దన స్వారోచిషమనుచరిత్రకాలంలో తురకల దైవంగా చంద్రుడు ప్రఖ్యాతుడైనట్లుగా పొరపడ్డాడు. ఇలాంటి అచారిత్రక దోషాలు (anochronism) మన ప్రబంధాల నిండా ఎన్నో! అలాగే మొల్లకైతం-తమకాలంనాటి ఉపభర్తల సంగతిని రామాయణంకాలానికి సముద్ధరించి ఉంటుందనడం సత్యమార్గం కాదు.

తంజావూరు నాయకరాజుల పరిపాలన సర్వాంగీణంగా శ్రీకృష్ణదేవరాయలను అనుకరించడం యాదృచ్ఛికం కాదు. శ్రీకృష్ణదేవరాయలవారి ఆదర్శంతోనే నాయక రాజులు స్వయంగా కవులయ్యారు. రసికశిఖామణులయ్యారు. కవికళాకారులను పోషించారు. తంజావూరు నాయకరాజుల కాలంలో ప్రఖ్యాతులైన కవయిత్రులెందరో కనిపిస్తారు.

మన్నారు దాసవిలాసమనే ప్రబంధ యక్షగానాలను ఇతరత్ర అనేక కావ్యాలనూ రచించిన రంగాజమ్మ ఆయుగంలోని కవయిత్రులందరికీ శిరోమణిగా భాసిస్తుంది. పిఠాపురం రాజావారి పోషణలో విలసిల్లిన ఆంధ్రసారస్వత పరిషత్తు 1936లో ఈమన్నారు దాసవిలాసాన్ని 'పరిష్కరించి' ప్రచురించింది.

విజయరాఘవనాయకునితో రంగాజికి గల శృంగారసంబంధాన్ని ఒక పద్యం కవితాపరంగా నిక్షిప్తంచేస్తుంది. ఆపద్యం పుట్టిన సందర్భమిదిగా చెప్పబడుతోంది. విజయరాఘవుడు రోజుల తరబడిగా రంగాజితో గడుపుతూ ఉండేవాడు. అతని పట్టమహిషి ఒక చెలికత్తెకు విజయరాఘవుని చిత్రపటమిచ్చి రంగాజికి చూపుమని యింటికి పంపుతుంది. రంగాజికా భావం అర్థమవడమే కాక చట్టున కోపమూ వస్తుంది. అదే చిత్రపటంపై వెనుకభాగంలో ఈ పద్యంరాసి పంపుతుంది. జనశ్రుతమైన ఈ గాథలో యాథార్థ్యమెంతో తెలియదుకాని, ఆ పద్యభావం మాత్రం సవతిని అధిక్షేపించే భావాన్నే వ్యక్తం చేస్తుంది. స్త్రీ సహజమైన లాలిత్యం మాత్రం ఈ పద్యంలో భాసిస్తుంది. కవితాధర్మం హృద్యంగా ఆకట్టుకుంటుంది. ఆపద్యంలో ఒక జీవత్కథ తొంగిచూస్తూ అజరామరంగా నిలచింది. ఆ పద్య మిది :

ఏకవనితల్ మముం దలప
నేమి పనో? తమ రాడువారు కా
రో? కలపించు నేర్పరుగ
గో? తము కౌగిటిలోన నుండగా
రావది ఏలరా విజయ
రాఘవ యంచిలుదూరి బల్మిపై
తీవరకత్తె పెనగి
తీసుకవచ్చితినా తలోదరీ?...

నాయకరాజుల యుగంలో రంగాజమ్మ తరువాత ప్రఖ్యాతిమైన కవయిత్రి ముద్దుపళని. ఆమె రచించిన రాధికాసాంత్వనం వీరశృంగార కావ్యంగా ప్రఖ్యాతమైంది. శ్రీకృష్ణదేవరాయల యుగంలో మల్లనాది కవులు ఈయితివృత్తాన్ని స్వీకరించేఉన్నారు. పదకొండో శతాబ్దం వాడైన జయదేవుని సంస్కృతకావ్యం గీతగోవిందం ప్రఖ్యాతమైన నాటినుంచి తక్కుంగల కవులలో ఈయితివృత్తంపై లాలస ఎక్కువగానే ఉండిఉంటుంది.

ముద్దుపళని కావ్యం 1790 ప్రాంతంలో విరచింపబడింది. దీనికిగల విశిష్టతవల్లనే మన సాహిత్యంలో దీని కొక ప్రత్యేకత ఏర్పడింది. దీనిని నమూనాగా స్వీకరించి సత్యభామా సాంత్వనాది కావ్యాలెన్నో పుట్టడం కూడా దీని ప్రభావాన్ని విస్పష్టీకృతం చేశాయి.

ముద్దుపళని కవిత్వంలో ప్రధానరసం సురతశృంగారమే! స్త్రీయవ్యక్తిత్వంలో లభించిన భోగలాలసత్వమూ, విలాసమయ జీవితమూ రాధామాధవుల పరంగా ఉన్నతీకరించి కావ్యపరమొనర్చిందా అనిపిస్తుంది. 'లలితగుణపేటి శ్రీ ముద్దుపళని బోటి' గా సమకాలికులచే కీర్తింపబడినట్లు తానే చెప్పుకుంది. ఈమె కావ్యం చదివిన వారికి ప్రశస్తి నిరర్థక స్తుతి కాదని తోచకమానదు. ఆమె రచనా సంవిధానంలో లాలిత్యమొక ప్రధానగుణం. తన వ్యక్తిత్వ ముద్ర కావ్యంలో అక్షరాక్షరంలోనూ చిరావాసం కల్పించుకుంటుంది.

'మదీయ పూర్వజన్మతపః ఫల సారుండును, సుగుణాభిరాముండును, నగు వీర రాఘవదేశిక సార్వభౌముని. సంకీర్తనానికే అంకితం మొనర్చుకొన్న తన రసజ్ఞతా శేముషి ధన్యమైనట్లుగా భావిస్తుందామె! ఈమె పేర్కొన్న వీరరాఘవుడు విజయ రాఘవనాయకుడే తప్ప అన్యులు కారనేది స్పష్టమే! ముద్దుపళని జీవితం ఎత్తిన సుఖశీల లతాంగంగా రాధికాసాంత్వన కావ్యం అమరింది.

లలితమైన శయ్యకు, హృద్యమైన పద్యరచనా నైపుణికీ, జాను తెనుగు నుడికారపు అచ్చుముచ్చటలకూ ముద్దుపళని కవిత్వం కాణాచి. ప్రతి పదమూ అనుభూతి పారమ్యమును మూటగొంటుంది. గాన మాధుర్యం సౌందర్య ప్రభాసగా సర్వత్రా ప్రసరిస్తుంది :

చెక్కుటద్దములపై చెమట బిందువు లూర
కస్తూరి తిలకంబు కరగిజార...
కరకంకణంబులు ఘల్లుఘల్లని మ్రోయ
నలువంకజూపు వెన్నెలలు గాయ...
స్తనభారమోర్వక తనుమధ్య మసియాడ
నిండుమోహంబుతో నీవి వీడ ..
గబ్బిసిబ్బెపు టుబ్బుగుబ్బచన్గవ పొంగ
బాహుమూలోజ్జ్వల ప్రభ లెసంగ...
కటితటంబున కీల్జడ నటనమాడ
గగనమునకేగు నిట్టూర్పు గాడ్పు తోడ
తాళగతు లొప్ప సంపెంగతైల మంటి
రమక మెద నాటి హరికి రాధావధూటి!

ఈ పద్యంలో ప్రతి రెండుపాదాలకు అంత్యప్రాసల బిగింపు సీసానికి అదనపు

సౌందర్యాన్ని ఘటిస్తుంది. ముద్దుపళని నాయికచే నాయకునకు తలంటు పోయించడం తరువాతి కవుల కెంతో ప్రేరణ కలిగించింది. శేషం వెంకటకవి తారావషాటిచే చంద్రునకు తలంటించినపుడు ముద్దుపళని ఒరవడి ఎంతగానో పలకొస్తున్నాడు. లాలిత్యంతోపాటు లాలస ప్రతిపద్యంలోనూ చోటుచేసుకొని - ఒకే పద్యంలో స్తనభారమూ, కుచ వర్ణనంటి అవయవ విశేషం చోరబారడం ఔచిత్య మనడానికి విమర్శకహృదయం చప్పున అంగీకరించదు.

పద్యరచనాది నియమమే అప్పు- రచనోద్వేగంలో సంయమనం పాటించక పోవడం ప్రబంధకవులందరిలోనూ కనిపించేదే! అలవాటుగానో పరిపాటిగానో మారినంత మాత్రంలో పొరబాటు గుణం కాబోదు. పై పద్యం ఆమె రచించిన అసంఖ్యాకశృంగార పద్యాలకు మచ్చుతునక. లలితమైన శైలికి, సరసమైన వర్ణనకూ ముద్దుపళని కవిత్వమంతా ఉదాహరణప్రాయమే. ఆమె పద్యరచనా ప్రవాహంలో చిప్పిలుతూ శైలి పీచే వీర శృంగారం అంటటిని ఉదాహరించవలసి వస్తే ఈ కాలపు సాహితీ రసజ్ఞులు ఆగికోలేరు. అనేక సందర్భాలలో దుస్సహమైన అంగాంగ వర్ణనకూ, శయనాగారపు రహస్యానుభవాల సమున్నిద్ర శృంగార రసావిష్కరణకూ ఆమె కావ్యం పతాక సన్నిభమై నిలుస్తుంది. నవదంపతులు చలువ వెన్నెలల తేనెరాత్రుల కద్దుపనగా ఈ కావ్యం చదువుకోతగినది.

రాధాదేవి కనుసన్నలలో పెరిగిన ఇళాదేవి యౌవనవతి కాగానే ఆమెను చేజేతులా స్వామి కైంకర్య మొసర్చి రాధ విరహాగ్నిచ్ఛటల కాహుతికావడం యిందలి ప్రధాన ఇతివృత్తం. తనకు వశంవదుడై, శృంగారవిద్యలలో అంతేవాసియై రాటుదేరిన శ్రీకృష్ణుని మెప్పులందుకోనేందుకు ఇళాదేవికి ఎన్నో రహస్యా లుపదేశిస్తుంది రాధ. తీరా కృష్ణుడు ఇళాదేవితో రంజించ నారంభించేసరికి విరహంతో కాలిపోతుం దామె.

ఇది ఆనాటి ఒక ప్రధాన జీవనేతివృత్తాన్ని ప్రతిబింబిస్తోం దని తత్‌జ్ఞు లంటారు. రంగాజి ముద్దుపళనికి గురువై సకల విద్యాపారంగతనుగా చేసి విజయ రాఘవ నాయకునకు సమర్పించిం దట. తీరా ముద్దుపళని పట్ల తీరనితమకంతో అతడు మోజుపడుతూండేసరికి రంగాజి ఎంతో విరహాతప్తయై క్షోభించిందట! ఇది ఒక జీవిత వాస్తవికతకు సంబంధించిన ప్రధానఘట్టమై ఉండగా - దీనినే రాధా మాధవుల పరంగా ప్రబంధీకరించిం దని అనుశ్రుతంగా వినవస్తున్న వివరణ!

ఇందలి సత్యాసత్యాలతో రాధికా సాంత్వన పాఠకునికి ప్రత్యక్షసంబంధం లేకపోయినా ఈ ఇతివృత్తం మాత్రం పూర్తిగా లౌకికమైనదే తప్ప పురాణగతం కాదని తెలుస్తూనే వుంది. పూర్వ మెప్పుడో మచిలీపట్నంలో వెలసిన 'శృంగారకావ్య ప్రకాశకులు' దీనిని ముద్రించగా బ్రిటిష్‌ప్రభుత్వం నిషేధించిం. ఆశృంగార కావ్యమాలకు ప్రఖ్యాతి గాంచయి. కీ. శే. వల్లాది రామకృష్ణ శాస్త్రిమనీషులు సంపాదకత్వ బాధ్యత వహించా రని పెద్దలు చెబుతూంటారు.

దేశంలో కొద్దిమంది వద్ద మాత్రమే ఆనాటి రాధికా సాంత్వనం ప్రతు లుండేవి. జనబాహుళ్యానికి దాదాపుగా అలభ్యమైపోయిం దా కావ్యం. ఇటీవల ఎమెస్కో వారు జేబుపుస్తకంగా ప్రచురించి అందరికీ అంగుబా టొనరించారు.

ఈ కావ్యంలో ఆనాటి సాంఘిక మర్యాదలు, భోగవతుల విలాసజీవన రేఖలు, సామాజిక ఘట్టాల వాస్తవిక తలూ ఎన్నో వర్ణితములయ్యాయి. పదిహేడు పద్దెనిమిది శతాబ్దాల దక్షిణ భారతదేశపు సాంఘిక చరిత్ర స్థూల రేఖలతోనైనా దర్శనమీయకపోదు.

ఇళాదేవీ శ్రీకృష్ణులకు శోభనం జరుగుతుంది. వధూవరు లిరువురూ పీటలపై కూర్చుంటారు. పుణ్యస్త్రీలందరూ సదస్యులై వుంటారు. కాని రాధమ్మ మాత్రం ఎక్కడా కనిపించదు. ఈర్ష్యాందోళితయై ఎక్కడో మారుమూల మసుగుతూ వుంటుంది. లగ్న సమయం సమీపించిది. రాధ రాలేదు. నలుగురు ముత్తైదువలు వెళ్ళి రాధను బలవంతం చేస్తారు. చెప్పగా చెప్పగా ఆమె బయల్దేరుతుంది. అప్పు డామె ఆకారవైఖరి ఎలావుందో ముద్దుపళని తాను స్వయంగా చూసి మనకి చూపిస్తున్నంత హృద్యంగానూ వాస్తవ దృశ్యీకరణం చేస్తుంది.

'వలపుల చంద్రకావి జిగి
    పావడరంగు లెసంగ పైఠిణీ
జిలిబిలి చీరకుచ్చెళులు
    చిందులు త్రొక్కగ చంటిరెక్కలో
పలి చనుగుబ్బ లుబ్బగను
    బంగరుటందెలు ఘల్లు ఘల్లనన్
జలజదళాక్షి వచ్చె రభ
    సంబున నయ్యదురాజు నొద్దకున్ !

బంధుజనులంతా ఆనందించారు. వారికి శోభనంజరుగుతుంది. మధ్యాహ్న పు

---

* షెడ్యూల్డుకులాలు జరుపుతున్న పోరాటం విజయవంతమైతే దేవుళ్ళను నిర్వీర్యులను చేసిన బ్రాహ్మణులకు కూడ మేలు. - శ్రీ జగ్ జీవన్.

* ఈ బ్రాహ్మణ క్షేమాభిలాష క్షుద్ర రాజకీయవిముక్తి ఆసన్నం అవడానికి సూచన కాదుగదా !

విందులు పూర్తిఅయ్యాయి. ఎప్పుడు పొద్దువాటారుతుందా, రాత్రి పడుతుందా అని వధూవరులకే కాక - ఆ ప్రజనానికి కూడా ఆసక్తిగా ఉండదట! మనసుల ఆత్రమువలె ఆలస్యంగా రాత్రిపడిందట! వధూవరులుసంతోషసంభరితు లయ్యారు. ఇళాదేవితో కలసి శ్రీకృష్ణుడు క్షీరాన్నం ఆరగించాడు. శోభనపుగది ప్రవేశించారు. ప్రస్తుతకాలంలో వివాహంశోభనంతోనే పరిసమాప్తి పొందుతున్నది. కనక చాలా మంది యిప్పటివాళ్ళకీ ఆచారపుతంతులు తెలియకుండా నేమటుమాయమయ్యాయి. కాని దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం వరకూ ఈ తంతు లన్నీ జరుగుతూనే ఉండేవి.

మహాభోగిని ముద్దుపళని ఆ శోభనపు గదిని ఎంతముద్దుగా అలంకరించిందో చూడాలి!

'చలువలెసంగు చప్పరపు
  జంత్రపుబొమ్మలు పావురంబులున్
చిలకలమంచమున్ విరులు
  నించిన సెజ్జయు కీచుబుర్రయున్
తలగడదిండ్లు దోమతెర
  తళ్కునుడోలిక నిల్వుటద్దమున్
గల పడకింటి కేగి యట
  కంజవిలోచను డుండె నత్తరిన్ !

అనే పద్యంలో తెలిపిన శయనాగార సంబంధి వస్తువులు చాలా మన కాలం నాటికి అదృశ్యమైపోయాయి. కీచుబుర్రయేమిటో దాని అవసర మేమిటో సహస్రమాసజీవు లెవ్వరైనా వివరించాల్సిందే!

పావడకొసలు బిగించి కుంకుమ పూవంచు కోక కట్టి, మొగలిరేకుల జడ వేసి, ఇళ నలకంరించింది రాధ. చెలికత్తె లంతా ఆమెని వేళాకోళాల ఆటపట్టిస్తున్నారు. ఇళ చిన్నబోతుంది. అప్పుడు రాధ ఎంతో ఆప్యాయంగా బుజ్జగిస్తుంది. భర్తతో ఎలా మసలుకోవాలో బోధిస్తుంది. ఆ బోధను నేటి సభ్యతాలోకం లోలోపల చదువుకుందుకే బాధపడుతుంది. కావలసిన రసికు లెవరైనాఉంటే 'చెలువుండుకౌగిట చేర్చినయపు డీవు....' వంటి పద్యాలను చదువుకోవలసిందే!

అలా బోధించి సుముహూర్తం సమీపించగా ఇళను తోడ్కొని రాధ పడకగదికి పోతుంది. శుభాసీనుడై వున్న శ్రీకృష్ణుని సమీపిస్తుంది. 'ఈమె అతికోమల యౌవనవతి, నీ వెవిధంగా ఏలుకుంటావో మరి! నీదే భారంసుమీ!' అంటుంది. 'ఐనా నీకు తెలియని దేముంది? నీవు దక్షిణనాయకుడవుకదా!' అంటుంది. నర్మగర్భంగా తనను మరచి పోవద్దని సూచన! పైగా యిలా హెచ్చరిస్తుంది.

'నీకు సరియగునటులెల్ల నేను కాను,
పాలమెరుంగని దిది, వట్టిముగ్ధ కాని!
తెలిసి ఎట్ల నేలెదో నీకు తెలుపవలెనె?
దేవ దక్షిణ నాయకాధిపుడ వీవు!'

అంటూ అత డామెతో ఎలా మెలగవలసి వుందో - 'కొన నాల్కగొని ...' అనే పద్యంలో వివరిస్తుంది.

గడిదేరి, జలపోరి, గురికట్లువంటి వందలాది తెలుగు నుడికారపు సొబగులు అలవోకగా ముద్దుపళని పలుకుబడిలో మెరిసిపోతూంటాయి. తెలుగుమాటల సొగసులు తెలుసుకుందుకైనా ఈ కావ్యం అవశ్యం పఠనీయమే!

హారి కప్పగింతలుపెట్టిన రాధ హృదయంలో ఖేదామోదాలు పెనగొనడం చక్కగా వర్ణిస్తుంది ముద్దుపళని! రాధ గదితలుపులు చేరవేసి బయటకు వచ్చిందే కాని తన కా క్షణాలు దుర్భరమైపోయాయి. సొమ్మసిల్లియ్యవచ్చు, సొమ్మందమియవచ్చు, నియ్యరాని ప్రాణ మియ్యవచ్చు, తనదు విభుని వేరు తరుణిచేతికనిచ్చి, తాళవశమె ఎట్టివారికైన?' అని పశ్చాత్తాపం చెందుతుంది. రాత్రంతా నిప్పుల శయ్యగా మారుతుంది. ఈసందర్భంలో ముద్దుపళని లేఖిని నిర్నిరోధంగా సాగిపోతుంది.

జీవన వాస్తవికతా ప్రదర్శనలతో, హృదయావేదనల అవిష్కరణైక నైపుణ్యంతో, తాను నిర్మించబోయే కావ్యోచిత పాత్రచిత్రణకు సరిపడే జీవితానుభవ సిద్ధిని పొందుపరుస్తుంది. ముద్దుపళని కావ్యం చదువుతుంటే - ఒక ఏకాంతిక జీవనరహస్య వృత్తం తెలుసుకుంటున్న ఆసక్తి జనిస్తుందే తప్ప వస్తుగత నిర్లిప్తత పొడమదు.

గోదాదేవి విరచితా లని చెప్పబడే పాశురాలకు ముద్దుపళని రచించిన సీసపద్యానువాదం ఎంతో రమణీయ రచన. తరువాతికాలంలో ఎందరో వీనికి తెలుగు చేసినా వీటిమాధుర్యాన్ని కుంచించలేకనే పోయాయి. అట్టి విశిష్టరచన - ఎమ్మెస్కో వారి ప్రస్తుత ముద్రణలో చేర్చబడకపోవడం నిజంగా శోచనీయమే.

(24-9-1953 న యిచ్చిన నా ఉపన్యాసానికి రాసుకున్ననోట్సు చాలవరకు ఆధారం.)

—•••—

* ఇంటిపనులుచేయాలె - పిల్లలుకనాలె - 20-2-80 ఆంధ్రప్రభ వారపత్రికలో శ్రీ గోపాలరెడ్డిగారి రచనలోనిది.

* 'పిల్లలు' కర్మ సరిగా ఉండక్కర్లేదా ?

# జానపదసాహిత్యం - చంద్రమ్మపాటలు

- శ్రీ డా. ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

జానపద సాహిత్యంలో రకరకాల పాటలున్నాయి. మానవులు వయోభేదాన్ని పట్టి పాడే పాటలూ ఉన్నాయి. పని భారాన్ని తగ్గించేందుకు పాడేపాటలతో పాటు కాలక్షేపం కోసం, వినోదం కోసం పాడేపాటలూ ఉన్నాయి. ఆయా కాలాల్లో, పండుగ పబ్బాలలో, జాతర్లలో పాడేపాటలూ ఉన్నాయి. జానపద సాహిత్యంలో ఈ చంద్రమ్మపాటలు ఒక కోవకు చెందిన పాటలు. చాలావరకు మనవ్యవహారంలో చంద్రుడు చందమామ అని ఉండడం ప్రసిద్ధం. కానీ ఈ జానపదుల వాడుకలో చంద్రుడు చంద్రమ్మ అయిపోయాడు. కొంతవరకు లింగం మార్పు కనిపిస్తుంది. చంద్రుడై మార్చుకోలేనుగానీ జానపదులు మార్చివేశారు. ఇవి యుక్తవయస్కులైన ఆడపిల్లలు పాడుకొనే పాటలు. పల్లెటూళ్లలో మొలకల పున్నమి అంటే మాఘమాసంలో గాని, చైత్రమాసంలోగాని వచ్చే పౌర్ణమినాడు గొప్ప జాతరగా పాటిస్తారు. పాలారబోసినట్లుండే పున్నమి వెన్నెట్లో ఊరి రచ్చబండ వద్దగానీ, ఊరిమధ్య విశాలప్రదేశంలోగానీ ఆడపిల్ల లందరు కులమత భేదాలులేకుండా చక్కగా అలికి, రకరకాల ముగ్గులు వేసి గౌరీదేవిని పూజిస్తారు. వాస్తవానికి ఈ పాటలు చంద్రమ్మ పాటలని పేర్కొన్నా పూజ గొనేదేవత గౌరీదేవి. ఈపాటల్లో కొన్ని చంద్రమ్మ పాటలు. ఒకటి రెండు గబ్బిలాయిలో వెన్నెలాయిలో అనే గొబ్బిళ్ళపాటలు. వెన్నెలాయిల పాటలు ఎక్కువగా గౌరమ్మ పాటలుగా ఉన్నాయి 'నాసేకరణలోని ఈ పాటలు పద్యాలు గున్నాయి. వాటిలో కొన్నింటినే ప్రస్తుతం పరిశీలిద్దాం. ఇది అంతర్జాతీయ బాల సంవత్సరము కనుక ఈపాటల్ని పరిశీలించడంలో సామంజస్య ముంది.

ఈ పాట లిలా ప్రారంభ మవుతాయి.

'మామిడిదుక్కలు దుందుమా ॥మామిడి॥
మామిడు దుక్కలు మదన్న రేకలు
జవ్వాజికడ్లు కారమంచేకన్నెలాల
మామిడి దుక్కలు దుందుమా ॥మామిడి॥
మామిడి మలక[1] లౌదామా
॥మామిడిమలక॥
మామిడి చెట్టు లౌదామా
॥మామిడిచెట్టు॥
మామిడిపూత లౌదామా
॥మామిడిపూత॥
మామిడిముగ్గ[2] లౌదామా ॥మామిడిముగ్గ॥
మామిడి పిందె లౌదామా ॥మామిడిపిందె॥
మామిడి కాయలౌదామా ॥మామిడికాయ॥
మామిడి పండు లౌదామా
॥మామిడిపండు॥
మామిడిదుక్కలు దుందామా ॥మామిడి॥
(1 మొలక. 2 మొగ్గ)

ఇందులో చేలు దున్నడం, మామిళ్ళు నాటడం మొదలుకొని పండేదాకా విషయం వివరించ బడింది. మరోపాటలోనూ ఇదేరీతిగా వర్ణితం. ఇది గొబ్బిళ్ళపాట.

'చెట్టు చెట్టక్కమ్మ గబ్బిలాయిలో
ఏమిచెట్టక్కమ్మ గబ్బిలాయిలో
జాలరితోటలో గబ్బిలాయిలో
జాజిముగ్గక్కమ్మ గబ్బిలాయిలో
నందాయనందాయ నాలేటిగుసులాల
జీరెంగిదామా గబ్బిలాయిలో
ముగ్గముగ్గక్కమ్మ గబ్బిలాయిలో
ఏమిముగ్గక్కమ్మ గబ్బిలాయిలో ॥జాలారి॥
పూవుపూవక్కమ్మ గబ్బిలాయిలో
ఏమిపూ వక్కమ్మ గబ్బిలాయిలో
॥జాలారి॥

పూవుపూవక్కమ్మ గబ్బిలాయిలో
ఏమిపూవక్కమ్మ గబ్బిలాయిలో ॥జాలారి॥
పిందెపిందెక్కమ్మ గబ్బిలాయిలో
ఏమిపిందక్కమ్మ గబ్బిలాయిలో ॥జాలారి॥
కాయకాయక్కమ్మ గబ్బిలాయిలో
ఏమి కాయక్కమ్మ గబ్బిలాయిలో
[1]పాండుపాండక్కమ్మ గబ్బిలాయిలో
॥జాలారి॥
ఏమి పాండక్కమ్మ గబ్బిలాయిలో
॥జాలారి॥

[1. పండు]

ఇలాగే గౌరీదేవిని సంబోధిస్తూ పాడే పాట ఈ క్రిందిది.

'కుంకంలో పుట్టితో గౌరమ్మ నీవు,
కుంకంలో పెరిగితివా గౌరమ్మ నీవు
సౌరేటి జొన్నల్లో చంద్రప్ప మేడల్లో
వెండికుంపట్లల్లో బంగారిపెట్టెల్లో
నీరప్పజల్దిలోనే గౌరమ్మా
వొప్పుకొనే నోములా
పేదవారి నోములమ్మా గౌరమ్మ
వొప్పుకొనే నోములా
పసుపులో పుట్టితో గౌరమ్మ నీవు
పసుపులో పెరిగితో గౌరమ్మ నీవు.
॥సౌరేటి॥

కుంకుమలో పుట్టితివా గౌరమ్మ నీవు
కుంకుమలో పెరిగితివా గౌరమ్మ నీవు
॥సౌ రేటి॥

కడవలో పుట్టితివా గౌరమ్మ నీవు
కడవలో పెరిగితివా గౌరమ్మ నీవు
॥సౌ రేటి॥

ఇసుకలో పుట్టితివా గౌరమ్మ నీవు
ఇసుకలో పెరిగితివా గౌరమ్మ నీవు
॥సౌ రేటి॥

చెంబులో పుట్టితివా గౌరమ్మ నీవు
చెంబులో పెరిగితివా గౌరమ్మ నీవు
॥సౌ రేటి॥

ఇందులో 'గౌరమ్మ' పూజ చేస్తూ 'పేదవారి నోములమ్మా గౌరమ్మ ఒప్పుకొనే నోములమ్మా' అంటూ తమ నిరుపేద తనాన్ని కూడా తెలిపి, దాన్ని గౌరమ్మ అంగీకరిస్తుందనే దృఢ విశ్వాసాన్ని సైతం ప్రకటించారు జానపదులు.

పల్లెటూళ్ళకు సహజమైన అనేక రకాల ఎన్నులు (కంకులు) తెచ్చి గౌరీదేవికి పూజిస్తా మంటూ పాడే పాట ఈ క్రిందిది. ఆకంకులు పాలకంకు లట. పాలు పోసుకుంటున్న కంకులు చాలా రుచిగా వుంటాయి.

'కలకేటి కంచాలు తెత్తునే గౌరీ
కలికిమేడలమీద వత్తునో గౌరీ
1 సొద్దెన్ను సొద్దెన్ను తెత్తునే గౌరీ
సొద్ద సుంకలపాలు పోతునో గౌరీ
॥కలకేటి॥

జొన్నెన్ను జొన్నెన్ను తెత్తునే గౌరీ
జొన్న సుంకలపాలు పోతునో గౌరీ
॥కలకేటి॥

కొర్రెన్ను కొర్రెన్ను తెత్తునే గౌరీ
కొర్ర సుంకలపాలు పోతునో గౌరీ
॥కలకేటి॥

రాగెన్ను రాగెన్ను తెత్తునే గౌరీ
రాగిసుంకలపాలు పోతునో గౌరీ
॥కలకేటి॥

ఇగ్గునాలీయనాలే గౌరమ్మ
గజ్జెలేతోరనాలే గౌరమ్మ ॥కలకేటి॥
[1. సజ్జ + ఎన్ను]

ఇలాగే రకరకాల కంకులతో పాటు వివిధ విధాలపూలు గౌరీపూజకు తెచ్చి పూజిస్తా మంటూ పాడతా రీ క్రింది గేయంలో.

చెమ్మలో చెమ్మడమ్మా గౌరమ్మ
చెండుమల్లె పూవులమ్మా
అవన్ని తెత్తునమ్మా గౌరమ్మ
నిన్నె పూజింతునమ్మా
దుత్తతో దుత్తడమ్మా గౌరమ్మ।
దొత్తూరు పూవులమ్మా ॥అవన్నీ॥
కడవలో కడవడమ్మా గౌరమ్మ
కలువపూవులమ్మా ॥అవన్నీ॥
[1 దత్తూరు]

ఇంతటితో పూజ పూర్తి కాలేదు. గ్రామంలో వివిధకులాలవారి ఇళ్లలోంచి 'డుకలశాలు' గౌరీపూజకోసం వచ్చాయట :-

1 ఈదీఈదీనుంచి కాపులూరి నగరినుంటీ
జోడు కలశాలెల్లనమ్మా చందచేరమ్మకీ
ఈదీఈదీయంటే ఈడిగోల్లు నగరినుంటీ
గెటుమకడవలు ఎల్లిరమ్మా చంద్రమ్మకీ
4 సాందూసాందూ సాంసునుంటీ
చాకలోల్లు సాందునుంటీ
చలువ చీరాలెల్లిరమ్మా చందరమ్మకీ
ఈదీఈదీ ఈదినుంటీ మంగలోరిగేరినుంటీ
సన్నమీలా లెల్లిరమ్మా చందరమ్మకీ
ఈదీఈదీ ఈదినుంటి
మాదిగవారి గేరినుంటి
జోడుతిప్పెట్లు ఎల్లిరమ్మా చందరమ్మకీ

[1. వీథి 2. వెళ్లేనమ్మా 3. ఈడిగవాళ్ళు 4. సందు]

కులభేదం పాటించక గ్రామీణప్రజలు అందరూ ఒకటిగా జీవిస్తూ ఉండేవారని గ్రామీణప్రజల్లోని చక్కని సమైక్యం ఇందులో స్పష్టమవుతుంది. ఈ నాడు కులమతాలు పాటించరాదని రాజ్యాంగంలో ప్రతిపాదితమై ఉన్నప్పటికీ దానికి వ్యతిరేకంగా లోకం నడుస్తుందన్న విషయం మన కందరికీ తెలిసిందే. కాని ఆ నాటి గ్రామీణ వ్యవస్థలో ప్రజలస్థితులు చాల మానవతా దృక్పథంలో ఉండేవన్న విషయం సైతం మనకు స్పష్టమవుతుంది. మనవృత్తివశాత్తు అతివేగంగా మారుతున్న సమాజంలో, అస్తవ్యస్తమైన ఆర్థికవిధానంలో నీతి నిజాయితీలు ఎగురుతిరుగుతున్న ఈనాడు అలనాటి పరిస్థితులు ఉన్నత భావాలు పోయి అవహేళనకు దారితీశాయంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఆ సమైక్య భావం సమరసభావం ఈనాడు ఎక్కడో తప్ప కన్పించవంటే అత్యుక్తి కాదు, సహజోక్తి।

చివరికి ఈ పాటలు గౌరీదేవికి పవళింపు సేవలాగా ఈ క్రిందిపాటతో ముగుస్తాయి.

'అన్న 1వేసిన అరగల మిందా।
మామా 2వేసిన మొండ్లకిందా
తలతల తిప్పులకిందా
సల్లంగ నిద్రపోమ్మ సొంతం గౌరమ్మా'
[1 మీద 2 మానుల (మ్రానుల)]

ఇలాగా గ్రామీణులలో ఆడపిల్లలు పాడే పాటలు నిసర్గమనోజ్ఞ భావ పరిపుష్టమై సహజ సుందరమైన భావంతో పల్లెటూళ్ళలో ఈనాడూ వినిపిస్తూనే ఉంటాయి. ఆపాటలువిని, ఆవినోదం చూస్తేనప్పు ఆనందించలేం. అలాంటి వాటిని సేకరించి భద్రపరచవలసిన బాధ్యత సాహితీ ప్రియులపై వుంది.

—···—

# ఈ పక్షంలో

## అభినందన సభ

3-2-80 ఆదివారం ఉదయం గం 10-30 లకు వీరేశలింగ పురమందిరమున రిపబ్లిక్ డే నాడు ఢిల్లీలో జరిగిన జాతీయ కవి సమ్మేళనములో పాల్గొని వచ్చిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి అభినందన సభ జరిగినది. పురప్రముఖు లనేకులు వారి ప్రతిభను కవితావిశేషములను ప్రస్తుతించిరి. రాజమండ్రి మునిసిపాలిటీ వారి శతవార్షికోత్సవముల సందర్భమున శ్రీ శాస్త్రిగారికి పౌరసన్మానము జరపు నిర్ణయము సభలో ప్రకటింపబడుట మిక్కిలి సముచితమై యున్నది.

వేదార్థ ప్రవచనంలో ఆంధ్రదేశానికి మకుటాయమానులైన శ్రీ రేమిల్ల సూర్య ప్రకాశ శాస్త్రిగారికి, వేదపాఠన ఉచ్చారణములలో యావద్భారత దేశానసాటి లేని అమూల్య రత్నమైన శ్రీ విశ్వనాథ జగన్నాథ ఘనపాఠిగారికిని అట్టి పౌరసన్మానము జరపించుట రాజమండ్రి కనీస ధర్మమని ఈ సందర్భంలో చెప్పక తప్పదు.

♦♦ ♦♦ ♦♦

## త్యాగరాజ నారాయణదాస సేవాసమితి వార్షికోత్సవ గాన సభలు

1980 జనవరి 30 తేదీనుండి వారంరోజుల పాటు రాజమండ్రి హిందూసమాజం ఆవరణములో పై సమితి యాజమాన్యమున త్యాగరాజ గానసభలు జయప్రదముగా జరిగినవి. ఈ సంవత్సరం ఇంచుమించుగా కార్యక్రమములన్నియు సరిగా నిర్ణీత సమయమునకు ఆరంభింపబడుట విశేషము.

మృదంగవిద్వాంసుడు శ్రీ కమలాకర రావుగారి సువర్ణకంకణ సత్కారము ప్రత్యేకతను సంతరించుకొన్నది. శ్రీ బాలమురళీకృష్ణ కచేరి రోజున ఎవరును అదుపుచేయలేనంతగా ఇసుకవేస్తేరాలనంతగా జనసందోహము హాజరైనది. హిందూసమాజ ఆవరణంలో ప్రతిఅంగుళము జనసమ్మర్దముతో నిండిపోయినది. ఎంతో ఓరిమితో అన్ని వర్గాలవారినీ గానామృతముతో ఆనందింప జేసిన శ్రీ బాలమురళీకృష్ణ ఎంతైనా అభినందనీయులు. వచ్చే సంవత్సరము ప్రవేశరుసుము వసూలు చేయవలయునను ఆలోచనకు సమితివారువచ్చుట - కారణము లేవియైనను - గత ముప్పదిసంవత్సరముల నుండి అనుశ్రుతముగా వచ్చుచున్న ఉదాత్తతకు అనుగుణము కాదనవచ్చును. పునరాలోచన చేయఁబడు నని ఆశించుట అసమంజసం కాదు.

♦♦ ♦♦ ♦♦

## వేదశాస్త్ర పరిషత్తు

### జ్యోతిశ్శాస్త్రజ్ఞుల సభ - తీర్మానముల సరియైన పాఠము.

రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్తు యాజమాన్యములో 20, 21, మరియు 22 జనవరి, 1980 సం॥లో జరిగిన జ్యోతిశ్శాస్త్ర సభలలో తిరుపతి దేవస్థానములోని హిందూ ధర్మరక్షణసంస్థ కార్యదర్శియైన డాక్టరు శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి అధ్యక్షతను ఈ క్రిందితీర్మానములు చేయబడినవి:-

(1) మన పూర్వులైన హిందువులు అనాదినుండియు గ్రహములను క్రాంతివృత్తము (నక్షత్ర చక్రము) నుండియే గుర్తించుచున్నారు. కనుక క్రాంతివృత్తీయ (నిరయన) గ్రహగణితమే గ్రహించవలసియున్నది. నక్షత్ర చక్రమందు గల మొదటి బిందువును అశ్విని ప్రథమబిందువుగా ఎల్లప్పుడును గుర్తించవలసియున్నది. ఇంతేకాక భారతీయులు, గ్రహములతోను నక్షత్రములతోను సంబంధము కలిగి యున్నారు. కాని ఊహాబిందువులతో వ్యవహరించలేదు. ఇదిగాక అధికమాస క్షయమాసములు కూడ నిరయన పద్ధతిలో మాత్రమే అనుబంధించి యున్నారు. కనుక భారతీయ పంచాంగ గణితము నిరయన పద్ధతిలోనే ఉండి తీరవలెను.

(2) పంచాంగ గణితములు ప్రధానముగా మనదేశములో రెండుపద్ధతులుగా ఉన్నవి.

(i) సైద్ధాంతిక పద్ధతి పంచాంగములు.
(ii) దృగ్గణిత పద్ధతి పంచాంగములు.

మన ప్రాచీనాచార్యు లందరు ఐక్యకంఠముతో చెప్పినట్లు రవ్యాది సర్వగ్రహముల యొక్క గణితములును దృక్తుల్యములుగా (ప్రత్యక్షమునకు సరిపడునట్లుగా) పంచాంగ గణితములను చేయుటయే ముఖ్యపక్షము.

(3) ప్రస్తుతము అమలులో నున్న రైవతపక్ష, చైత్రపక్ష, ఛాయార్క సంస్కృత కరణార్క పక్షముల నుండి సాధించబడిన అయనాంశముల యొక్క సత్యత్వమును నిరూపించుటకు ప్రాచీనాచార్యులలో అగ్రేసరులైన ఆర్యభట్ట, వరాహమిహిర, సూర్య సిద్ధాంత, ద్వితీయ భాస్కరాచార్యుల యొక్క సిద్ధాంతముల ననుసరించ వలసియున్నది.

(4) అనగా అయనాంశములను పునర్విమర్శచేసి విమర్శ ప్రకారము సరియైన అయనాభావ కాలమును నిర్ణయించవలెను.

పీసపాటి సూర్యప్రకాశం,
కోశాధికారి,
వేదశాస్త్ర పరిషత్తు.

♦♦ ♦♦ ♦♦

## VEDASASTRA PARISHAT, RAJAHMUNDRY.

### Jyotish Sastra Conference

The following resolutions are unanimously passed at the Jyotisha Conference conducted on 20 th, 21 st and 22 nd January, 1980 with Dr. Sri Dhulipala Arka Somayaji, M. A., Ph. D., Secretary, Hindu Dharma Rakshana Samstha, T T. Devasthanam, Tirupati as Chairman.

1) The Nirayana system alone should be adopted because it has been the tradition of the Hindus from times immortal for the reason that the totality of planets revolve only on the ecliptic plane and threfore the ecliptic alone comes into the picture and the Zeropoint of the ecliptic is always taken as the first point of Aswani. The Hindus are concerned with the stars and planets in flesh and blood, and not with imaginary points. Also the principle of Adhikamasa and Kshayamasa is tagged to the Nirayana system alone.

2) There are broadly two systems of Panchanga Computation in the entire India (i) The Saidhantika and (ii) The Drigsidhanta. The basis of our Panchanga calculations should be to make it tally with the observed positions of the Sun and Planets, as mentioned in one voice by all the ancient Acharyas.

3) Regarding the veracity of (i) Raivata, (ii) Chaitra Paksha, (iii) Charaka Karanarka methods with reference to 'Aynamsas' and to ascertain the correct methodology in this behalf. This question has to be thoroughly examined evolving a scientific method that achieves accordance with the statements of a galaxy of ancient astronomers Aryabhata, Varahamihira, Surya Sidhanta and Bhaskara II.

4) In other words the question of Aynamasa requires to be revised and the correct Ayanabhavakala must be ascertained in the light of that rivision.

Sd/- Sri D. Arka Somayaji,
Chairman.

Sd/- Sri V. K. Dongare.
Sd/- Sri M. L. Sarma.
Sd/- Sri Brajkishore Jha.
Sd/- Sri Ramachandra Jha.
Sd/- Sri Lanka Venkatrama Sastry Somayaji - Nedunuru.

P. Suryaprakasam,
Secretary,
Vedasastra Parishat,
Rajahmundry,

—···—

---

# ఆయుర్వేద వికృతి విజ్ఞానము

కన్నడ రచన :— ఆయుర్వేద విద్వాన్, డా. కె. ఆర్. శ్రీకంఠమూర్తి, L A.M.S. (Mys) H.P.A. (Jamnagar) F.R A S. (London)

ప్రిన్సిపాల్, తారానాథ్ ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, బళ్ళారి. (కర్నాటక)

ఆంధ్రానువాదం :— ఆయుర్వేదరత్న, వైద్యవిశారద డా. గంటి కల్యాణశర్మ, M A.,B.Sc.,B S.A.M (Banglore)

పోస్ట్ గ్రాడ్యుయేట్ టీచింగ్ & రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆయుర్వేద, జాంనగర్, గుజరాత్.

రమారమి 200 పుటలతో క్రౌన్ సైజులో మంచికాగితముపై చక్కని ముద్రణతో 1980 ఫిబ్రవరి రెండవవారములో ఆయుర్వేద ప్రముఖుల అభిప్రాయములతో పాఠకులకు సమర్పింపబడుతుంది. వెల రు 12-00 మాత్రమే. ఫిబ్రవరి రెండవవారం లోగా పండ్రెండు రూపాయలు మణియార్డరుద్వారా పంపువారికి గ్రంథము రిజిష్టరుడు టపాలో పంపబడుతుంది. ఫిబ్రవరి 15 వ తేదీ తర్వాతవచ్చు ఆర్డర్లకు తపాల, రిజిష్టరు ఖర్చులు అదనముగా చేర్చబడును.

గ్రంథముల ప్రాప్తిస్థానములు :—

1. దత్తాత్రేయ అండ్ కో., కోటగుమ్మం, రాజమండ్రి-1. Pin No. 533101.
2. వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము, చింతలూరు- ఆలమూరు - తూర్పుగోదావరి, వారి అన్ని బ్రాంచీలు.
3. ఇండియన్ మెడిసిన్ సేల్స్ హౌస్, విజయవాడ-2.

Regd. No. H/Rmy-42. Samalochana 16, February 1980.

విశేష ప్రచారముగల

# సమాలోచన పక్షపత్రిక

సంవత్సర చందా రు. 10 - 00 లు మాత్రము.

సంచిక ఒకటికి ముద్రణవ్యయం రు. 1-00 అగుచున్నది. సాహిత్య ప్రచారమునకై తక్కువ చందా నిర్ణయింపబడినది.

## సమాలోచన

1, 2 సంపుటములు ఒక్కొక్కటి సుమారు 120 వివిధ జాతీయ సాంస్కృతిక విషయముల రచనలు గలిగి హాఫ్ క్యాలికో బైండు చేయబడినవి. పోస్టేజితోసహా ఒక్కొక్క సంపుటము వెల రు. 18-00 లు ఎం. ఓ. చేసినవారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

ప్రతులకు :—

ఎడిటర్, 'సమాలోచన'
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్)
రాజమండ్రి-1. 533101.

—*— ప్రకటన రేట్లు —*—

| | |
|---|---|
| కవరు 4 వ పూర్తి పేజీ | రు. 400 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 225 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 150 - 00 |
| లోపలి పూర్తి పేజీ | రు. 200 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 110 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 60 - 00 |

ప్రత్యేక కంట్రాక్టు రేట్లకు సంపాదకునిపేర వ్రాయవలయును.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.

# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 [illegible] 1-3-1980 సంచిక 9


—* ఈ సంచికలో *—



16—3—1980 సంచికలో పిరదౌసి – గుణాఢ్యుఁడు – తులనాత్మక సమీక్ష, ఆధునిక తెలుగు నవల పరిణామం, జాషువా చారిత్రక రూపకం వీరాబాయి మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము ౮ | రాజమహేంద్రవరము 1-౮-1980 | సంచిక 9


## కృష్ణపక్షము - ఒక సమీక్ష


— శ్రీ ద్రావిడి రామం, ఎం.ఏ., బి.యిడి., ఓ. యల్.


విశ్వశ్రేయస్సుకే కావ్యం అంకితం కావాలని కొందరంటే, రమణీయార్థ ప్రతిపాదకమైనదే కవిత అని మరికొందరు చెప్పేరు. సాహిత్యంలో సామాజిక స్పృహ వుండాలనీన్నీ, తతోపి సమాజంలో అట్టడుగున వున్న సామాజికుల దీనగాథలే, కవితా, సామగ్రి, కావాలనీన్నీ నేటిరచయితలు బహుధా ప్రచారంచేస్తున్నారు. ప్రకృతికి అంకితమైన కవిగా, అంటే Nature poet గా గణనకెక్కిన వర్డ్స్‌వర్త్ అనే కవి, కవితాతత్త్వాన్ని గురించి తర్కిస్తూ, కవిత 'Emotion recollected in tranquility' అని ఉద్ఘాటించేడు. అంటే కవి ప్రశాంత వాతావరణంలో తనకు కలిగిన హృదయావేశాన్ని మననం చేసుకుని, దానిని సహృదయ రంజకంగా చిత్రిస్తాడన్నమాట.

ఏది ఎలాగవున్నా హృదయాన్ని స్పందింపజేసేభావాలు, అవి ఏకోవకు చెందినా, వాటిని రమణీయంగా, కమనీయంగా చిత్రించకుండా వుండలేడు కవి. కవిత ఆత్మాశ్రయమైనా సమర్థుని చేతిలో అది యెంతో శోభావంతంగా వుంటుందనడంలో ఎవరికీ అభ్యంతరం వుండదు.

ఎంతో కాలంనుంచీ వస్తూన్న ప్రబంధ ధోరణిని విడనాడి, మధురమంజులమైన పద్ధతిలో, ఆత్మాశ్రయమైన కవితను రచించడంలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ఉద్దండులు. గురజాడలో కూడా ఆత్మాశ్రయపద్ధతి కొంతవరకు గోచరించినా, కృష్ణశాస్త్రిగారి చేతిలో అది పరాకాష్ఠ చెందినదని చెప్పాలి. కృష్ణశాస్త్రిగారి కవితాపద్ధతిని వెలువరించే గ్రంథం కనక, కృష్ణపక్షమనే శీర్షిక యీ గ్రంథానికి సముంజసంగానే వుంది.

భారతాంబదాస్య శృంఖలాలను ఛేదించడానికి, త్యాగధనులైన భరత వీరులు, శంఖారావాలు చేస్తూ, ముందుకు నడిచేరోజులవి. ఆ స్వేచ్ఛాపిపాస

యుగయుగంబుల నీశ్వరయోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించు వారి
అమలజీవితఫలము ధన్యతను గాంచ
జగమునిండ స్వేచ్ఛాగానఝురుల నింతు.'

అని యీకవిచేత కావ్యధోరణిలో పలికించింది.

'ఏకం సత్' అనే సిద్ధాంతంపట్ల ఈ కవికి మక్కువ ఎక్కువ. అందుచేత బ్రహ్మసమాజ సిద్ధాంతాలచేత ప్రభావితుడైన యీనవకవి, విగ్రహారాధనను, ఏవగించుకుని సర్వవ్యాపి అయిన ఆ విశ్వగురుణ్ని ఏవిధంగా ఆరాధించేడో చూద్దాం.

'జిలుగువసనాల మణిమయోజ్జ్వల మనోజ్ఞ
కాంచనాంచిత భూషణగణము బూని
రాజవీథుల రతనాలరథము నెక్కి
వెడలు నిర్జీవపాషాణ విగ్రహాంబ

... ... ...

... ... ...

ఏను స్వేచ్ఛాకుమారుడ, నేను గగన
పథవిహారవిహంగమ పతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను
ప్రళయఝంఝాప్రభంజనస్వామి నేను'

అనే పద్యపాదాల్ని పరిశోధిద్దాం. నిర్జీవమైన పాషాణవిగ్రహాంకంటె, ప్రళయఝంఝాప్రభంజనంలోనూ, నీలజలధరంలోనూ వ్యక్తమయే ప్రకృతిశక్తి విశ్వవ్యాప్తమయినదనీన్నీ, శతధా అతీతమైనదనీన్నీ చెప్పి, విశ్వాత్మయొక్క ప్రభావాన్ని వీరు చక్కగా ముచ్చటించేరు.

విశ్వవ్యాప్తమయిన అపరాశక్తికి తానిచ్చే ఉపాయనాన్ని 'కానుక' అనే శీర్షిక గల పద్యంలో

'గాఢలజ్జానుతాప సంకలిత హృదయ
నీరజ దళాల రాలు కన్నీటిచుక్క
గాక, మనసార, వలపార, కలత దీర
కాన్కగా నేమొసంగగ గలను నీకు.

అని హృదయంగమంగా శ్రీ శాస్త్రి గారు వివరించేరు. తనకు నివేదింపబడిన వస్తువులన్నిటిలోనూ పరితాపానల దగ్ధమైన హృదయాన్నే సర్వేశ్వరుడు ఎక్కువ ప్రీతితో స్వీకరిస్తాడు గనుక, అటువంటి హృదయాన్ని పరమేశ్వరార్పితం చెయ్యడం నిజమైన భక్తికి చిహ్నమని పైపద్యంలోనే కాక,

'కలుష దుర్దాంతపంక సంకలిత కవార
ముల జనించు మదీయాశ్రు మలినధార
స్వామి! భవదీయపాద దేశమున బాతి
పరమపావనజాహ్నవీ ప్రతిభ గాంచు'

అనే పద్యంలో కూడా ప్రస్ఫుటంగా వ్యక్తమౌతుంది.

జీవితం చాలా విచిత్రమైనది. దోపిడి చెయ్యడం వంటి దుష్కృత్యాలు చెడ్డవని తెలియక, దుర్మార్గులు దోపిడి చెయ్యడం లేదు. లోకం కళ్లు కప్పి ఏదో లాభం పొందాలనే వాంఛ, లేదా ఒక పైశాచికమైన కాంక్ష వారిని ఆపనికి ప్రేరేపిస్తుంది.

'గరళమే తిందు కడుపార నెఱిగియెరిగి
యమలద్రోతును చేతుల నమృతరసము
విసమమృత మట్టు, లమృతము విసమురీతి
జిత్ర చిత్రగతుల మార్చు జీవితంబు'

అనే చరణాలు అలాంటి జీవితాలలోని వైచిత్రిని చక్కగా ప్రస్ఫుస్ఫుటింపజేస్తాయి.

భావకవిత్వం ఎవరికీ అర్థం కాని, ఎదలో రోద అనిన్నీ ప్రణయ గీతికాలాపన అనిన్నీ ఒక అపప్రథ లోకంలో వుంది. స్వతంత్రంగా లేచిన యే ఉద్యమమైనప్పటికీ, సామాన్య జనుల, తాకిడికి, లోనుగాక తప్పదు. సంఘంతాలూకు సనాతన ధర్మపరాయణత్వమే దీనికి కారణం. అయితే కాలవాహిని కొంతసేపు ప్రవహించిన తరువాత సంఘం కళ్ళు తెరచి, సంస్కరణలో వున్న ప్రాశస్త్యాన్ని గ్రహించగలుగుతుంది.

ప్రకృతితో కవికిగల, సంబంధాన్ని సొగసైన కవితారీతులలో చిత్రించడంలో వీరిది అందెవేసిన చెయ్యి. రంగు రంగుల సొగసు చీర ధరించిన, విరిచేడును. ఈ కవిశేఖరుడు ఎంత రమణీయంగా వర్ణించేడో చూడండి.

'రంగు రంగుల సొగసు చీరల ధరించి
నవ్వువెన్నెలగాయు క్రొన్ననలనడుమ
వాడివాడని యీవిరిచేడె తాల్చు
మంచిముత్తియముల గన మది కరంగు'

రంగు రంగుల పూలరేకుల అంచున ఉదయభానుని అరుణ కిరణాలలో మంచి ముత్యాలలాగే మెరిసే హిమబిందువులను అలంకరించుకొన్న విరిచేడె యీ యనను ఎంతగానో ఆకర్షించింది.

ఫలాపేక్షారహితంగా లోకసేవ చేసి, తుదకు క్రమంగా కృశించిపోతున్న సెలయేటిని చూసి, ఈకవిగారు,

'తోయములదీయనైన పానీయమొసగి
వలపునును లేత గాలివీవనల విసరి
ప్రబల నైదాఘ తీవ్రతాపంబువలన
నిట్టులైతివె సెలయేఱ! తుట్టతుదకు'

అని తన జాలిని ప్రకటించేరు.

పాశ్చాత్య దేశాలలో 'రొమాంటిక్ రివైవల్' అనే ఉద్యమం ఫలితంగా వెలువడిన అనేక, కవితలు ఆత్మాశ్రయములైనవే. అయినప్పటికీ అవిసహృదయ హృదయాహ్లాదకరంగా వున్నాయి. షెల్లీ వ్రాసిన 'స్కైలార్క్' వర్డ్సువర్తు వ్రాసిన 'written in early spring' మొదలైనవి స్థాలీపులాకన్యాయంగా యిచ్చిన దృష్టాంతాలు. విశ్వాత్మకు, మానవునిలో వున్న ఆత్మశక్తికీ, సన్నిహితమైన సంబంధం వుందనిన్నీ, కలత, కల్ల, భీతి, బాధా ఎరగని ప్రకృతి, ఆనంద పారవశ్యంతో వసంత వేళలో ఉఱ్ఱూతలూగుతున్నదనిన్నీ, యీ కవి written in early spring అనే పద్యంలో సూచించేరు. మానవాత్మ కూడా యీ ఆమందానందాన్ని పంచుకోవలసివుంది. అయితే, ఈర్ష్య, కుటిలత్వము, మొదలైన అడ్డుగోడలు పెట్టుకోవడంచేత మానవుడు, సహజము, నిర్మలము, అనంతము, అయిన యీ ఆనందాన్ని ప్రకృతితో సమంగా పంచుకోలేకపోతున్నాడని యీకవి

'To her fair works did
Nature link
The Human soul that
through me ran
And much if grieved my
heart to think
What man has made
of Man'

అనే పద్యంలో వ్యక్తం చేసేడు_

శ్రీ కృష్ణశాస్త్రి గారుకూడా 'ఆకులో ఆకునై, పూవులో పూవునై' అనే గేయంలో ప్రకృతితో తమకుగల తాదాత్మ్యాన్ని మనోహరంగా ఆలపిస్తే,

'ప్లేటులో ప్లేటునై చెమ్చాలో చెమ్చానై' అని అరసికులు కొందరు పేరడీలు వ్రాసేరు.

షెల్లీ స్కైలార్క్ అనే పద్యంలో ఆ విహంగమంలాగే తాను కూడా అనంతాకాశంలో స్వేచ్ఛంగా విహరించాలనుకుంటున్నాననిన్నీ, కాని భవబంధాలు, యీ బురదనేలలో ముళ్లకంపపైకి తిరగదోసే యనిన్నీ రోదించేడు శ్రీ కృష్ణశాస్త్రి గారు రచించిన

'ఏను మీఁదలెనే కంఠమెత్తి పాడ
నెంతో యుబలాటపడి సవరింతుగొంతు
ఏనుమీఁదలెనే నవానూన గాన
విస్తృత వ్యోమయానాల వెడలి వెడలి
భావలోకాంచలమ్ముల వాలవలతు
ఐన నేమాయె అపుడులోని పాట
ఎడదరొదసేయునో లేదొ యింకిపోవు
నంతలో ననే కటకటా యంతులేని
దారితెని శోకంబు పెడారులందు.'

అనే పద్యభాగం చదివినప్పుడు ఈయన కూడా, అపాశ్చాత్య కవి భావాన్ని పంచుకున్నాడా అని పిస్తుంది.

కరుణరసానికి ఆస్పదమైన దుఃఖము, శృంగార రసానికి ఆటపట్టు అయిన, ప్రేమ, విప్రలంభము కూడా యీ కవి గారిచేతుల్లో బాగా పోషింపబడ్డాయి.

'ఏల సలిలంబుపాఱు? గాడ్పేలవిసరు
ఏలనాహృదయుంబు ప్రేమించు నిన్ను'

అనే పాదాలు ప్రేమయొక్క సహజత్వాన్ని మనోజ్ఞంగా నిరూపిస్తాయి.

బుద్ధుడు, మొదలైన ప్రవక్త లంతా యీ లోకం దుఃఖమయమైన దని కంఠోక్తంగా ఎన్నోసార్లు చెప్పేరు. అయితే దుఃఖభాజనమైన యీ సంసారసాగరంలో తోవచూపేదీప స్తంభంలాగ ఉపచరించేది ఆశ. ఈ ఆశయొక్క ప్రాశస్త్యాన్ని వీరు

'కన్నీటికెరటాల కెన్నెలేలా?
... ... ...
... ... ...

ప్రళయకాల మహోగ్ర భయద జీమూతోరు,గళ ఘోరగంభీర ఘోష పెళార్భటులలో మెఱుపేలా? అని యీ ఖండకావ్యంలో రమ్యంగా చిత్రించేరు.

'పక్షినని, పాడగల నని ప్రణయవీథి
నిత్యలీలా విహారముల్ సెరుపుదు నని
పక్షుముల దూల్చి బంధించి పంజరాన
గానమును ప్రాణము హరింపబూని
నారు

అనే చరణాలు ఈకవియొక్క నిర్వేదమునకు బలమైన తార్కాణాలు-

అన్వేషణ చేస్తూ ఒంటరిగా ప్రయాణించే మిసిమిసిజవ్వనిని ప్రస్తావించిన సమయంలో, తీయందనములలో లీనమైన ఆ ఎడదను,

'ఎలదేటిచిరుపాటసెల ఏటి కెరటాల
బడిపోవు విరికన్నె కలపు వోలె
... ... ...
తొలిపొద్దు తెమ్మెరతోవ లోబయనమై
పరువెత్తు కోయిలపాటవోలె ...

అని తమాషాగా ఎన్నో మధురమైన ఉపమానాలతో రసప్లావితంచేసేరు.

'పూతగోదావరీ ప్రవంతీతరంగ
మాలికాడోలికల నూగు మలయపవన
ఏల గొంపోవు హృదయంబు నేర్చి
వెడలు
వేడి నిట్టూర్పుగాడ్పుల వెలదికడకు.

అని మగువపై గల మక్కువను స్ఫురింపజేసే శృంగారతరంగాన్ని చమత్కరించేరు.

నవశకంలో వీరికంటె ముందు గా కదంతొక్కిన గురజాడవారి కీయన

'గుత్తునా అని జాతి ముత్యాల్
గుచ్చినాడే మేలిసరముల
ఇత్తునా అని తెలుగుల్లికకి
యిచ్చినాడే భక్తితో'

అనే ముత్యాలసరంతో అంజలిఘటించేరు. రసజ్ఞులు, సాహిత్య వల్లభులు అయిన శ్రీ పిఠాపురాధీశులనుగురించీ, వారి ఆస్థానంలో నవముక్తికంలాగ మెరిసిన, కవిగారిపితృపాదులను గురించీ, వీరురచించిన పద్యాలు నవనవోన్మేషములైన సుగంధసుమ సంతతుల లాగ ఆహ్లాదదాయకాలుగా వున్నాయి.

స్వేచ్ఛా పిపాసి అయిన యీకవి కంటకితమైన స్వేచ్ఛాపథంలో పర్యటించే సమయంలో కరుణరసాస్పదమైన దుఃఖాన్ని తమపద్యాలలో ప్రతిబింబింపజేసేరు. ఈ దుఃఖంలోనుంచి వీరు క్రమంగా స్వచ్ఛమైన ప్రేమధామాన్ని చేరి

'చంద్రికలనేల వెదజల్లు చందమామ
ఏల నాహృదయంబు ప్రేమించునిన్ను'

అని ఆలపించేరు. తరువాత వీరుక్రమంగా గాఢపరితప్త హృదయంలో

పంక సంకలిత కుహరముల జనించు

అశ్రుధారలను ఈశ్వరుని పాదాలపై అభిషేకం చేసి,

'నీలాభ్రసరసిలో నిండు జాబిల్లి
రాయంచవలె విహారము సల్పుచుండె
కమ్మతెమ్మెరలు శాఖాపత్రములనో,
కల్లోలినీ తరంగములనో డాగ
నాట్యంబు మధురగానంబును మాని
గాటంపు నిద్దుర గాంచె శైవలిని
సర్వేశ్వరుని హస్తజలజయుగ్మమున
విశ్వమే హాయిగా విశ్రాంతి జెందె'

అని తన బరువైన ఎడదకు శాంతిని సౌఖ్యాన్ని చేకూర్చుకున్నారు.

భావకవిత్వం అంటే ఎవ్వరికీ అర్థంకాని కవిత్వం అనిన్నీ, దీనిప్రవక్త శ్రీ కృష్ణశాస్త్రి గారు అనిన్నీ యీ ఉద్యమం బయలుదేరిన కొత్తరోజులలో కొందరు వ్యతిరేక ప్రచారం చేసేవారు. కృష్ణపక్షానికి ప్రతిగా ఒక శుక్లపక్షం బయలుదేరగా నేను 'మహాశయపక్షం' వ్రాస్తున్నా ననేవాడు ఆరోజులలో ఒక హరిదాసు. కాలానికి మహత్తర ప్రభావం వుంది.

'హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధి శ్యామికాపి వా'

అని కాళిదాసు చెప్పినట్టు, చెత్తని తన గర్భం అడుగున మాటి, మంచిని పాశా బంగారంలాగ నిరంతరము సర్వులకు చాటి చెప్పేశక్తి కాలానికి వుంది. ఈనాటికి, అంటే సుమారు అర్థశతాబ్దం గడచిన తరువాత కూడా చెక్కు చెదరని, తళుకు తగ్గని, శ్రీకృష్ణశాస్త్రిగారి కృతులు వాటి గొప్పతనాన్ని లోకానికి ప్రస్ఫుటంగా ప్రదర్శించగలుగుతున్నాయి.

ఆత్మాశ్రయమైన కవిత తెలుగువారికి కొత్తదేమీ కాదు. తెలుగునాడులో ప్రభవించిన శతక వాఙ్మయం ఆత్మాశ్రయ కవిత్వానికి ప్రత్యక్ష నిదర్శనం. ప్రేమ, దుఃఖము, స్వేచ్ఛ, మొదలైన భావపరంపర కూడా కావ్యలోకంలో చరించే సహృదయులకు అపరిచితం కాదు_అయితే జిలుగు దిద్ది, మెరుగుపెట్టి,

# "బసవరాజు" వారి గీత పారిజాతపరిమళాలు

- శ్రీ డా. జి. బి. యస్. ఆచార్య, ఎం. ఏ., పిహెచ్. డి.

(గతసంచిక తరువాయి)

బసవరాజువారికి సంస్కృత సాహిత్యమన్నా, పురాణభారతి సంస్కారమన్నా వల్లమాలిన గౌరవమూ, అనురాగమూను. ఆంధ్రదేశమన్నా అంతే. అందుకే వాయుపక్షాల మీద తెలుగునాడంతా తిరిగి సందేశమిచ్చారు. భారత స్వాతంత్ర్యంకోసం పాటుపడిన దేశభక్తులందరికి కవితాభినందనలు అందించారు. అయితే వారిదేశభక్తి సంకుచితమైనది కాదు. యుగలక్షణాలకూ, యుగధర్మాలకూ దూరులు కారు. రాగల యుగం ప్రజాబాహుళ్యానిదని తెలుసుకున్నారు. ప్రాచ్య పాశ్చాత్య జగత్తునకు నడుమ కొండలూ గోడలూ లేవని గ్రహించారు. అందుకే 'ఆంధ్రకవిత్వ చరిత్ర'లో బసవరాజువారు ఇలా వ్రాశారని 'దేవులపల్లి' వారు ఉదాహరించారు. అదేమిటంటే-

'ప్రస్తుత మాంధ్రసాహితీ శ్రేయోభిలాషులకు ముఖ్యకర్తవ్య మేమన, తరతరములనుండియు, శతాబ్దులనుండియు, నిరంతరధారగా ప్రవహించుచున్న ఆంధ్రనాగరికతా ప్రవంతిని ఆంధ్రసాహిత్యసీమను ప్రవహింపజేసి, తత్ప్రవాహసాహాయ్యమున ఆంధ్రసాహిత్య సీమను చక్కని వ్యవసాయము సాగించి ఆంధ్రులకు పుష్టియు, తుష్టియు, కాంతియు, దాంతియు, వన్నెయు, వాసియు నిచ్చు కావ్యఫలములను కాయించుటయే యగును. ఆంధ్రసాహిత్య సీమను నాటుకుని, పెరిగి పెద్దవి కాగల విజాతీయ కావ్య తరులతాదులను నాటించి వానిచే సజాతీయ, విజాతీయసార సమృద్ధము లగు కావ్య ఫలములను కాయించుటయే మేలగును.

ఇందులకు అన్యభాషా సంస్కారము, అన్యసాహిత్య పరిచయమును అవసరములే యగును.'[5] బసవరాజువారి ఈ వచనాన్ని పరిశీలిస్తే వారికి అన్యభాషా సాహిత్యములందెంత ఆదరము, గౌరవము కలవో తెలియగలదు. బసవరాజు వారి దేశభక్తి సంకుచితమైనది కాదనటానికి పైవాక్యాలే నిదర్శనం.

'ఆంధ్రవీథి' అనే ఖండికలో-

'గాంధ్రుడు గాంధ్రడని తీంద్రడింను

తాంద్రడపాప

రాయు గొబ్బిలి పులి యని ప్రథితకీర్తి

గన్నవీరుం దలచి మందగతిని బొమ్మ!'

అని 'వాయుసందేశ' మిచ్చారు. ఇంద్రకీలాద్రి ప్రాశస్త్యాన్ని తెలుపుతూ, 'కావ్యభారత' కు పార్థుణ్ణి ఆదర్శంగా గ్రహించమన్నారు. 'నూజివీటి పోతుగడ్డ' అనే ఖండికలో నూజివీటి వెలమదొరల ఘనతను వేనోళ్ళ కొనియాడారు. దేశభక్తికి జాతీయభావం ముఖ్యమైనది. అందుకనే 'మా గాంధి, వేణునాదము, స్వరాజ్యలక్ష్మి పెండ్లి, గాంధిప్రభ, మాలమాదిగల మొర, రాట్నము, జాతీయపతాకము' అనే గీతాలను 'జాతీయత' ఉట్టిపడేలా రచించారు.

'కొల్లాయి గట్టితే నేమి మా గాంధి
కోమటై పుట్టితే నేమి
వెన్నపూసా మనసు
కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మతేజస్సు
నాల్గుపడగల పిలక
నాట్యమాడే పిలక
నాలుగూ వేదాల
నాట్య మెరిగిన పిలక
బోసినోర్విప్పితే
చిరునవ్వు నవ్వితే
వరహాల వర్షమే!
చక చక నడిస్తేను
జగతి కంపించేను!
పలుకు పలికితేను
బ్రహ్మవాక్యేను!
కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రహ్మఋషి?
నేడు కోమటి బిడ్డ
కూడ బ్రహ్మర్షాయె.'

అని గాంధీని విశిష్ట దృక్పథంతో అవగాహన చేసుకున్నారు. 'కృషివుంటే మనుషు' లవుతారనే పరమ సత్యాన్ని లోకానికి చాటిన మహాత్ముడు పలువురి హృదయాలను దోచుకున్నాడు - కవితా కర్పూర నీరాజనాలకు నోచుకున్నాడు. ఆనాడు బసవరాజువారు వ్రాసిన ఈ పాట ప్రతినోటా జయమంత్రమై మ్రోగింది. ఈనాటికీ మన చెవుల్లో గింగురు మంటూనే వుంది. ఈ లక్షణమే బసవరాజువారిని నేటికీ మనఎదుట నిలబెట్టగలిగింది. గాంధీని వేదమూర్తిగాను, బ్రహ్మర్షిగాను సంభావించటంలోని సామంజస్యము సహృదయ సమారాధకము.

'నాలుగూ వేదాల
నాట్యమెరిగిన పిలక'

అని సంప్రదాయ సిద్ధంగా సంభావించారు. పిలకని హేళనచేసేవారికి కనువిప్పు కలిగించారు. గాంధీమూర్తి అణువణువునా వైదిక సంప్రదాయం నిక్షేపించ

అభావాల్ని రమణీయంగా, కమనీయంగా అందజేసిన ఖండకావ్యం కృష్ణపక్షం- నేటి తెలుగు కవితలోని నవ్యతను, ప్రాశస్త్యాన్ని, తెలియజేసే యీ లఘుకృతి వాగ్దేవతకు ఒక అమూల్యాభరణం- *

* ఈ వ్యాసము ముద్రణము పూర్తియగుచుండగా శ్రీకృష్ణశాస్త్రిగారు మద్రాసులో దివంగతులైన వార్త రేడియో వినిపించినది. వారికి మా స్మృత్యంజలి.
- సంపా.

—•••—

బడటంచేత 'ఆరాధనాయోగ్యత' ధ్వనిస్తున్నది.

భార్యలను విడిచి భర్తలు, భర్తలను విడిచి భార్యలు, తల్లులను విడిచి పిల్లలు, పిల్లలను విడిచి తల్లులు, భారతదేశపు దాస్యాన్ని బాపగ, తరలివచ్చి గాంధీకి అండగా నిలవండని, 'వేణునాదము మోగుతుం దండోయ్' అని ఆబాలగోపాలాన్ని స్వాతంత్ర్య సమరానికి ఆహ్వానించారు. స్వరాజ్యలక్ష్మి పెండ్లికి సముద్రమే పెళ్లిపందిరి అని, దేవతలే సదస్యులని, ఉప్పే తలంబ్రాలని, గాంధీయే వశిష్ఠుడని, కస్తూరిబాయే ముత్తైదువని, పరమాత్ముడే సాక్షియని రసవత్తరమైన తార్కాణంతో వర్ణించారు.

'సరకారు వారు, కరుకైన వారు
ఉప్పేరితేను తప్పేశినారు
... ... ...
మాలమాదిగలం, మనుషులంగామా?
పక్కలకన్నా తక్కువయ్యామా?'

అంటూ గాంధీమహాత్మునితో మాలమాదిగలు పెట్టుకున్న మొరను కరుణారస భరితంగా మనకు వినిపించారు.

విదేశీవస్తు బహిష్కారం కోసం 'రాట్నము' అనే గీతాన్ని రచించారు.

'సిగ్గు లేదా నీకు శరము లేదా
అన్నమైనా లేక బీద లల్లాడుతుంటేను
సీతాకోకచిలుకలాగ సీమగుడ్డలో తిరుగ'

అంటూ పూటకూడు లేని ప్రజకు రాట్నమొకటే పెన్నిధి అనీ, పవిత్రమైన రాట్నం ఖద్దరును మోటని వెక్కిరించటం సిగ్గుమాలిన తన మనీ హెచ్చరించారు.

స్వతంత్ర భారత జాతి చిహ్నమైన పతాకోత్సవమును చేయండని ఉత్సాహపూరితంగా గీతాలాపన చేసారు.

'కాగ కేసరుల రొమ్ముని రంగూ
దేశ సేవకుల తెల్లని రంగూ
భక్తులపాలిట పచ్చని రంగూ
బీదల పెన్నిధ రాటపు...
అన్ని మతాలకు అన్ని తెగలకూ
ఆశ్రయమీ జండా ఒక టేనోయ్'

అని జాతీయజండాను విలక్షణంగా సంభావించారు.

బసవరాజువారి ఈ దేశభక్తి గీతాలు ప్రచార ప్రాశస్త్యాన్ని పొందటమే గాక, వారిని ఉత్తమ దేశభక్తులుగా దేశానికి పరిచయం చేసాయి.

బసవరాజువారు ముప్ఫయి తొమ్మిదేళ్లలోనే నూరేళ్ల బ్రతుకునూ పండించుకొని—

'బ్రతుకు బరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరుపుట్టి పారిపోయి
ఒకడనె ఏకోటలోనొ
పాట పాడుతుండగ నా
ప్రాణ ధాటి యేగెనా
ప్రాణ ధాటి యేగుచుండ
పాట నోట మ్రోగెనా!'

అని పాడుకుంటూ రాగద్వేషాలకు అతీతులై, తమ మంగళప్రదమ్మ, పాపాయిలున్న శ్రీశైల మల్లికార్జున స్వామి సన్నిధినే ఆశ్రయించారు. అంతకంటె వారికి మనశ్శాంతి లభించే చోటు మరొకటి యేమున్నది? బసవరాజువారు భౌతికంగా కనుమరుగైనా, వారు నిర్మించిపోయిన అక్షరసామ్రాజ్యంలో వారి విశిష్ట వ్యక్తిత్వం దీప్తిమంతి మాకూ దర్శనమిస్తూనే వుంటుంది. ఆ విజ్ఞానపు వెలుగుల దివ్య దీపకరండం మనకు మార్గాన్ని నిర్దేశిస్తూనే వుంటుంది. అది నిత్యం – అజరామర సత్యం!!

'కవి యని కీర్తిని
గాంచుట కన్నను
ఘన మే మున్నది జగతిన్'?

అని ఆనాడు వారు వ్రాసిన మాటలు ఏనాటికీ బంగరు మూటలే!

భావకవి సమ్రాట్ బసవరాజు వారి గీత వాఙ్మాలు వారి కీర్తి పరిమళాలను అనవరతం వెదజల్లుతూ అభిమానులను సమ్మోహపరచగలవని ఆశించటం సమంజసం!

*

# నాయకులు

— కవికోకిల శ్రీ మామిండ్ల రామగౌడు.

* పదవీమదాంధులై ప్రజలను పీడించి
  జాతివిద్రోహియౌ నేతయొకడు
నల్లధనమ్మును కొల్లలుగా దాచి
  దేశప్రగతి నిరోధించు నొకడు
దొంగ బేరమ్ముల దోపిడిదారులై
  కోటికి పడగెత్తి కులుకు నొకడు
అధికార గర్వమ్మున బధిరులై పేదల
  నెత్తురు జుర్రు నున్మత్తు డొకడు
తేనెబూసిన కత్తి సమాను డొకడు
నాయకుని వేషము ధరించు నక్కయొకడు
పల్లెపల్లెలు గల మేక వన్నె పులులు
నభ్యుదయ వినాశక శక్తులైరి యకట!

* కుటిల రాజనీతిజ్ఞుల కుట్రలకును
దేశ మల్లకల్లోలమై దిక్కులేని
పక్షి గామారె నయ్యయ్యో! పదవులకయి
నమ్మకపు ద్రోహులైరి మా నాయకులిల.

* రాజకీయపు టంకులాడులై నాయకుల్
  "పార్టీలు" మార్చుచు పరుగులిడగ
పదవులకోసము ప్రాణాలు బలిగొను
  నరరూప దైత్యులు వరలుచుండ
వేదిక లెక్కుచు పేదల బాధల
  వర్ణించు డాంబికుల్ వెల్లువిరుల
చెట్టు పేరును జెప్పి గుట్టుగా వెలగక్కా
  కాయ లమ్ముచు కుప్పిగంతు లిడగ
ప్రజల గోడులు తమకేమి పట్టకున్న
  మొసలికన్నీరు గార్చుచు మోసగాండ్రు
పల్లెపల్లెలో విలసిల్లి త్రుళ్లుచుండ
దేశ మేగతి సాగునో దేవదేవ!

* గ్రామనియంతల ఘనకార్యములు జెప్ప
  తరముగాదు సుమీ! విధాతకైన
మదపు టేనుగులరీతి మత్తెక్కి తూలుచు
  నెదు రెవ్వరును లేక పదరుచుండ్రు
పచ్చగా బ్రతికెడు చిచ్చులు రగిలించి
  పగబట్టి కాటిడు పాములరరె!
నిగపట్టగోత్రము నగుబాటుల చరిత్ర
  కట్టిపెట్టితనముతో గడుపుచుండ్రు
నీచవాక్కులు బలుకుచు నీతిలేక
పందికొక్కులై మెక్కిరి పరులసొత్తు
విసపుగడియల జనులు జీవించుచుండ
గ్రామదేవతలు నశించు కాలమెపుడో.

# తెలుగువారి కవితా నిర్వచనాలు - నిరూపణలు

- శ్రీ కపిలవాయి లింగమూర్తి.

భగవంతుడు భాషనిచ్చి మానవుని జంతుకోటినుండి వేరు చేస్తే దానిలో అతడు కవిత్వాన్ని సృజించుకొని సాటి వారిలో వేరుపడ్డాడు. నేత్రానికి దర్శనం, శ్రోత్రానికి శ్రవణంవలె వాగింద్రియానికి భాషణం సహజధర్మమయినా అది అందరిలో వికసించలేదుగాబట్టి ఎవరిలో వికాసం పొందితే వారు లోకంలో కవులౌతున్నారు.

చూడటం అందరికీ చేతనైనా రంగుల్ని స్పష్టంగా చూడటం వస్తువుల్ని నిశితంగా పరిశీలించి మంచిచెడ్డలు కనిపెట్టడం అందరికి చేతగాదు. అలాగే మాటాడ్డంవచ్చినా శబ్దాన్ని జాగ్రతగా పరిశీలించి ఏది ఎక్కడ ఉపయోగించాలో అందరికీ తెలియదు కాబట్టి 'దర్శనావర్ణనాచ్చాధరూఢాలోకే కవిశ్రుతిః' అని లాక్షణికాచార్యుడు చెప్పాడు. ఈ నిర్వచనాన్ని తిరగేసి చెబితే, 'చూచినదాన్ని చక్కగా విడమరిచి చెబితే అది కవిత్వమౌతుంది' అనే అభిప్రాయం తేలుతుంది. వాల్మీకి క్రౌంచపక్షి వియోగాన్ని చర్మచక్షువులతోను శ్రీరాముని చరిత్రను మనశ్చక్షువులతోను పరికించాడు. పరికించిన దాన్ని సమర్థమైన భాషలో చెప్పాడు. కాబట్టి మహాకవి అయినాడు. అందువల్ల ఎవడు తానుదర్శించినదాన్ని ధ్వనిపూర్వకంగా ఔచిత్యవంతంగా చెప్పగలడో వాడే కవి అని పై లక్షణకారుని అభిప్రాయం ...

వాక్కు బ్రహ్మస్వరూపం కాబట్టి దాని మాహాత్మ్యం ఎంతగొప్పదో వేరుగా చెప్పనక్కరలేదు.

చక్కగా జూచి పలికిన శబ్దమైన
సురభియై గోరు కోర్కెలు గురియుగాని
యెఱుగకుండగ బల్కిన స్వరముగూడ
వృత్రునకలె జంపు నది తన శత్రు వగుచు.

అని లక్షణకారు లన్నారు. వాక్కు ఇంతమహత్వం గలది కనుక శాస్త్రకారులు తన్మూలకమైన కవిత్వానికి కళల్లో అగ్రస్థాన మిచ్చారు. అంతేగాక అది పరమేశ్వరుని ఆరాధనలో ఒకవిశేషమని దానితో ముక్తినిగూడా పొందవచ్చునని సెలవిచ్చారు.

భర్తృహరి విద్వత్పద్ధతిని చెబుతూ 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్'అని చెప్పింది చాల దనుకొని ఆప్రకారణాన్ని 'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః' అని వారి కమరత్వాన్ని నిరూపిస్తూ ముగిస్తే, ఆతరువాత వచ్చిన ఆనందవర్ధనుడు 'అపారేకావ్య సంసారే కవి రేవ ప్రజాపతిః' అని అతనిని బ్రహ్మనే చేసివేశాడు.

అయితే లాక్షణికులచే ఇంతగా మన్నింపబడిన కవిత్వం ఏలా ఉంటుంది? ఎందులో ఉంటుంది? అంటే దాన్ని పరబ్రహ్మ తత్వంవలె సూటిగా చెప్పటం కష్టమే. తత్వశాస్త్రం ఇతి అనే వాచ్యంతోగాక నేతి నేతి పూర్వకంగా పరతత్వాన్ని చూపినట్లు దాన్నిగూడా శబ్దార్థాలంకారగుణరీతి వృత్త్యాదుల్లో ఇదిగాదు, ఇదిగాదు అని పరిహరించి చూపవలసే ఉంటుందితప్ప ప్రత్యక్షంగా యిది అని చూపటంకష్టం. కాని ప్రకృతిలో దృశ్యమాన జగత్తంతా పరమేశ్వర విభూతియే అయినట్లు వాఙ్మయంలోని శబ్దార్థజాలమంతా కవితావాహకంగానే ఉంటుంది.

అసలైన కవిత్వాన్ని గురించి విశ్వనాథుడు వాక్యం రసాత్మకం కావ్యం అని నిర్వచిస్తే జగన్నాథుడు వాక్యంవరకెందుకని 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం' అని దాన్ని మరోమెట్టు దించాడు. ఇక ఈనాటి వారో శబ్దంవరకెందుకని కేవలం అక్షరాలే నిలువుగా ఒకదాని క్రింద ఒకటి పేర్చి దాన్ని మహాకవిత్వం క్రింద చెలామణి చేస్తున్నారు.

మానవుల్లో అక్షరాస్యత పెరిగిన కొద్దీ కవితారంగంలో ఈ అయోమయస్థితి ముదరిపోతుంది. ప్రాచీనుల కవిత్వం పాషాణపాకంలో ఉండి తరువాతి వారికి తెలియకుండా పోతుంటే ఆధునికులదీ అయోమయత్వంతో, అపశబ్ద మయమై అర్థంగాకుండా పోతుంది. ఒక్కొకపుడు తండ్రి కొడుకు తిరిగే తుంటరిలాగ వ్రాసినవారి బంతులు వ్రాసినవారికే సమన్వయంగాకుండాకూడా ఉంటాయి. కాబట్టి లాక్షణికులు గాకన్నా కవులైనా కవిత్వాన్ని ఏలా నిర్వచించారో ఏవిధంగా నిరూపించారో తెలిపితే ప్రారంభకులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందనే ఉద్దేశంతో కొన్ని నిర్వచనాలు వ్యాసంలో చూపుతున్నాను.

భారతకవుల్లో అద్వితీయుడైన కవిబ్రహ్మ నిర్వచనోత్తర రామాయణంలో–

'లలితపదహృద్య పద్యం
బులను కథార్థంబు పూర్వపరఘటితంబై
అలతియలతి తునియల కా
హళి సంధించినవిధంబునమరగవలయున్'

అంటాడు. వక్తవ్యాంశం పూర్వాపరాలు చెడకుండా లలిత పదాలలో చిన్నచిన్న వాక్యాలతో సాగిపోవాలని అతనిమతం. ఈనిర్వచనంలో ఉత్తరార్థం గమనించదగింది. కాహళధ్వని కృకవాకుధ్వనివలె హ్రస్వాలతో ఆరంభమై దీర్ఘదీర్ఘాలతో అంతమౌతుందికాబట్టి కవిత్వంగూడా అవిధంగా చిన్నచిన్న పదాలతో గూడిన వాక్యాలతో ఆరంభమై పాఠకుని చివరకు గంభీరమైన మహావిషయం వైపు నడిపించుకుపోవాలని, కాహళ ప్రబోధాత్మకమైన వాద్యం

కాబట్టి కవిత్వంగూడా ఆవిధంగా ప్రబోధాత్మకమైన ధ్వనితో ఉండాలని తిక్కనగారి యభిప్రాయమైనట్టి లక్షణం ధ్వనిస్తుంది.

కవిత్రయం సరసన నిలువకున్నా నన్నెచోడుని కుమారసంభవం తెలుగులో తొలిప్రబంధమని చాలా మంది అభిప్రాయం. అతడు

ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకానిపట్టి నమ్మును పరహృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమె యలరి పట్టినదియున్
శరమే?

అని ప్రశ్నించాడు. ఇతడెంతైనా రాజుగదా రాజసం దాగదు మరి. తనకు తగినట్లు కవిత్వాన్ని బాణంతో పోల్చాడు. ఎదుటివాని గుండెకు తాకనప్పుడా విలుకాడు విడిచింది బాణంగాదు. పలుకాడు వానిది కవిత్వంకాదు అంటాడు. కవి చెప్పే మాట వినేవానికి గుండెకంత సూటిగా నాటాలని యితని అభిప్రాయం.

ఇతని తరువాత చెప్పదగినవారిలో

గురువు లఘువుచేసి కుంచించికుంచించి
లఘువు గురువుజేసి లాగిలాగి
కవిత జెప్పునట్టి కవిగులామును బట్టి
ముక్కుగోయ వలయు ద్రొక్కిపట్టి

అనే చాటువు చెప్పినకవి యెవరో చాటుగానే ఉండిపోయాడు. ఇతడు కొంత ఉగ్రవాదిగా కనిపిస్తాడు, పాపం! అపశబ్దకవిత వింటూవింటూ ఎంత విసిగిపోయాడో మరి. పదమూడో శతాబ్దంలో తనసాటి వారందరిచేత చక్కన అనిపించుకొన్న జక్కన ...

ప్రతిపద్యము చోద్యముగా
కృతిజెప్పిననొప్పుగాక క్షితి నొకపద్యం
బతిమూఢుడైన చతురత
ప్రతిపాదింపడె ఘుణాక్షరన్యాయ
ముగన్.

అంటాడు. కవి అయినవాడు చెప్పిన ప్రతిమాటలో ఏదోఒకవితాఛాయ ఉండాలిగాని నూటికోమాటలో ఉంటే ఏలా? ఎంతమూఢుడైనా ఘుణాక్షరన్యాయంగా ఎప్పుడో ఒకప్పుడు వాక్చాతుర్యాన్ని కనబరుస్తూనే ఉంటాడుగదా అందువల్ల చాతుర్యంలేని కవి వ్రాత ఘుణాక్షరాలే అంటాడు.

ఇక వీరిని విడిచి ప్రబంధయుగంలోకి వస్తే మాదయగారి మల్లన

చెప్పవలె కవిత రసములు
చిప్పిల నప్పప్ప భళి భళి! యన, లేదో
యెప్పుడు జెప్పక యుండుట
యొప్పు సుమీ! సుకవి యెంత
యుచితజ్ఞుడొకో.

అని సలహా యిస్తాడు. కవిత్వం చెబితే రసంచిప్పిలేటట్లు చెప్పాలి, లేకుంటే నోరెత్తకుండా ఉండటమే మంచిదని యితని అభిప్రాయం. అది నిజమే. ఎందుకంటే?

నాకవిత్వ మధర్మాయ
మృతయే దండనాయచ
కుకవిత్వం పునస్సాక్షా
న్మృతిమాహుర్మనీషిణః.

అని లక్షణకారులమతం. కవిత్వం చెప్పకపోతే మనల్నెవరూ నిందించరుగాని కుకవిత్వం చెబితేమాత్రం మానరు.

ప్రబంధయుగానికంతకూ పెద్దవాడు పెద్దనగాబట్టి ఆయన 'పూతమెరుంగులున్ పసిడిపూప బెడంగులు జాొప్పునట్టి వాకైతలు — అని పైమెరుగుల కవిత్వాన్ని నిరసిస్తూ చెప్పిన లక్షణం చాలా పెద్దగా ఉంది. ఆయన కవిత్వం అనేది

ఘనతరఘూర్జరీ కుచయు
గక్రియగూఢము గాక ద్రావిడీ
స్తనగతి తేటగాక యర
చాటగు నాంధ్రవధూటిసిబ్బెపుం
జనుగవవోలె గూఢమును
జాటుదనంబును గాక యుండఁ జె
ప్పిన నదెపో కవిత్వమని
పింఛము నగిం చటుగాక యుండినన్.

అని అంటాడు. పద్యకవిత్వంలో యతిప్రాసల గందరగోళంవల్ల కొంత అనర్థత తప్పదనుకున్నా యతిప్రాసలేగాదు గణనియమం కూడా విడిచిపెట్టిన యీనాటి వచన కవితాసంకలనాలుగూడ కొన్ని పైలక్షణాని కుదాహరణ ప్రాయంగా రావటం శోచనీయంగా అనిపిస్తుంది.

ప్రబంధ యుగంనుండి పురుషులతో పాటు స్త్రీలుగూడా కవితా రంగంలో కాలుపెట్టారు. వారిలో ముదటిదైన మొల్ల

తేనెసోకనోరు తీయనయగురీతి
తోనయర్థమెల్ల దోపకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగచెవిటివారి ముచ్చటగును.

అని చెబుతుంది. తేనె తాకగానే నోరంతా ఏలాతీపితో నిండిపోతుందో కవిత్వం గూడా ఆవిధంగా చెవికి సోకటమే ఆలస్యం. హృదయమంతా దాని మాధుర్యంతో నిండిపోవాలి కాని పాండిత్య ప్రదర్శనానికి కావ్యాన్ని గూఢ శబ్దాలలో కూర్చితే అది మూగ చెవిటి వారి సంభాషణ అవుతుంది. వాడేం చెబుతున్నాడో వీడేం అర్థంచేసి కుంటున్నాడో తెలియకుండా పోతుంది. అనిఅంటుంది. ఈ కవయిత్రీమతల్లివాడిన 'గూఢ' శబ్దం గమనింప దగింది. ప్రసిద్ధులైన ఎఱ్ఱనాదుల రామాయణాలు కాల ప్రవాహంలో నిలువకపోవటానికి, ఈమె కృతి నిలువటానికి యిదొక కారణమౌతుందేమో! ఇక ఈ ప్రబంధ యుగానికి చివరన నిలిచిన రఘునాథుడు.

చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమపైపై
గుప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనన్ కవిత్వము సభలన్.

అని సెలవిస్తాడు. ఈ పద్యంలోని ఈయన ఉపమాన సామగ్రి గమనింప దగింది. కర్పూరం కుప్పలుగా పోస్తే అది కరిగి కాస్సేపట్లో పరిమళం అందరి

అనుభవంలోకి వచ్చి అక్కడేం మిగలకుండా పోతుంది. ఉత్తమకవిత్వం గూడా అలాగే సభలో వినిపించినపుడు దానిలోని సరసత్వం అందరికవగతమై కవికేమీ మిగలకుండా అంటే యిదిమనందరి అనుభవమన్నట్లయిపోవాలి గాని 'సింధురరాజగమనాధమ్మిల్ల బంధంబు సహజగంధం' బన్నట్లుగా అది స్వేపలు కేసు క్రిందికి దిగకూడదు. అలాగయినపుడెంత సహృదయుడైనా ట్యూబులైటు గాక తప్పదని, కుంకుమ గుప్పినప్పుడెదుటి వారి ముఖం రాగరంజితమై ఉల్లాసంతో ఎలా మెరిసి పోతుందో కవిత్వం విన్నపుడు గూడా వారి ముఖం అలా కావాలని, పరిపొట్లం విప్పగానే దానిపరిమళం అక్కడున్న వారికల్లా మనం చూపకుండానే ఏవిధంగా అందిపోతుందో కవిత్వం గుబాళింపు గూడా ఆ విధంగా అందిపోవాలని స్ఫురిస్తుంది. ఇక యిందులోని విడిపొట్లాన్ని గమనించండి. పదాలు విడివైతే ఛందం వాటిని పొట్లంగా కట్టే అక్షలు గాబట్టి పూవు లేవిధంగా నలగకుండ పొట్లంకడతామో కవిత్వంగూడా అలా శబ్దరూపం చెడకుండా కూర్చాలనే ధ్వని ఆపొట్లంలో ఉంది. లేకుంటే-

కిదుకుచులక్షణ మెఱుగక
గుదుకుచువడి ప్రాసనియతి గూడక
మిన్నుల్
వెదుకుచు పదసంధులు జెడ
నదుకుచు నదికవిత జెప్పునతడున్ కవియే?

అని కవితాఖనూచులనుగురించి మరో చాటుకారుడు ప్రశ్నిస్తాడు. వెనకటి కొకాయన చాకలికి పెనగలిచ్చి లెక్కపుస్తకంలో 'చాకలి చర్వికి చనిగెలు చోలెదు' అని వ్రాసికొన్నాడట. దానిని ఓ విద్యావంతుడు చూచి' యిదేమయ్యా ఇట్లా వ్రాశావు.' అంటే ఎలా వ్రాస్తేనేం? లెక్కలో మనసోలెదు మనకున్నాయా లేదా? అన్నాడట, ఇప్పటి కవికుమారులు గూడ ఈలాగే నా భావాన్ని నేను ప్రజలముందుకు పెడుతున్నాను, దాని ఉద్దేశం నెరవేరుతుంది గదా! భావ ఏలా ఉంటె ఏం అనుకుంటున్నారు తప్ప దానివిషయమై శ్రద్ధ చూపటంలేదు. ఇక ఈనిర్వచనాలనటుంచి కొన్ని నిరూపణలుగూడా చూపిస్తాను, గమనించండి.

మనపద్యాలన్నీ చతుష్పాత్తులు. వానిలో మత్తేభాలు శార్దూలాలు గూడా ఉన్నాయి గాబట్టి దానినాధారంగా జేసికొని కవిరాజ శిఖామణి

పదబంధంబుల నగ్గలించి బుధశ
బ్ద భ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కవివ్రాతసరోరుహాములన్
ఖండింపుచున్ ధూరిప
మ్యదరీలన్ విలసిల్లి సత్కృతి జగ
న్మాన్య ప్రభావంబునన్
మదనాగంబును బోలె గ్రాలవలదా
మార్కొను లేకుండగన్.

అంటాడు. పద్యం చక్కగా ఎదురులేకుండా మదగజంవలె ఉండాలని అతని భావం. భావానికితగినట్టు పద్యంగూడా అతడు మత్తేభాన్నే గమనించటం యిందులో మరో విశేషం. ఈయన్ని చూచి పెదపాటి జగ్గన.

పదలాలిత్యము వర్ణశుద్ధియును శ
బ్దశ్లేష్యమున్ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దో
షస్ఫూర్తి రాహిత్యమున్
సదలంకార విశేషముల్ గలిగి
విశ్వప్రాణ సౌభాగ్య సం
పదతో తేజియు బోలె గ్రాలవలదా
పద్యంబు హృద్యస్థితిన్.

అనిచెప్పాడు. అతడు రాజైనందుకు పద్యానికి తానెక్కే ఏనుగును పోలిక తీసికుంటే ఈకవి తానెక్కే గుఱ్ఱాన్ని తీసుకున్నాడను కోవాలి. అయితే ఏనుగైనా గుఱ్ఱమైనా కొనేవాడు శుభలక్షణాలు చూచే కొంటాడు గాబట్టి కవిత్వం గూడా సలక్షణంగా ఉంటేనే బుధులాదరిస్తారని దీని తాత్పర్యం. ఇకకవి సార్వభౌముడైన శ్రీనాథుడు కవిత్వాన్ని జంతువులతోగాక,

... ... సంభూతార్థకస్థానమై
ఖ్యాతంబై బుధహృద్యమంగళకవీం
ద్రాచార్యసంసేవ్యమై
యాతారార్కసుధాంశువై కమల జా
తాకల్పమై యప్పుడున్
జ్యోతిశ్చక్రము వోలె గ్రాలవలదా
సాంపార కావ్యంబిలన్.

అని రాశి చక్రంతో పోల్చాడు. 'విశ్వశ్రేయః కావ్యమ్' అని నన్నయగారి సూత్రం గాబట్టి లోకానికి శ్రేయాన్నిచ్చే కావ్యాన్ని శ్రీనాథుడు శింశుమారచక్రంతో పోల్చటం సర్వథా సమంజసం. ఈనాడు మనమెంత యింగ్లీషు చదువుకున్నా రాశిఫలాలు చూచుకుంటూనే ఉన్నాంగదా! అలా కవిత్వం గూడా మానవ జీవితానికి భావిదర్శకంగా ఉండాలని యిందలి భావధ్వని. శ్రీనాథుని తరువాత పదేనో శతాబ్దం వాడైన పెదపాటి సోమన

ఉదయప్రాణ విహారమై విహితవ
ర్ణోద్యద్విధిక్రియా
సదసంగై పదలంకృతి ప్రభవమై
సద్వక్త్ర మావాసమై
విదితార్థాకరమై ప్రసన్నపదమై
వృద్ధశ్రవో వైభవా
స్పదమై రాజును బోలె గ్రాలవలదా
పద్యంబు హృద్యస్థితిన్.

అంటాడు. పద్యంరాజులా ఉండాలని యితని అభిప్రాయంగాని లాక్షణిక లందరూ కావ్యాన్ని కాంతాసమ్మితంగా అంగీకరించారు. అందువల్ల కాబోలు ఈ తరువాత వాడైన ప్రౌఢకవి మల్లన-

సౌరభ్యంబును బంధచాతురి తగన్
శయ్యా చమత్కారశృం
గారంబుల్ వివిధార్థముల్ సరస సాం
గత్యంబు నానాకళా

పారీణత్వము మంజువాగ్విభవమున్
పాంచాలరీతిన్ దగన్
వారస్త్రీయును బోలెఁగాల వలనా
కర్ణింపకావ్యంబులన్.

అంటాడు. పద్యాంకశాపారీణత్వం కలిగి వారస్త్రీవలె ఉండాలని యితని మతం. అయితే ఈతడు శ్రోత్రియుడుగాబట్టి వారస్త్రీవలె ఉండాలంటే యితని పిమ్మటి వాడైన బడ్డెపూడి పెద్దయ్య.

లక్షణయుక్తమై కనద
లంకృతితో నతులార్థ సంగ్రహో
ద్వీక్షణగల్గి భర్తకును
దీర్ఘసుఖంబును గల్గజేయుచున్
దక్షత తోడుతన్ వినిన
దారిత కల్మషమై పతివ్రతా
శ్లాఘ్యయనంగ నొప్పవల
దా కృతికాంత సభాంతరంబులన్.

అని కావ్యకాంత వారకాంతగాఁ గాక కులకాంతవలెనే ఉండాలంటాడు. అల్లసాని పెద్దననాటి నుండి కూడా కావ్యానికి కాంతా సమ్మితత్వమే ఎక్కువగా కనిపిస్తుంది. అయితే ఈ నిరూపణలన్నీ ఆయా కవులు రూఢికోలేక చమత్కారానికో లొంగిపోయి చేసినప్పటికీ వారు తమతమ నిరూపణల్లో వాడిన విశేషణాలన్నీ జాగ్రతగా పరిశీలిస్తే పాఠకునికి చాలావరకు ప్రత్యేకంగా కవితాలక్షణం చదువుకోని లోటు తీరే అవకాశం ఉంది. కాబట్టి ప్రాథమికులైన కవికుమారులు ప్రత్యేకంగా లక్షణ శాస్త్రాలు చదువకున్నా ఆయా కావ్యాల్లో కవులు చెప్పిన నిర్వచనాలు, చేసిన నిరూపణలు, సుకవి నిందలైనా శ్రద్ధగా అధ్యయనం చేస్తే తమలోపాలను తెలిసికొని సరిదిద్దుకునే అవకాశం ఉంది.



# తెలుఁగువారు - ప్రాకృత భాషాసేవ

(గతసంచిక తరువాయి) - శ్రీ వెలుదండ నిత్యానందరావు.

నేటికి సరిగ్గా 59 ఏళ్ళ క్రింద తిరుపతి వేంకటకవుల ప్రభంజనం ప్రబలంగా వీచినది. వీరు తొక్కని సంస్థానము, పొందని సన్మానమూ లేదని చెప్పవచ్చును. అయితే వీరి ధాటికి ఎదురు జబ్బచరచి నిలబడింది నాకు తెలిసినంతవరకు కొప్పరకవులు, ఆత్మకూరు సంస్థానకవులు శ్రీ తిరుమల బుక్కపట్టన కవితార్కిక శ్రీనివాసాచార్యులు, మాత్రమే. శ్రీనివాసాచార్యులు పిన్నవయసున నే ప్రాకృత గాథా నిర్మాణకుశలులై విలసిల్లిరి. వీరు 15 వ ఏట విరచించిన గాథలను మచ్చునకొక్కటి చొప్పున చూపెదను.

ప్రాకృతం :-
ణమహ భువణ రక్ఖా దక్ఖిణం కింవిదేశం
వసగిరి సరిలగ్గం వే అవీహీసు మగ్గం
దుహిణ గుహిణ మోహా మేలబందాగఇంద
ప్పహుడి సురకిరీడు గ్ఘుట్ఠపాపీఢ మజ్జం॥

ఇది మాలినీ వృత్తగణములు కల్గియున్నది.

శౌరసేని :-
పదణి సరాసది సుఅదీ
కణ్ణో రంణి సిహి అద్ద అణ్ణోవాం।
బణద జణదా దవత్తం
రక్ష ఉకే వారిప అంస సాహీ ఏ.

మాగధి :-
ణహాలాయ అంశలు యిలే (శలిదే?)
శుశు మామి శకీశల విశలభా।
శులయే శిలిశహ చలణశ
లోయోవిహాలది అమ్హా మాణశగు లే శే॥

పైశాచి :-
హెట్ఠప్ప సమరనేజా
రున సుసమం అమ్హా కేరవనగిరిపతినో।
పాతతలం హెట్టక తే
సువేన కిసకుచ్ఛ యేవి అపుటావేతి॥

ఇది ప్రాసరహితమైన కందపద్యంలా వున్నది. సంస్కృతమున చివరి పాదాంతమునందు గురువు ఉండవలెనను ఛందో నియమము విధిగా పాటించ నవసరము లేదు. దీని ననుసరించియే కాబోలు, పైదానిలో చివరి పాదము లఘువుతోడ ముగిసినది.

చులికాపైశాచి :-
పసతసుల నికల మకుట
ట్టిత సతముఖమని మలీచి మచ్చకతా।
నిలిసఖ పతనఖ సోభా
కంకం అనుహాలతి చలధికత సంకం॥

అపభ్రంశము :-
ఇడతిమ్మలంణ ఉంభవ
సిరివాస సుహీ, ససాఅరగ్గహిద
సిరివాస పంచగదణం
ఘుది అయప దేదిణిరబహీ, సే ఊ॥

పై ప్రాకృత గాథలన్నింటి యందును తెలుఁగు కంద పద్యంలో ఉన్నటులే ఆరవగణము మాత్రము 'జగణము లేదా నలము' అయియున్నది. 6

సమగ్రాంధ్రక సాహిత్యం - 12 లో ఆరుద్ర ఇదే పేరుగల మరియొకని ప్రస్తావించిరి. బహుశః వారు పుట్టిన సంవత్సర వ్యత్యాసము వలన వీరి తాతగారై యుండవచ్చునని భావించవచ్చును. వీరిని ఆరుద్ర పేర్కొనలేదు.

ఆధునికులలో కొందరు ప్రాకృత భాషాకోవిదులై 'గాథాసప్తశతి' నాంధ్రీకరించుటకు కలములు పట్టిరి. శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహంగారు, దిగుమర్తి సీతారామస్వామిగారు మున్నగువారు. అయితే శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు మాత్రమే సంపూర్ణముగా నాంధ్రీకరింపగల్గిరి. శ్రీ శర్మగారు ఆల్బ్రెక్ట్ వీబరు పరిష్కరించిన ప్రతినే ప్రామాణిక

ముగా గైకొనిరి. అలతి అలతి పదములలో అమోఘమైన అర్థమును ఇమిడించిన ప్రతిభావంతులు వీరు. 'శబ్దార్థముల సంయమము, భావముల ఆర్జవము, అడ్డులేని సహజధారయు' తెనిగించి నపుడు పైవాటికి భంగము కల్గనీయక, తెలుగు నుడికారపు విశేషములు చెడనీయక ఆటవెలది, తేటగీత కందములలోనే సంపూర్ణముగా 735 గాథలను 1964లో ఆంధ్ర సారస్వత పరిషత్ తరఫున ప్రకటించిరి. వీరి సప్తశతినిగూర్చి కొన్ని విశేషములు 1-10-79 'సమాలోచన' లో శ్రీ కప్తేవరపు వెంకటరామయ్య గారు వ్రాసిరి. వారు దానిలో పేర్కొనని పద్యములను నేనిట ఉదాహరింతును.

ఊరినిండ వయసువారు, ప్రాయము,ముదు
సలి మగండు, నవవసంత వేళ
ప్రాతకల్లు గలదు చేతిలో చెడిపోగా
వలదు - కాని చావవలయు నేమి!

అని ఆనాయిక తనలో తాను మథన పడుతుంది. చివరకు

అమ్మ! తేలుకుట్టె నని చేతులను వీచు
చిన్నదానిబట్టి చెలులు జాఱ
లదిగో!మగనికనులఎదుట నేకొంచుబో
యెదరు జార వైద్యునిల్లు సేర॥

ఆనాయిక విరహానలమున బడి పిచ్చిదై పోకముందే చెలికత్తెలతో గూడి మగని కళ్ళలో కారం గొట్టి జారునిల్లు చేరుతుంది.

మలినచిత్తుడైన మఱిదికి నిల్లాలు
చిన్ననవ్వుదోప చెప్పుచుండు
రాము వెంటడరుగు సౌమిత్రిచరితంబు
గోడమీద వ్రాసికొన్నదాని ॥

తల్లిలాంటి తనపైనే మోహం ప్రకటించిన ఆ మరదిని చీవాట్లు పెట్టక నవ్వుదోప మందలించుచున్నది వదినె.

రమ్యమైనరూపు రమణుడు లే దూర
పేదరికము, పెద్దవీథి నిల్లు
పరుషమైన వరుడు,పొరుగింటిరంకెంత
రైనఁ జెడదు మూడు చాన నడత॥

గాథాకవులం ఈ పద్యంలో పొరుగింటి రంకు వలన కలిగే లాభాలను గూర్చి చెప్పారు.

గాథాసప్తశతిలోని అచ్చతెనుగు పదములను వెలికి దీసి శ్రీ తిరుమల రామచంద్ర 1948 మార్చి భారతిలో ప్రకటించిరి. దీనినే వారు Telugu words in Gatha Sapthasathi- Summary of papers International Orientalists Conference - New Delhi లో 1965 లో చదివి పండితప్రశంసల నందుకున్నారు.

శ్రీ పి. ఎస్. శాస్త్రి గారు జనవరి 1965 ఆంధ్రప్రదేశ్ మాసపత్రికలో హాలునిలో తెలుగుపదాలు అనువ్యాసము వ్రాసిరి. దానినుండి కొన్ని తెలుసుకొందము.

ముహ. అందం = ముఖము యొక్క అందము 1-10
మౌన ఇల్లా = మౌనము గల్గిన ఇల్లాలు 1-34
కుడ్డ = గోడ (కుడ్యము) 1-35
గత్తి = గుత్తి (పండ్ల గుత్తి) 1-63
చోజ్జం = చోద్యం 5-6
ఇత్యాదులు.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు సుప్రసిద్ధ చారిత్రిక పరిశోధకులు. వీరు ఎన్నియో ప్రాకృత శాసనములను చదివి అందరికి వెల్లడిచేసిరి. కొన్ని గాథలు వారి వ్యాసములలో అనువాద రూపముగా ఉదాహృతములైనవి. వి. ప్రభాకరశాస్త్రి, గారు గాథాసప్తశతిని పూర్తిగా అనువదించి ప్రచురించ లేదు.

కూచిబొట్ల ప్రభాకర శాస్త్రిగారును, వీరరాఘవ శాస్త్రిగారును కలిసి మూడువందల గాథలను, వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు గాథామృత మను పేర మరియొక మూడువందల గాథలను, రాళ్ళపల్లిని అనుసరించి తిరుమల వెంకటాచార్యులు కొన్ని గాథలను అనువదించిరి.[8]

తిరుమల రామచంద్ర 'ప్రాకృతభాషా చరిత్ర'ను ఈ సం॥ము ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ఆవిష్కరించినట్లు వారి నివేదిక వలన తెలియుచున్నది.[9]

శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు 'మధురగాథ' లను పేర గాథాసప్తశతిని గాథాశతిగా ననువదించిరి. ఆటవెలదులలో నల్లబడిన ఈ కావ్యములోని కొన్ని గాథలను స్పృశించెదము.

'ఇచట నే పరుందు,నిచ్చట మా యత్త
పరిజనమ్ము లచట, పాంథ! వినుము
రాత్రి కనులు కానరానివాడవు, నాదు
పడకమీద నీవు పడకు మోయి!'

ఇటువంటిదే మరియొక ప్రసిద్ధ పద్యమును భట్టుమూర్తి నరసభూపాలీయములో సన్నిధానము వారు ఉదాహరించారు.

'ఇచట మా యత్తపండు నేనిటపరుండు
పగటనే లెస్సగని గుర్తు పట్టుకొనుము
ఓనికాంధుడ! పాంథుడ యొప్పుడప్పి
పడకుమీ మాదుమంచాలపైని రేయి'[10]

మరియొకటి.

అదరు వామ నేత్రమా! నీదుసూచన
చేత ప్రియుడు వచ్చి చేరనేని,
తరుచుగ మరినిన్ను తెరచుచు, కడికన్ను
మూసి ప్రియుని జూతునోసి, నిజము

దీనినే డా॥ ముదిగొండ శివప్రసాద్ తమ అమృతవాహిని నవలలో వచన కవితారూపంలో రచించిరి.[11]

ఎడమ కన్ను అదురుతుంది -
    ఏమిటి శుభ సంకేతం
ప్రియుడు తిరిగివస్తాడని -
    ప్రోషిత పతికకు సూచన
అతడు నిజంగావస్తే -
    హర్షంతో కుడికన్నును
మూసివేసి ఎడమకంట -
    ముద్దుల మగవిని చూస్తా

భావకవితా వ్యవస్థాపకులలో నొకడైన బ్రహ్మశ్రీ తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రివర్యులకు ప్రాకృత భాష కొట్టినపిండి. పాళీభాషనుండి బౌద్ధ జాతక కథలను తెనిగించిరి.7

ఎందరో మహానుభావులు ప్రాకృత భాషను సేవించిరి. ఇక్కడికే వ్యాసము సుదీర్ఘమైనది. కనుక వారి నందరిని పేర్కొనుట సాధ్యము కాలేదు.

ఇతి శమ్

ఆధారగ్రంథములు :-

1. సమగ్రాంధ్ర సాహిత్యము- 1-ఆరుద్ర.
2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - బి. ఎన్. శాస్త్రి.
3. ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణం. -శ్రీ చలమచర్ల రంగాచార్యుల అనువాదం. [సాహిత్య కుసుమాంజలి - ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యుల పీఠిక పేజి 58-59]
4. సమగ్రాంధ్ర సాహిత్యము - ఆరుద్ర
5. 'భారతి' అక్టోబర్' 79.
6. శ్రీ తిరుమల బుక్కపట్నం కవితార్కిక సింహాచార్యుల చిటుపాత్రములు.
7. బౌద్ధజాతకకథలు - తల్లావఝ్ఝల.
8. శతకవాఙ్మయము - కె. గోపాల కృష్ణారావు.
9. సాహిత్య అకాడమీ నివేదిక.
10. కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానం వారి వ్యాఖ్య.
11. అమృతవాహిని నవల - ముదిగొండ శివప్రసాద్ 'విజయ' జనవరి 79 మాస పత్రికలో ప్రచురణ)

— ... —

# భారతీయ జీవనస్రవంతికి వివేకానందు డందించిన యోచనామృతం

— శ్రీ సోమసుందర్.

భారతదేశం వంటి అత్యంత ప్రాచీన చరిత్రగలది - తనగతాన్నంతనూ ఒక్క త్రుటిలో విస్మరించడం సాధ్యంకాదు. అలాగని గతాన్నంతనూ వివేచనా రహితంగా తన్వితలకెత్తుకోవడమూ సాధ్యం కాదు! అమేయ మానవేతిహాసంలో చిరస్మరణీయ ఘట్టాలూ ఉన్నాయి, విస్మరణీయాలూ ఉన్నాయి. ఏదైనా గతమే వర్తమానానికి పునాది.

భారతజాతి పునరుజ్జీవన కాంతి కళికలు సమకూర్చుకుంటున్న తొలి దివి భాతంలో శ్రీ వివేకానందుడు మహోదయమయ్యాడు. భారతీయ మహర్షి పరంపరా జీవన వాహినిలో తేలివచ్చిన దివ్య తరంగంగా అవతరించాడు. సనాతనాభిప్రాయాలను గతానుగతిక ధోరణిలో ప్రతిఫలించక, వర్తమాన వికాసలోక జీవనాడిని పరికించ కలిగినవాడు. కాలగమనాన్ని, యుగధర్మాన్ని గుర్తెరిగినవాడు. తనకాలంనాటి రోగగ్రస్త భారతిని సమగ్రంగా పరీక్షించాడు. వర్తమాన ప్రపంచ జీవితాన్ని సమగ్రంగా పరిశీలించాడు. చికిత్సా విధానాన్ని సన్నిహితంగా దర్శించాడు.

అమేయగతంనుంచే సముజ్జ్వల భవిష్యత్తు నిర్మింపబడుతుందని ఆయన విశ్వసించాడు. ప్రతిఒక్కరూ జాతి గత చరిత్రనంతనూ లోలోతులకు దిగి అవలోడించమన్నాడు. గతకాలాంతరాలలోనికి మనచూపు లెంత వెనక్కి ప్రసరించ గలవో అంత వెనక్కి చూడమన్నాడు. ఆసనాతన భారతిలో స్రవించే జీవధార లేవో పోల్చుకుని, వర్తమాన హృదయాంనిండా నింపమన్నాడు. కాని ఆ గతానికి మాత్రమే గురికట్టుబడక, సమస్తావధుల్నీ పరిశీలించమన్నాడు. గతచరిత్రను పరిశీలించిన నైశిత్యంతోనే - చూపులు ప్రసరించ గలిగినంత ముందుకీ చూడమన్నాడు. 'భవిష్యత్తు దిశగా నీఅడుగుల్నీ చూపుల్నీ శ్రుతిచేసి, జాతిని మానుముందుకే నడిపించాలి. వెనక్కి నడవడం సాధ్యం కాదు. భవిష్యద్దర్శనం వల్లమాత్రమే సముజ్జ్వల భారతిని, మహిమాన్విత భారతిని, రుచిరసౌభాగ్య భారతి సమున్నత భారతిని నిర్మించుకోగలం! అందుకే మన జీవితాలను వెచ్చించాలి!' అని ఘంటాపథంగా జాతిని హెచ్చరించా డాయన.

శ్రీ వివేకానందు లీజాతి కందించిన అమృత సందేశం మరొకటి సదా మననార్హం. 'మనజీవితానికి వర్తమానలోకంతోగల గాఢానుబంధాన్ని విస్మరించినట్లయితే మన మనుభవించేది జీవిత మనిపించు కోదు!' అని మన బడుగు జాతిని వెన్నుతట్టడం - ఆనా డెంత సాహసోపేత ధీరవాక్యమో! ఋషికల్పుడైన వివేకానందునికే సాధ్యమైంది.

ఈ వివేకానంద వాణిని ఉల్లేఖిస్తూ జవహర్‌లాల్ నెహ్రూగారు తన గ్రంథం డిస్కవరీ ఆఫ్ ఇండియాలో చాల చోట్ల వ్యాఖ్యానించారు. ముఖ్యంగా 64వ పుటలో ఇలా వివరించారు.' ఈ భూప్రపంచంపై ఎక్కడైనా -సజీవ మానవుల సుందర స్వప్నాలు చిరావాసం కల్పించు కోగలిగాయా అంటే అది ఒక్క భారతదేశంలోనే! ఇది చిరంతన మానవ స్వప్న మందిరం. ఈదేశం ఐహిక సుఖజీవనాన్ని ఎన్నడూ తిరస్కరించ

లేదు. అలాగని అదే చరమగమ్యం మనుకోనూలేదు!' అంటూ హృద్యంగా విశదం చేశాడు నెహ్రూ! వివేకానందుని దివ్యప్రభావాన్ని నెహ్రూ తన హృదయంలో గాఢంగా నిక్షిప్తం చేసుకున్నాడు. ఆ యోచనామృత ధారను మరింత హేతుబద్ధత చేకూర్చాడు.

వివేకానందుని వాక్యాలను వ్యాఖ్యానిస్తూ నెహ్రూ యింకా యిలా అన్నాడు. 'మనజాతి సాధించిన గత చరిత్ర విజయాలన్నీ మనజీవితంలో ముడిపడి వుంటాయి. ఆ సనాతన జాతీయ హృదయంనుంచి ఆవిర్భవించిన వాళ్ళమే మనమందరమూను. ఆప్రాచీన భారతి అనుస్యూతంగా ఉత్పత్తి చేస్తున్న సజీవ మూర్తులమే మనం! కనకనే మన జీవితం నిండా సర్వ వ్యాపిగా అమేయ గతవారసత్వం తొణిసలాడుతూనే ఉంటుంది.' అన్నాడు నెహ్రూ డిస్కవరీ ఆఫ్ ఇండియాలోనే!

'తన గతేతిహాసాన్ని విస్మరించినట్లయితే భారతదేశం తన జీవన సత్వాన్నే కోల్పోతుంది. విస్పష్ట స్వరూపంతో అది భారతజాతిగా భాసించలేక పోతుంది. తనసకల జీవలక్షణాలనూ, సౌభాగ్యాలనూ, సర్వ ఆనందలోకాలనూ, ఆత్మోన్నత గర్వరేఖలనూ పోకార్చుకుంటుంది.' అని నెహ్రూ వక్కాణించాడు. వివేకానందు లందించిన వారసత్వాన్ని నిశ్శంకంగా స్వీకరించాడు నెహ్రూ. 'కేవలసత్వగుణంతో మన ఋషులు తమ కాలాన్ని సాధననే వెచ్చించారు. మనం రజోగుణాన్ని అలవర్చుకుని నిరుపేదల కట్టు బానిసత్వాన్ని నిర్మూలించాలి. మానవజాతి సర్వ జీవన విధానాలనూ అవలంబించినా సమస్యలను పరిష్కరించుకోలేక పోయింది. మానవ జాతిని పీడించే సమస్యల పరిష్కారానికి కమ్యూనిజమే ఏకైక మార్గమైతే దాన్నే నిశ్శంకంగా భారతజాతి అవలంబించాల్సిందే!'అన్నంత దూరం నిస్సందేహంగా వివేకానందుని యోచనాధార ప్రవహించడం నెహ్రూ కంఠంలో ఉత్తేజాన్నిచ్చింది.

'మనగత చరిత్రను మనం వర్తమానంలో అనుసంధించాలి. దానిని భవిష్యత్తు దిశగా సమధికం చేయాలి. ఆ సనాతన సంప్రదాయం మన పురోగతికి శృంఖలగా ఎదురైనపుడు ఖండించే ధైర్యం కూడా మనం అలవర్చుకోవాలి. ఈ ధైర్యాన్ని కూడా గతచరిత్రే మన కందించింది. ఈ మాట మనం మరువకూడదు! అలాంటి సముజ్జ్వల గతం మన హృదయాలలో అనారతంగా నవఘంటికలు మ్రోయిస్తూనే వుంటుంది. మానవికోత్సాహాన్ని వెలారుస్తుంది. మృణ్మయమైన జీవితంలో ఆలోచనా దీపకళికలు వెలిగించి, అమృతమయం చేస్తుంది. మనకు క్రియాశీలతను గరపి ఆచరణలో జీవితాన్ని తేజోవంతం చేసుకోమని మనల్ని హెచ్చరిస్తుంది.'అంటూ విపులంగానూ, తాదాత్మ్యంతోనూ తన డిస్కవరీ ఆఫ్ ఇండియాలో నెహ్రూ వివరించాడు.

గతాన్ని గతంగానూ, వర్తమానాన్ని వర్తమానంగానూ, భవిష్యత్తును భవిష్యత్తుగానూ విడివిడి ఏకాండాలుగా తిలకించే వేర్పాటు ధోరణికి వివేకానందుడుగాని, పండితనెహ్రూగాని బద్ధశత్రువులే! ఈ కాలప్రవాహ మంతా ఒక అనుస్యూత జీవవాహిని! కాలానుగత

( తరువాయి 13 పేజీలో )

---

## నవ్వు !

– శ్రీ రామదుగు వెంకటేశ్వరశర్మ.

---

* ఆనందంబున కిద్ది యాను తొలిమె
ట్టారోగ్యమున్ బెంచఁగాఁ
గాణాచయ్యెను నెద్ది, బాధకదితా
'కామా'గ పాల్పొందు, లో
కానన్ ప్రేమికసంచయమ్మునకుఁ
గన్కట్టౌచు నెల్లప్పుడున్
రాణన్ జెందున దిద్ది. నవ్వ గదె
విన్నాణంబుగా మిత్రమా!

* నవ్వేగదా! ఎట్టివానిమోమున కైన
కళను గూర్చెడియలంకార మరయ
నవ్వేగదా! కష్టనష్టాల నిల్వనీ
నైనట్టి మనసున కాటవిడుపు
నవ్వేగదా! విభిన్న మనుష్యతత్త్వాల
చేతులం గలిపెడి సేతువౌర!
నవ్వేగదా! యెట్టినాణెంపు కార్యసా
ధనకేని దేవుఁ డిచ్చిన వరమ్ము
నవ్వుగాదె! నాల్గువిధాలనాశనమ్ము
చెందుటకుఁగూడ కారణ మెంగుఁజూడ
నవ్వుగాదె! జగాలను నడుపుశక్తి
నవ్వుగద! చేవసుఖమిచ్చు బువ్వ ప్రజకు.

* నవ్వులోఁ గాదె ! విన్పడును
శ్రావ్యమ్ముగా
మధ్వంపు మువ్వల సవ్వడులును
నవ్వులోఁగాదె! కన్పడును అందమ్ముగా
రివ్వు రివ్వన పోవు గువ్వలెన్నొ
నవ్వులోఁగాదె! చెన్నారునకమ్మ నౌ
త్తావుల విదజల్లు పూవులెన్నొ
నవ్వులోననెగదా! నడయాడుచుండు తా
రాజువ్వ లవి యెన్నొ రమ్యముగను
నవ్వులో నివ్వటిలు నిప్పురవ్వ లెన్నొ
నవ్వులోఁ నవ్వుచిన్నారి నవ్వులెన్నొ
నవ్వులోఁ బండు అనుభూతిరవ్వ లెన్నొ
నవ్వులో వెల్గు పరమాత్మ నవ్వ లెన్నొ.

*కనులు నవ్వుచుండు, గలగలధ్వనులతో
నదులు గూడ మిగుల నవ్వుచుండు
ప్రకృతిలోని పూలపాపలు నగుచుండు
నగని దేమి గలదు జగతిలోన? ॥

* నవ్వలేక యేడ్చు నరులెందరెందరు
ఏడ్వలేక నగుదు రెంతమందో
నరులు కొంతమంది నవ్వ లేడ్చినయట్లై
కొంతమందియేడ్పు కూర్చునగవు ॥

* మాటలాడి నవ్వ మనకు లే దిబ్బంది
నవ్వి మాటలాడ నమ్మరాదు
అసలునగని నరుఁడు నరుడైన యట్లైనిం
డుగను నగడి జనుఁడు జగతి నరుడె॥

*నవ్వువచ్చుచుండునరులఁగొందరిఁజూడ
నవ్వు నీ దొకందు రువ్వు 'విట్టు'
నరునియాశ యిద్ది 'నవ్వినవాపచే
నుర్విఁబండకుండ నుండు నొక్కొ?'॥

* నవ్వువచ్చుచుండు నక్షత్రవని, గిరీ
శమును, గణపతి నలె సాక్షి సమితి
బుడుగు,డుంబు,కాంతమును,పార్వతీశమ్ము
ననెడివారిఁ గూర్చి వినిన యంత॥

* నవ్వేగదా! కారణము నాఁడు ద్రౌపది
పదిమందిలో పరాభవము నొంద
నవ్వేగదా! కారణము రాయబారంపు
వేళ భీముని తేజ మేలుకొనగ
నవ్వేగదా!కారణము నాఁడు చంద్రుండు
పార్వతి చేత శాపమ్మునొంద
నవ్వేగదా! కారణము కాశిచే రామ
కృష్ణమహాత్ముండు కీర్తినొంద
నవ్వుగాదె! కారణము వినాయకుండు
అర్చితుండయి హాస్యరసాధి దేవ
తగను తగురీతిఖ్యాతి నెంతయును నొంద
నవ్వెగద! హేతు వీరచనకుఁ దలంప॥

—...—

( 12 వ పేజీ తరువాయి )

మానవ సంస్కృతి పట్ల వారియవురిదీ సమాహార పద్ధతి మాత్రమే!

వివేకానందాది మహార్షి పుంగవుల వచోధారతో పూత హృదయుడైన మహామేధావీ, ఎందరో భావకవులకూ మేధావులకూ గురుదేవుడూ అగు బ్రహ్మర్షి [బ్రహ్మ సమాజఋషి] రఘుపతి వేంకటరత్నంగారు భారతీయ తాత్త్విక ధారను కూలంకషంగా మథించారు. వివేకానందుని ప్రభావరశ్మితో తనజీవితాన్ని వెలిగించుకున్నా రాయన. కతభవిష్యత్తులకు వివేకానందుడు నిర్మించిన యోచనా సేతువుకు బ్రహ్మర్షి వనస్తోరణం కూర్చడం అసంగతం కాబోదు! 'Man the heir of ages past, and the architect of centuries to come...'

—...—

# పంప : నన్నయ - భారత రచనా ప్రణాళిక

— శ్రీ సాంబయ్య పరిమి, ఎం.ఏ.

పంప మహాకవి అరికేసరి ఆస్థానమున నుండెను. అరికేసరి పశ్చిమ చాళుక్యుడు, రాష్ట్రకూట సామంతరాజు. ఈతడు క్రీ.శ 10వ శతాబ్దము వాడు. పంప కవి 'ఆదిపురాణ' మను జినగ్రంథమును, పంప భారత మను పేరుగల 'విక్రమార్జున విజయ'మును రచించెను. మొదటిది మత పరమగు గ్రంథము. రెండవది లౌకిక ప్రబంధము. 'విక్రమార్జున విజయమును పంపకవి అరికేసరికి అంకితము చేసెను. అంతే కాదు. విక్రమార్జున విజయ నాయకుడగు అర్జునునకు, తన కాశ్రయ మిచ్చిన రాజగు అరికేసరికి అభేదమును పాటించి కావ్య రచన కావించెను. ఇది కావ్యము కాదు. ప్రబంధము. చతుర్దశాశ్వాస పరిమితము. ఈ ప్రబంధమునకు వస్తువును పంపకవి వ్యాసభారతమునుండి గ్రహించెను. భారత కథను యథాతథముగా గైకొనలేదు. లౌకిక ప్రబంధముగ విక్రమార్జున విజయమును కావించుటకు సంస్కృత భారతమున గల పన్నిదెశములలోని కథను తన కనుకూలముగ మార్చుకొనినాడు. విక్రమార్జున విజయము లౌకిక ప్రబంధ మగుటచే, ఇందు వ్యాస భారతమున గల ఆఖ్యానోపాఖ్యానములు, భగవద్గీతాదులు పరిహృతములు. దీనిచే ప్రబంధమునకు వస్త్వైక్యము సిద్ధించినది.

రాజరాజు కోరికపై నన్నయ ఆంధ్ర మహాభారత రచన కుపక్రమించినాడు. నన్నయ ఆదిపర్వ ప్రథమాశ్వాసమునందు పర్వానుక్రమణికా పర్వ సంగ్రహములు సంస్కృత భారతకథా ప్రణాళికను తెనిగించెను.

పంపకవి 'విక్రమార్జునవిజయ చతుర్థాశ్వాసమున వివరించిన ప్రణాళికను, నన్నయ పర్వానుక్రమణికను, పరిశీలించుట ప్రస్తుత వ్యాసోద్దేశము.

పంపమహాకవి విక్రమార్జున విజయము లోని పదునాల్గవ ఆశ్వాసమున తన ప్రబంధ ప్రణాళికను అరువది తొమ్మిది ఘట్టములుగ తెలిపినాడు. ఇవి పర్వములు కావు. వ్యాసభారతమున నూరు పర్వములు కలవు. ఆనూరు పర్వములలోనివి కొన్ని పై అరువదితొమ్మిదింటిలో కలవు. [అవి ఈక్రింది వానిలో under line చేయబడినవి].

'వ' అదెంతెనె - ఆది వంశావతార, సంభవం, ప్రవేశం, జతుగృహదాహం, హిడింబవధ, బకాసురవధ, దీ ద్రౌపద స్వయంవరం, వైవాహం, యుధిష్ఠిర పట్టబంధనం, ఇంద్రప్రస్థ ప్రవేశం, అర్జున దిగ్విజయం, ద్వారావతీప్రవేశం, సుభద్రా హరణం, సుభద్రా వివాహం,

ఖాండవ వనదహనం, మయ దర్శనం, నారదాగమనం, జరాసంధ వధ, రాజసూయం, శిశుపాల వధ, ద్యూత వ్యతికరం, వన ప్రవేశం, కిమ్మీర వధ, కామ్యకవన దర్శనం, ద్వైతవనప్రవేశం, సైంధవబంధనం, చిత్రాంగద యుద్ధం, కిరాత మాతాగమనం, ద్రౌపదీ వాక్యం, పారాశర వీక్షణం, ఇంద్రకీలాభిగమనం, ఈశ్వరార్జునయుద్ధం, దివ్యాస్త్రలాభం, ఇంద్రలోకాలోకనం, నివాతకవచాసుర వధ, కాలకేయ పౌలోమవధ, సౌగంధిక కమలాహరణం, జటాసుర వధ, మాయామృత్త హస్తివ్యాజం, ... ...'

విక్రమార్జున విజయం - 14 ఆశ్వా 53.

దీనిలో వ్యాసభారతములోని ఆది, సభారణ్య పర్వములు పూర్తి అయినవి. పైని పేర్కొనిన ఘట్టములను, వ్యాసానుక్రమణిక లోని పర్వనామములతో పోల్చవలసి యున్నది. సంస్కృత భారత పర్వ సంగ్రహమున -

'పర్వానుక్రమణీ పూర్వం
ద్వితీయం పర్వసంగ్రహః॥
పౌష్యం పౌలోమ మాస్తీక
మాదివంశావతారణం॥ 34
తతఃసంభవ పర్వోక్త
మద్భుతం దేవనిర్మితం
దాహో జతుగృహ స్యాత్ర
హైడింబం పర్వ చోచ్యతే॥ 35
తతో బక వధః పర్వ
పర్వ చైత్రరథం తతః।
తతం స్వయం వరం దేవ్యాః
పాంచాల్యాః పర్వచోచ్యతే॥ 36
క్షాత్రధర్మేణ నిర్జిత్య
తతో వైవాహికం స్మృతం।
విదురాగమనం పర్వ
రాజ్యలంభ స్తథైవ చ॥ 31
అర్జునస్య వనే వాసః
సుభద్రాహరణం తతః।
సుభద్రాహరణా దూర్ధ్వం
జ్ఞేయం హరణహారికం॥ 38
తతః ఖాండవదాహాఖ్యం
తత్రైవ మయ దర్శనం॥
సభాపర్వ తతః ప్రోక్తం
మంత్రపర్వ తతః పరం॥ 39
జరాసంధ వధః పర్వా
పర్వ దిగ్విజయ స్తథా।
పర్వదిగ్విజయా దూర్ధ్వం
రాజసూయిక ముచ్యతే॥ 40
తత శ్చార్ఘ్యాభి హారణం
శిశుపాలవధ స్తతః
ద్యూతపర్వ తతః ప్రోక్త
మనుద్యూత మతఃపరం॥ 41
తతఆరణ్యకం పర్వ
కిమ్మీరవధ ఏవ చ।
ఈశ్వరార్జున యో ర్యుద్ధం
పర్వ కైరాత సంజ్ఞితం॥ 40
ఇంద్రలోకాభిగమనం
పర్వ జ్ఞేయ మతః పరం।
తీర్థయాత్రా తతఃపర్వ
కురురాజస్య ధీమతః॥ 43
జటాసుర వధః పర్వ
యక్షయుద్ధ మతః పరం।
తథైవా జగరం పర్వ
విజ్ఞేయం తదనంతరం॥ 44
మార్కండేయ సమాస్యా చ
పర్వోక్తం తదనంతరం।
సంవాద శ్చ తతఃపర్వ
ద్రౌపదీ సత్యభామయోః॥ 45
ఘోషయాత్రా తతఃపర్వ
మృగస్వప్న భయం తతః।
వ్రీహిద్రౌణిక మాఖ్యానం
తతో ఽన్యన స్తథ ముచ్యతే॥ 46
ద్రౌపదీ హరణం పర్వ
సైంధవేన వనా త్తతః।
కుండలాహరణం పర్వ
తతఃపర మిహోచ్యతే॥ 47
ఆరణ్యేయం తతఃపర్వ ... ... ...

మహాభారతం ౧- 2వ అధ్యాయము.
B. O. R. I ప్రతి.

పై పర్వములను పరిశీలించిన పంపకవి యొక్క స్వాతంత్ర్యము తెలియుచున్నది. 'విక్రమార్జున విజయ' మునకు కావలసిన ఇతివృత్తమును తత్సంబంధ పర్వనామములను పంపకవి గ్రహించినాడు. వ్యాసుని పర్వ సంగ్రహమువందు లేని ఘట్టములు కొన్ని పంపకవియొక్క ప్రణాళిక యందు కలవు[Underline చేయనివి]. ఇవి పర్వములుగా సంస్కృత భాగితము'న లేవు. సంస్కృతమున గల అర్జున వనవాస పర్వము, పంప ప్రణాళిక యందు 'అర్జున దిగ్విజయ' ముగ మారియుండవచ్చును. లేదా సంస్కృతమున గల సభాపర్వములోని 'దిగ్విజయ పర్వ'మే మారియుండవచ్చును. విక్రమార్జున విజయములోని కథానాయకుడు అర్జునుడు, ద్రౌపదిని వివాహమాడిన పిమ్మట వనవాసముచేయుడు. దీనికి కారణము - ద్రౌపది అర్జునునకు మాత్రమే భార్య. అట్టిచో సోదరులు సమయ మేర్పరచుకొనుట గాని, సమయ ప్రకారము వనవాసము చేయుట గాని, 'విక్రమార్జున విజయమున ప్రసక్తము కాదు. అందుచే సభా పర్వములోని 'దిగ్విజయ పర్వమే' 'అర్జున దిగ్విజయ' ముగా మారెన దనుకొన వచ్చును కాని, అర్జునుడు వనవాసముచేయు సందర్భమున ఉలూచీ, సుభద్రలను పరిణయ మాడినట్లు సంస్కృత భారతమున కలదు. అర్జునుని వనవాసము విక్రమార్జున విజయమున అసంగత మగుటచే, అర్జునుడు దిగ్విజయమునకు వెళ్ళి, మదనలతా, సుభద్రలను పరిణయమాడినట్లు కలదు. దీనినిబట్టి పంపకవి వస్త్వైక్యమునకై సంస్కృతమున గల 'అర్జున వనవాస పర్వమును, దిగ్విజయ పర్వ' మును కలిపి 'అర్జున దిగ్విజయ మన్నా' డన వచ్చును.

ఇట్లు సన్నివేశ వస్త్వైక్యముల కు ప్రాధాన్యము నిచ్చి మూలభారతమున పర్వములుగ లేని కొన్ని ఘట్టములను

పంపకవి తన ప్రణాళిక యందు చేర్చుకొన్నాడు.

మహాభారతమును సంక్షేపించు విధానమున, నన్నయ, పంపకవిని అనుసరించెనను ప్రథయొకటి కలదు. అది ప్రమయో భ్రమయో తెలిసికొన వలెనన్న, నన్నయ పర్వాను క్రమణికను, వ్యాస పంప కవులతోపోల్చి చూడవలసియున్నది. ఆంధ్ర మహాభారత మున —

'ఆదియును, పౌష్యంబు, పౌలోమం, బాస్తీకం, బాదివంశావ తారంబు, సంభవ పర్వంబు, జతుగృహదాహంబు, హైడింబంబు, బకవధ, చైత్రరథంబు, ద్రౌపదీ స్వయంవరంబు, వైవాహికంబు, విదురాగమనంబు, రాజ్యార్థ లాభంబు, అర్జున తీర్థయాత్ర, సుభద్రాకల్యాణంబు హరణహారిక, ఖాండవ దహనంబు, మయదర్శనంబు, సభాపర్వంబు, మంత్ర పర్వంబు, జరాసంధవధ, దిగ్విజయంబు, రాజసూయం, బర్ఘ్యాభి హరణంబు, శిశుపాలవధ, ద్యూతం, బనుద్యూతం, బారణ్యంబు, కిమ్మీరవధ, కైరాతం, బింద్రలోకాభిగమనము, ధర్మజ తీర్థయాత్ర, జటాసురవధ, యక్షయుద్ధం, బాజగరంబు, మార్కండేయోపాఖ్యానంబు, సత్య ద్రౌపది సంవాదంబు, ఘోషయాత్ర, ప్రాయోప వేశంబు, వ్రీహిద్రోణకాఖ్యానంబు, ద్రౌపదీ హరణంబు, కుండలాహరణం, బారణేయంబు ... ... ...'

ఆది. ప్ర 33 వచనము. సం. శోధిత ప్రతి

ఈ పర్వానుక్రమణిక యందు అరణ్య పర్వము వరకు గల పర్వముల క్రమము వ్యాసభారతమునందున్నటుల అదేక్రమమున నున్నది. పర్వనామముల యందు మాత్రము ముఖ్యముగా మూడుమార్పులు గలవు. ['గుర్తుచే సూచింపబడినవి]

1. 'సుభద్రా, హరణ'మని సంస్కృతమున నుండగా నన్నయ, 'సుభద్రా కల్యాణం' అనినాడు, దీనికి పాఠాంతరములు సంస్కృతమునగాని, తెనుగున గాని లేవు. పంపకవి, 'సుభద్రాహరణం' సుభద్రా వివాహం' అను రెండు ఘట్టములను పేర్కొనినాడు. వివాహమునకు, కల్యాణమునకు భేదము కలదు. వివాహమునకు 'పెండ్లి' అను అర్థముకాక, వేరొక అర్థములేదు. కల్యాణ మనగ 'శుభము' 'చొక్కపు బంగారము' అనినానా అర్థములు. కల్యాణమునకు వివాహమని వ్యవహారమున ప్రయుక్తము.

నన్నయ 'సుభద్రా కల్యాణ' మని అనుటకు కారణమును తెలిసికొనవలె నన్న కథాంశములను పరిశీలింపవలెని యున్నది.

వ్యాసభారతమున 'సుభద్రాహరణ' పర్వము నందు వాసుదేవుడు అర్జునితో నిట్లనెను —

'స్వయంవరం క్షత్రియాణాం
 వివాహః పురుషర్షభ।
స చ సంశయితః పార్థ
 స్వభావ స్యా నిమిత్తతః॥
ప్రసహ్య హరణం చాపి
 క్షత్రియాణాం ప్రశస్యతే।
వివాహహేతోః శూరాణా
 మితి ధర్మవిదో విదుః॥

1-211. శ్లో 21,22

B.ORI ప్రతి.

పై శ్లోకములవలన క్షత్రియులకు వధూహరణము కూడ ప్రశస్యమైన దని తెలియుచున్నది.

నన్నయ ఆదిపర్వములోని అష్టమాశ్వాసమున అర్జునుడు సుభద్రతో నిట్లనును.

'బ్రాహ్మంబు మొదలు గాగల యెనిమిది వివాహంబుల యందును గాంధర్వ రాక్షసంబులు క్షత్రియులకు నుత్తమ వివాహంబులు గావున నిది గాంధర్వవివాహంబున కవసరం బనిన సుభద్ర లజ్జావనత వదన యయి ... ... ...

ఆది - G - 188 వచ.

దీనివలన నన్నయ దృష్టియందు సుభద్రార్జునులది గాంధర్వ వివాహము. రాక్షసము కాదు. హరణ మనగ ఎదుటి వారి యొక్క ఇష్టానిష్ట ప్రమేయము లేక ఎత్తుకొనిపోవుట - నన్నయ దృష్టిలో అర్జునుడు సుభద్రను హరింపలేదు.

సంస్కృతమున శ్రీకృష్ణుడు బలరాముని తో పల్కు సందర్భమున -

'ఏతాన్ దోషాంశ్చ కౌంతేయో
 దృష్టవా నితి మే మతిః।
అతః ప్రసహ్య హృతవాన్
 కన్యాం ధర్మేణపాండవః 5
ఉచిత శ్చైవ సంబంధః
 సుభద్రా చ యశస్వినీ॥
ఏష చా పీదృశః పార్థః
 ప్రసహ్య హృతవా నితి॥ 6

1.213 అధ్యా. B.B.R.I ప్రతి

- అని కలదు. ఈశ్లోకములు పార్థునకు సుభద్రకు గల ఉచిత సంబంధమును తెల్పుచున్నవి.

నన్నయ ఆంధ్ర భారతమున-

'తనమేన మందలి ధవళాక్షి దోడ్కొని చనియె నాతని కది చనదె చెప్పుడు?'

ఆది. 3.208

- అని శ్రీకృష్ణుడు బలరాముని అడిగిన దానిని పరిశీలించిన అర్జునుడు సుభద్రను 'తోడ్కొని చనియె' నని తెలియును. అంతేకాదు. రథముపై పోవుచున్న సుభద్రార్జునులగాంచి పృథుశ్రవసు డాదిగాగల వీరులు' ... ... సుభద్ర నంభోరుహనేత్ర 'దోడ్కొనుచు పోయెడి నీతని పోవనిచ్చినన్' (1-8-199 పద్య) అని ఎదుర్కొనిరి. శ్రీకృష్ణుడు సుభద్రార్జునులను ఇంద్రప్రస్థమునకు పంపు సందర్భమున - 'వారికుంచిన మార్గంబున, గురువిభుడు సుభద్రం దోడ్కొని చనుచెడ' (1-8-199 పద్య) అని కలదు. నన్నయ అర్జునుడు సుభద్రను 'తోడ్కొని చనియె' నని గాని

హరించె నని అనలేదు. ఇది హరణము కాదు. రాక్షసము కాదు.

మఱి నన్నయ కూడ 'సుభద్రా వివాహం' అని అనవచ్చునుగదా! 'సుభద్రా కల్యాణం' అని ఎందు కనినాడు? అను ఆశంక కలుగవచ్చును. నిశ్చయముగ సుభద్రార్జునులకు జరిగినది వివాహమే, పైగా అది జగన్నారాయణుడు కావించినది, శుభమును గూర్చునది.

కల్యాణ మనగ 'కల్యంసుఖం అణయతి ప్రాపయతి కల్యాణం, అణగతౌ. సుఖమును పొందించునది'. (అమరకోశ. గురుబాల ప్రబోధికా. P. 106) కల్యం అనగ నేర్పు, ఉపాయము కలది. శుభమైనది. సంపాదింప బడినది. అని అర్థము. ఈ అర్థములతో 'కల్యాణ' మనకు సంపాదింప బడిన దానిచే సుఖమును పొందుట' అని అర్థమును చెప్పవచ్చును. శ్రీకృష్ణుని నేర్పరి తనముననే సుభద్రార్జునులకు వివాహము జరిగినది. శ్రీకృష్ణుని ఉపాయము చేతనే సుభద్రార్జునులు ఇంద్రప్రస్థమునకు పోగలిగిరి.

'వివాహ' మనిన ఇన్ని అర్థములు రావు. వివాహములు ఎనిమిది రకములు. అందు క్షత్రియుల కుచితమైనవి రాక్షస గాంధర్వములు. ఇట అర్జునుడు సుభద్రతో గాంధర్వ వివాహమున కిదిసమయ మనును. అంతసుభద్ర లజ్జావనతయై 'నన్ను నీ వర్థిలించున్నవారు వార యెరిగి చేయుదురు 'వివాహ మనుచు' (ఆది 8-189 పద్య) వెడలి పోయెను.

గాంధర్వ, వివాహ స్వరూపమును నన్నయ శకుంత లోపాఖ్యానమున ఇట్లు వివరించెను -

'తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు
గతియుఁ దన్నిచ్చుచోఁ దానకర్త
యనగ
వనజనేత్ర గాంధర్వ వివాహ మతిర
హస్యమును నమంత్రకమును
నగుచు నొప్పు.'
(ఆది. చతు. 53 పద్య)

సుభద్రార్జునుల వివాహము అతి రహస్యము కాదు. బలరామునకుతప్ప తక్కిన సాంబసాత్యకి సారణాదులకు తెలిసినదే. ఈ వివాహము అమంత్రకమును కాదు. 'అత్రిభృగు వసిష్ఠ వామదేవాది మహా మునులు సదస్యులు కాగ "కశ్యపప్రజాపతి హోమః ర్త కాగ, 'అరుంధతియు, శచియు, సత్యభామయు, రుక్మిణియు, అప్సరోగణంబు తోడం బురంధ్రీకార్యంబులు నిర్వర్తింప' సుభద్రార్జునుల వివాహ మతిరమ్యముగా జరిగినట్లు కలదు. కావున గాంధర్వ వివాహమునకు గలనియమములు(Rules of Regulations) ఈ వివాహమునకు వర్తింపవు ఇది గాంధర్వ వివాహము కాదు. ఇక ఈ వివాహమును రాక్షస వివాహ మనుటకు అవకాశము లేదు. సుభద్రార్జునులది సాధారణ వివాహము కాదు. కల్యాణ ప్రద మైన వివాహము.

పంపకవి 'అర్జున దిగ్విజయ' మను ఘట్టమునందు విక్రమార్జునుడు ద్వారావతికి వెళ్లి, అచట సుభద్రను చూచి, మదన పరవశుడై యుండుటయు, అర్జునుని చూచిన సుభద్రకూడ మన్మథ తాపమును భరింపలేక నికుంజమున నుండగ అర్జును డచటికి వెళ్లుటయు, ఆసందర్భమున శ్రీకృష్ణు డచటికి వచ్చి అర్జునునితో సుభద్రను తీసికొని ఇంద్రప్రస్థమునకు వెళ్ళు మనగ, అర్జును డావిధముగ చేసి ఇంద్రప్రస్థమున సుభద్రను వివాహము చేసి కొనినట్లు వర్ణించి నాడు.

ఇందు వివాహమునకు ముందే సుభద్రాహరణము జరిగినది. ఇది 'విక్రమార్జున విజయమున అర్జునుని పరాక్రమమును చాటు సన్నివేశము. సంస్కృతమున వివాహానంతరమే సుభద్రాహరణము కలదు. పంప భారతమున ఈ వివాహము రాక్షస వివాహముగ నున్నది. ఈ ఘట్టములోని ఈ కార్యమును హరణముకాదని, వివాహము కాదని, పంపకవి కల్పించిన సన్నివేశమును పరిశీలించి, అందు శుభమును కలదని సుభద్రాకల్యాణ మను పర్వ నామమును నన్నయ చెప్పియుండును.

2. వ్యాసభారతమున 'మార్కండేయ సమస్యా' అని ఉండగా నన్నయ మార్కండేయోపాఖ్యాన మని మార్చినాడు. సంస్కృతమున $K_2.D_{38\cdot14}$ $T_2\ G_{2\cdot7}$ ప్రతులలో 'మార్కండేయ సమాఖ్యా', $T.G_5$. ప్రతులలో మార్కండేయ సమాఖ్యం, $Dr_4$. $G_{4,6}\ M_3$. ప్రతులలో 'మార్కండేయ సమాస్యా, అనియు కలదు. పంపకవి ఈ 'మార్కండేయ సమస్య' ను గ్రహింపలేదు. సంస్కృతమునందలి T. G ప్రతులలోని మార్కండేయ సమాఖ్య' తెనుగున మార్కండేయోపాఖ్యానమై యుండవచ్చును.

3. భారత సంశోధిత ప్రతి యందు -

ఘోషయాత్రా తతఃపర్వ
మృగస్వప్న భయం తతః।
వ్రీహిద్రౌణిక మాఖ్యానం
తతో౽౽న స్తర ముచ్యతే॥ 46,'

అనికలదు. నన్నయ 'ఘోషయాత్ర, ప్రాయోపవేశంబు, వ్రీహి ద్రోణకాఖ్యానంబు,' అనినాడు, తెలుగున గల ప్రాయోపవేశ పర్వము. B.O R.I. వారి ప్రతిలో ప్రధాన పాఠమున కానరాదు. పాఠాంతరములందు గలదు. $D_{9\cdot11}$, T ప్రతులలో 'తతః ప్రాయోపవేశనం' $D_{14}$ G. M. ప్రతులలో 'పర్వ ప్రాయోప వేశనం' అని కలదు. నన్నయ 'మార్కండేయోపాఖ్యాన మను మార్పును ఏ T. G. ప్రతులను చూసి చేసెనో? ఆ ప్రతులను చూసియే 'ప్రాయోపవేశ' మను పర్వ

మును గ్రహించినాడని నిర్వివాదముగ చెప్పవచ్చును.

ఈపర్వానుక్రమణికనుగూర్చి కన్నడమున శ్రీ వెంకటరామప్ప ఈక్రింది విధముగా తెలిపిరి —

'పంపనూ నన్నయభట్టనూ ఆ హెసరుగళన్ను ఒందేక్రమదల్లి హేళిద్దారె. ఉభయకవిగళిగూ బళసిరువ సమాస పదగళ సాదృశ్య గమనార్హవాగిదె.' (పంప-నన్నయ ఒందుసమీక్షె, పుట 20) (పంపడును, నన్నయభట్టును ఆపేర్లను ఒకే క్రమమున చెప్పిరి. ఉభయకవులు వ్రాసిన సమాస పదముల సాదృశ్యము గమనార్హమైనది) ఇందలి సత్యాసత్యములను పరిశీలింతము.

పంపనన్నయల ప్రణాళికానుక్రమణికను పరిశీలించినపంపకవియొక్క స్వాతంత్ర్యము, నన్నయ యొక్క మూలాధేయత, స్పష్టమగుచున్నవి. పంపని ప్రణాళిక యందున్నవి పర్వములు కావు. అవి కేవలము సన్నివేశములు, లేదా ఘట్టములు. ఈ సన్నివేశములు కథానాయకుని ఔద్ధత్యమును చాటునవి. ఇక పంప నన్నయలయందు సమాస పదముల సాదృశ్యము యథార్థమే. ఈ సమాస పదములు వ్యాసనిర్మితములు. ఇద్దరు కవులు వానిని గ్రహించిరనుట అసంగతము కాదు.

వ్యాస భారతహృదయమును ఆంధ్రులకందించుటకు మూలమునగల పరీక్షిన్మహారాజమరణ వృత్తాంతము, జరత్కారు వృత్తాంతాది పునరావృత్త సన్నివేశములను, ఉదంకోపాఖ్యానమునగల నాగస్తుతి, సౌపర్ణాఖ్యానమునగల అగ్నిసూక్తములాది దీర్ఘస్తోత్రములను, వేదుల వృత్తాంతము, విదురవివాహము మొదలైన మూలకథ కనవసరమైనఉపకథలను పరిహరించి సంక్షిప్తీకరించి నన్నయ భారతరచన కావించినాడు.

పంపకవి విక్రమార్జున విజయరచనలో నాయక గుణౌద్ధత్యమునకై, వస్త్వైక్యమునకై, కథాస్వాతంత్ర్యముతో సంస్కృత భారతము నందలి ఆఖ్యానోపాఖ్యానాదులను కన్నడించినాడు.

ఇద్దరి రచనావిధానములలో ఎంతయో భేదము కలదని స్పష్టమగుచున్నది. కాని శ్రీ వెంకటరామప్ప గారి అభిప్రాయము దీనికి విపరీతముగ నున్నది.

'ఈగ్రంథ సంగ్రహ కార్యదల్లి పంపను అనుసరిసిరువ తంత్రక్కూ, నన్నయభట్టను అనుసరిసిరువ తంత్రక్కూ హెచ్చు భేదవిల్ల -' పంప నన్నయః ఒందుసమీక్షె పుట. 20. (ఈ గ్రంథ సంగ్రహకార్యమునందు పంపడు అనుసరించిన తంత్రమునకు, నన్నయ అనుసరించిన తంత్రమునకు హెచ్చుభేదము లేదు.)

నన్నయ 'విక్రమార్జున విజయమును చూచి ఉండకపోడు. కవులిద్దరకు కావ్యవస్తువు సమానము. వీరిద్దరి రచనా సాదృశ్యమును, కావ్య వస్తుసాదృశ్యమును, మూల కావ్యవస్తువుతో పరిశీలింప వలసినదే కాని, వ్యాసభారతమును మూలకు నెట్టి 'అహో! వీరిసాదృశ్య విధానమును చూడుడు' అనుట సరియగు విమర్శ కాదు.

పంపని రచనలో అవ్యాసీయ సన్నివేశములు కలవు. అట్టివి నన్నయరచనలో లేవు. కొన్ని వర్ణనలు మాత్రమే కలవు. నన్నయ రచన పాత్రచిత్రణ విషయమున వ్యాసభారత హృదయమును మెఱుగు పెట్టునది కాని, మఱుగు పరుచునది కాదు.

— ... —

# విశ్వనాథవారి "హాహా హూహూ" - ఒక పరిశీలన

— శ్రీ ఎం. సీతారామయ్య, ఎం. ఏ.

విశ్వనాథ సత్యనారాయణగారు రచనగానే పాఠకుల కర్థముకాని దేదో అతి కఠిన శైలిలో వ్రాసెదరు, సామాన్య పాఠకునకు బోధపడని రచనలు వారివి; యను నింద తెలుగుదేశమున వ్యాపించియున్నది. ఇది వారి కవిత్వమున కొంతవరకు నిజమేకాని మిగిలిన వారి కావ్యేతర గద్య రచనలు తద్భిన్నముగా గోచరించును. విశ్వనాథవారి సాహిత్యమును శ్రోతుగా పరిశీలించిన వారి భావములు ఆలోచనలు ఆవశ్యములు మొదలగు వానికి సంబంధించిన వారి మనోజగత్తు అతిసరళము, సులభగ్రాహ్యము నని గ్రహించెదరు.

విశ్వనాథవారి నవలారచన అతిసరళమైనది. వారు చిన్ననవల వ్రాసినను పెద్దనవల వ్రాసినను పెద్దగా శ్రమపడినట్లు కన్పించదు. అనవసరమైన హంగామా ఏమియు చేయరు. రచన అతి సహజముగా మామూలు ధోరణిలో సాగిపోవును. సాంఘిక బాధ్యతలు గుర్తించిన ప్రతిపాఠకుడు నాస్తికుడైనను, ఆస్తికుడైనను చదువుట ప్రారంభించిన నవలను పూర్తి చేయువరకు వదలడు. కారణము వారు స్వీకరించిన వస్తువు అతిసామాన్యమైన దైనను ప్రతివాక్యమున నేదోయొక విధమైన చమత్కారము, జాతీయమైన కొన్ని విలువలు తొంగిచూచుచుండును. పాఠకునకు అడుగడుగున తానేదియో జీవితమున గొప్పవిషయమును మరచితినేమో యను సందేహమును స్ఫురింపజేయును. ఇది సాహిత్యమునకు ఉత్తమ లక్షణమే గదా!

'హాహా హూహూ' విశ్వనాథవారి లేఖినినుండి వెలువడిన చమత్కారయుతమైన చిన్ననవల. దీని ఇతివృత్తము పూర్తిగా కల్పితము. అది చారిత్రకము గాని, సాంఘికముగాని, రాజకీయము గాని, సమస్యాత్మకముగాని, ప్రయోగాత్మకముగాని కాదు. ప్రభావాత్మక మని

చెప్పవచ్చును. విశ్వనాథ భారతీయ తత్త్వమును జీర్ణించుకొన్న పండితుడు, ఆలోచనా పరుడు, అవగాహన శీలి. పాశ్చాత్యులు భారతదేశమును గురించి వ్రాయుచున్న వ్రాతలు వారిని కలవర పరచినవి. అవి యవాస్తవికము లనియు, సత్యదూరము లనియు భావించినారు విశ్వనాథ.

పాశ్చాత్యులు పరిశోధనా రంగమున తామగ్రగాము లనియు, వైజ్ఞానిక పరిశోధనల మూలమున తామపారమైన ప్రగతిని సాధించినారను భావముతో గర్వించుచున్నారనియు విశ్వనాథవారభిప్రాయపడినారు. నిజమునకు వారు భారతీయుల చరిత్ర సంస్కృతుల నర్థము జేసికొనలే దని గ్రహించినారు. చారిత్రక దృష్టితో భారతీయ గ్రంథములను పరిశీలించి, పాశ్చాత్యుల యభిప్రాయములు కేవలము వారి యల్ప జ్ఞానమునకు నిదర్శన మని నిర్ణయించినారు. కాని యీ నిర్ణయమును భారతీయులే గ్రహించు స్థితిలోలేరు. వీరు ఆస్థితిని దాటి వైజ్ఞానిక సభ్యతయొక్క ప్రభావమునకులోనైనారు. ఈ ప్రభావమును కాదని ధిక్కరింపగల ధైర్యసాహసములు గలవారు గనుక నీ రూపమున స్వజాతిని హెచ్చరించుచు, కల్పితకథను వ్రాసినారు ఈనాడు కాకపోయినను నేనాటికైనను చరిత్రలో నీ హెచ్చరికయొక్క ప్రాధాన్యము గుర్తింపబడగలదను ఆశావాదము నీరచనయందు చూడగలము.

ఒక రోజున లండను నగరమునందలి ట్రెఫాల్గర్ స్క్వేరువద్ద గుర్రముతల గలిగిన వింతమనిషిని చూచెదరు. వారతనిని విచిత్రమైన జంతువుగా భావించెదరు. ఆ జంతువును చూచుటకు జనము నిత్యము గుంపులు గుంపులుగా వచ్చెడివారు. అది యెచ్చటినుండివచ్చినదో యెవరు తెచ్చినారో యిదమిత్థముగా ఎవరికిని తెలియదు. విశేషజ్ఞులు, శాస్త్రజ్ఞులు కూడ అది జంతువు అయినది మనిషి అయినది నిర్ధారణచేయలేరు. అది వారనుకొను మనిషికంటె ఎంతో బుద్ధియు సంస్కారమును గలది. అది సంస్కృతమున మాట్లాడును. ఉదయమున స్నానము జపము చేయును. పండ్లు తినును. ప్రాణాయామముకూడ చేయును. దానికి యోగవిద్యలో మంచిప్రావీణ్యము కూడ గలదు. కాని యీ విద్య విలువ తెలియని అచ్చటి ప్రజలకు, పండితులకు, అవియన్నియు నేవియో చేష్టలుగా స్ఫురించును. అది సంస్కృతమున మాట్లాడు చుండగా గుర్రము సకిలించుచున్న దని భావించెడివా రచ్చటి ప్రజలు. క్రమముగా లండను విశ్వవిద్యాలయ మందలి ఒక ఆంగ్లేయ సంస్కృతి పండితుని వలన నది మాట్లాడు భాష సంస్కృత మని గుర్తింపబడును. అతని సహాయముతో పండితులు, శాస్త్రజ్ఞులు ఆ విచిత్ర జంతుమానవునితో సంభాషణలు జరిపెదరు. అతని పేరు 'హాహా హూహూ' యని నిర్ణయించెదరు. ఇంగ్లీషు వారలేకాక ఫ్రాన్సు,జర్మని దేశముల నుండికూడ శాస్త్రజ్ఞులీ విచిత్రమును పరిశోధింప వలయునని వచ్చెదరు. వారికి మానవ జంతుఆకారముల సంయోగమును జంతువునోటినుండి భాష వెలువడుటయు నర్థముకాలేదు. శస్త్రచికిత్స చేసి పరిశోధింపవలయు నని వారు శతవిధముల ప్రయత్నము చేసినారు. కాని ఆ జంతుమానవుడు తన యోగప్రక్రియమూలమున అసలు మత్తుమందునే తన శరీరములోనికి ప్రవేశింపనీయక నిరోధించెను. పైగా ఆ శాస్త్రజ్ఞుల వింతకోర్కెకు విస్తుపోయి ఆ కోర్కెలకు కారణమైన వారి బుర్రలను తాను పరిశీలించెద ననును. ప్రాణులన్నియు మానవులతో సహిత మందరు జంతువులేయనియు జ్ఞానము, శక్తి యను నవి యేరూపమునైన నుండవచ్చుననియు, మనకు తెలిసినదే జ్ఞాన మని భావించి విఱ్ఱవీగుట, యితరులను చులకనగా చూచుట యల్పజ్ఞానమునకు నిదర్శన మనియు, మనముకోరుకొనెడి స్వేచ్ఛా,స్వాతంత్ర్యములు ఇతరులకు కూడ నుండు నను సత్యమును విస్మరించుట దుష్ప్రవృత్తికి నిదర్శన మనియు సందేశాత్మకముగా మాట్లాడును. అతనిలోని యీ ఉన్నతమైన గుణములకు, అభిప్రాయములకు వారు తలవంచెదరు. అతనిపట్ల నగర పెద్దలకు గౌరవభావమేర్పడును. అతనిని బంధనములనుండి తప్పించి సకలసౌకర్యములు గల ఆవాసము నేర్పాటుచేయుదురు. అతని నుండి వారెన్నియో విషయములను తెలిసికొందురు. మృదుమధురమైన సంగీతమును విందురు. కొంతకాలమున కతనికి రెక్కలు మొలుచుకొని వచ్చును. వాటిని సంకల్ప బలముతో సాధించితి నని యతడు చెప్పును. ఆ రెక్కలతో నాత డొకరోజున ఆకాశమార్గమున ఎగిరిపోవును. శాస్త్రజ్ఞులు విమానములతో వెంబడించెదరు. కాని అనుసరింపలేరు. ఆ క్రితము రాత్రి వారి చేతి కిచ్చిన ఉత్తరమునం దతడు గంధర్వ లోకమునకు వెళ్ళుచున్నా నని వ్రాసిపెట్టును. దానితో పండితు లతనిని గంధర్వుడుగా నిర్ణయించుకొందురు. ఇదీ క్లుప్తముగా నవల.

ఈనవల యందు విశ్వనాథ వారు మానవ ప్రపంచములోని రెండు జీవన దర్శనముల మధ్య నున్న స్థితిగతుల భేదములను నిరూపించినారు. రెండు జీవన మార్గముల స్వరూప స్వభావములను పరిచయముచేసినారు. వానిలో ఒకటి పాశ్చాత్యము. రెండవది భారతీయము. మొదటి దానికి నవలలోని ఫ్రెంచి, జర్మను శాస్త్రజ్ఞులు ప్రతినిధులు. రెండవదైన భారతీయ దర్శనమునకు 'హాహా హూహూ' అను గంధర్వుడు ప్రతీకగా నిలబెట్టబడినాడు. ఈనాటి భారతీయులు

కూడ పాశ్చాత్య దృక్పథమున ప్రభావితులైయున్నారు. కనుక 'భారతీయ దర్శన మనగా ప్రాచీన భారతీయ ఆర్ష దర్శనముగా భావింపవలయును.

పాశ్చాత్యులు ప్రయోగాత్మకమైన భౌతిక విజ్ఞానమునకు ప్రాధాన్యము నిచ్చెదరు. నేల, నింగి, నిప్పు, నీరు, గాలి మొదలగు పంచ భూతములను పరిశోధించి వాని మూలమున మానవుని భోగసాధనములను తయారు చేసి సుఖపడుటయే వారి ధ్యేయము. వీరి దృష్టిలో జ్ఞానమును పంచజ్ఞానేంద్రియముల వలన బాహ్య జగత్తు నుండియే పొందవచ్చును. జ్ఞానము జ్ఞానము కొరకే యని నమ్మి వీరు శరీరమునకు స్థూలాంగములైన కన్ను, ముక్కు, చెవి మొదలగువానికే ప్రాధాన్యము నిచ్చెదరు. ఈ కారణముగా వీరు వస్తుస్థితి నతిగమించి యోచింపలేక పోవుచున్నారు. జ్ఞానము జ్ఞానము కొరకను కొనువీరు సృష్టిస్వభావ వైచిత్ర్యము నవగాహన చేసికొని సంతుష్టి పొందలేరు. ఒక పండు తియ్యగా నున్నదనగా నది సహజగుణ మని భారతీయదృష్టి తెలిసికొని తృప్తిపడును. కాని పాశ్చాత్య వైజ్ఞానిక దృష్టి ఆ పండు ఎందువలన తియ్యగా నున్నదో తెలిసికొనలేక తికమకపడి పరిశోధనల నుపక్రమించును. ఇంద్రియ ప్రధాన జ్ఞానదృష్టికి ప్రతిదియు సందేహాస్పదమే. ప్రతిదానిని పరిశోధింపవలసిన అవసర మేర్పడును. కనుక ప్రతివిషయమును గూర్చి వారికి గలది యల్పజ్ఞాన మగును. ఈ నవల యందలి శాస్త్రజ్ఞులీతత్వమునకు ప్రతినిధులు. అశ్వముఖుడైన భారతీయుడు (హాహూ) వారి సముఖమున దేవభాషలో దివ్యముగా మాట్లాడుచు, పవిత్రమైన యాచరణ కనబరచు చుండగా నతనిది గుర్రము తలయని జంతుకోటిలో జమకట్టెదరు. మానవునిగా పరిగణింప లేకపోయెదరు. వారి యల్పజ్ఞతకు విస్తుపోవుచు 'హాహూ' అయితే మీకున్న ఆకారమే జ్ఞాన ముండవలసిన ఆకారమై, నాకున్నది కాకపోవుట ఎట్లు? నాకీ ఆకార మున్నది. నాకీ జ్ఞాన మున్నది. పూర్వం నీకుగల అనుభవం ప్రకారం ఈ రెంటియందు పొందిక లేదు. ఇప్పుడు నాయందు ఆ పొందిక కనబడుతూంది. ఎందు కొప్పుకోవు? నేనే పశువు నగుటఏమి? సర్వ జంతు లోకము పశుమయమే' యని నుడువును. శాస్త్రజ్ఞులీ మాటలకు సమాధానము చెప్పలేక 'నీవు మా దేశానికి వచ్చావు కాబట్టి మా యిష్టం వచ్చినట్లు నడవాలి' యని హింసించు పద్ధతికి దిగెదరు. అతనిపై తుపాకీ కాల్పులు జరపించెదరు. అయినను హాహూ తన యోగ బలముతో తుపాకీ గుళ్ళ యొక్క ప్రభావమును నిరోధింప గలుగును. అతనిని వారేమియు చేయలేరు.

భారతీయ ఆర్ష దర్శనము జ్ఞానమును మోక్షమునకు సాధనముగా మాత్రమే స్వీకరించును. వీరికి దివ్యత్వము, మోక్షము అను గమ్య మున్నది. అట్టి జ్ఞానము వీరి దృష్టిలో ఇంద్రియాత్మకము కాదు. ఇంద్రియాతీతమైన ఆత్మాశ్రితము. ఇంద్రియములతో బాహ్యజగత్తును శోధించుట కాక చిత్తవృత్తుల నదుపులో పెట్టి యేకాగ్ర మనోదృష్టితో అంతరజగత్తును శోధించుటలో వీరికి విశ్వాసము గలదు. చిత్తవృత్తి నిరోధము వలన యమదమాది ప్రాణాయామ యోగప్రక్రియలతో మహత్తరమైన జ్ఞానమును జాగృతము చేసికొనగలిగెదరు. యమము, సంయమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధి - యీ అష్టప్రక్రియలతోను, ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి-యీ అయిదు చిత్తవృత్తులను నిరోధించుటతోను యోగి యిష్టసిద్ధిని పొందగలడని భారతీయుల యోగదర్శనము అనాదిగా చెప్పుచున్నది. అది మహర్షుల యనుభవము.

ఈ సనాతన తాత్విక జీవనదృక్పథము ఆర్ష ప్రజ్ఞకు పరాకాష్ఠ. హిందూ సంస్కృతికి వెన్నెముక, జీవగర్ర. ఈ నవలలో జంతుమానవ రూపమున నున్న గంధర్వుడు యోగమును అభ్యసించి సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధిస్థితినికూడ సంపాదించినాడు. ఈ కారణముచేతనే యతని శరీరము లోనికి శాస్త్రజ్ఞులు 'క్లోరోఫారము'ను ప్రవేశపెట్ట లేకపోయినారు. వారి తుపాకీకాల్పులుకూడ అతని శరీరమునకు హాని కలిగింపలేకపోయినవి. అతను పాశ్చాత్యుల జ్ఞానదృష్టిని, పరిశోధన పేరుతో వారవలంబించుచున్న పద్ధతులను గర్హించును. సంస్కృత పండితుడు పాశ్చాత్యుల శాస్త్రీయ జ్ఞానదృష్టిని పరిచయము చేసినప్పుడు హాహూ 'శాస్త్రపరిజ్ఞానం కలిగిన తరువాత బుద్ధి పరిపక్వమైతే ఆశ్చర్యకరమైన విషయం అంటూ ఏమీ ఉండనక్కరలేదు. శారీరకంగా పరిశీలించి యెంతజ్ఞాన మని నేర్చుకుంటారు? ఏకాగ్రమనస్కులై భావిస్తే దాని విషయం తెస్తుందిగదా? ఈమాత్రంకోసం పరిశోధన అనీ, కోసి చూపిస్తామనీ అంటారెందుకు?' అని ప్రశ్నించును. ఈ ధోరణి భారతీయుల యోగపరమైన ఆత్మాశ్రిత జ్ఞాన స్వరూపమును నిరూపించును. యోగశక్తితో తన శరీరమును నీరోగము చేసికొనగలిగిన హాహూకు శాస్త్రజ్ఞుల మని చెప్పుకొను పాశ్చాత్యులు వివిధ వ్యాధులకు గురియై చనిపోవుట ఆశ్చర్యము కలిగించును. అతడు ఆ శాస్త్రజ్ఞుల నడుగును 'పండితులు నాతో చెప్పే విషయాలను బట్టిచూస్తే మీ దేశంలో అజ్ఞానం ఎక్కువగా వున్నట్లుందే! జనం అధికంగా చస్తూంటారట! కొన్ని వ్యాధులకు ఔషధాలే లేవట. వంద యేండ్లు కూడా సరిగా బ్రతకరట. తపస్సు ఎవరూ చేయరట. జ్ఞానం తపస్సు

వల్ల వస్తుందిగాని జంతు శరీరాలను కోస్తే వస్తుందా?'

మానవుడు సహజముగా భోగాకాంక్షి. ఈ భౌతిక ప్రపంచమున తన్నుగ్రగామిగా భావించుకొను మానవుడు మరీ భోగలాలసుడు. అందుచేతనే తనకు సుఖ సాధనములను సమకూర్చగల భౌతికవిజ్ఞానమునకు దాసుడైనాడు. దీనికి నేటి భారతీయులు కూడ నేమాత్రము తీసిపోరు. ప్రపంచమానవులందరు వైజ్ఞానిక సభ్యత ననుసరించుచున్నారు గదా! ఇంతమాత్రముచేత ప్రయోగాత్మక వైజ్ఞానిక ప్రక్రియకు ప్రవర్తకులైన పాశ్చాత్యులు తమ సిద్ధాంతములను, తమ సమ్మకములను, అనితరగములని భావింపరాదు. తమకు తెలిసినదే జ్ఞానమని భావించుచు తమకు తెలియనిది అజ్ఞానము క్రింద జమ కట్టరాదు. అటుల భావించుట వారి అల్పజ్ఞతకు నిదర్శనమని రచయిత నుడువుచు, ఇట్టి అల్పజ్ఞత వాంఛనీయముకాదని చెప్పుటయే యీ చిరునవల ఉద్దేశము.

ఇంతకును 'హాహాహూహూ' నవల చమత్కారముకొరకు వ్రాసినది కనుక కాలక్షేపము కొరకు చదువు వారికి వినోదాత్మకముగానే యుండును. సాహిత్యమును హేతువాద దృష్టితో అధ్యయనము చేయువారు మాత్రము కథానాయకుడుగా ప్రవేశపెట్టబడిన హాహాహూహూ స్వరూప స్వభావములను గాని, సిద్ధాంతములను గాని ఉనికిని గాని నమ్మలేరు.

సాహిత్యమును కావ్యగత సత్యము (Poetic truth) తో పరిశీలింపవలయునుగదా!



# గ్రంథ సమాలోచన

## ద్రాక్ష గుత్తులు

[బాలసాహిత్యం - గేయాలు]

[రచయిత: శ్రీ అలుగుపల్లి రామచంద్రారెడ్డి గారు. ప్రచురణ యువ రచయితల సమితి, నల్లగొండ. వెల రు3=50]

'ద్రాక్షగుత్తులు' నిజంగా ఆంధ్రబాలబాలికల కొక తీయటి విందు. ద్రాక్షగుత్తులు సులభమైన భాషలో, చక్కని భావనతో, మిక్కిలి రమ్యమైన రీతిలో రచించబడింది.

'ద్రాక్షగుత్తులు' ఆంధ్రసాహితీ నందన వనంలో పదికాలాలపాటు నిలువ గల్గిన రచన. నిజంగా పిల్లలకోసమే వ్రాసిన [చేసిన] రచన. పిల్లలకోసం, వారి కర్థమయ్యేశీర్షికలతో, చిన్నచిన్న పదాలతో చక్కగా మలిచారు. చిత్రాల్ని భావస్ఫోరకంగా, రసప్లావితంగా, [గ్రేసీ] రామమూర్తి గారు చిత్రించి పుస్తకాని కొక వన్నె తెచ్చారు.

పీఠికలు సంతరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఇల్లిందల సరస్వతీదేవి గార్లు నిష్పాక్షికంగా, తమ అభిప్రాయాన్ని తెలియచేసారు.

పుస్తకం ఆద్యంతం చాలా రసవత్తరంగా, లసత్తరంగా, ఉంది. మల్లెలాగ తెల్లగా, వెన్నెలలాగ చల్లగా, భావాలు జల్లగా అవితియ్యనివై 'ద్రాక్షగుత్తులై' నిలిచిపోయాయి.

కొన్ని శీర్షికలను ఆలోకనచేద్దాము.

'ఉత్తరం' రసవత్తరం. పదమార్దవానికి, మాధుర్యానికి ప్రతీక ఇది.

'మాద్రామా!' అనే శీర్షికలో చూపించిన రచనా వైదుష్యం, వైదగ్ధ్యం ప్రశంసనీయం సంక్షిప్తతకూ, సందర్భానకు ఇదొక పతాక.

'అచ్చులపాట' మెచ్చుకోతగినది. అదొక మచ్చుతునక. బాలసాహితి కొక కానుక.

'మనం' ఇది సమతాన్విత కవిత.

'కాకిఉపాయం' ఇతివృత్తం పాతదే అయినా, అభివ్యక్తీకరించిన తీరు అభినందనీయం. కాకి ఉపాయం పాతమూసలో కొత్తభాష.

'రంగులు' ఈ శీర్షికలో ఇంకా కొన్ని రంగులు తెలియచేస్తే బాగుండును.

'మేలుమేలు' శీర్షిక పాతదే అయినా తనసొంత శైలిలో రసవంతంగా చెప్పారు. అయితే ఈ శీర్షికలో ఒకచోట 'శ్లేష' నుపయోగించారు.

'చెలిమికోసం చీమ ఎక్కింది చెట్టు
గాలి ఊపుకు జారిపడ్డది చెరువులో
పిట్టగుండె కరగి అయ్యింది చెరువు
చేసేది ఏమిటో తోచలే పిట్టకి'

పైవాక్యాల్లో 'చెరువు' పదం రెండు సార్లు ఉపయోగించారు. పిల్లలకు ఇది కొంత, తికమక కల్గించక మానదు. 'శ్లేషను' విశ్లేషించుకొనే విశేషప్రతిభ వారి కుండదుకాబట్టి వారి కర్థమవదు.

ఆంధ్రసాహిత్య - అకాడమీ ఆర్థిక సహాయంతో ముద్రితమైన ఈ పుస్తకం

[బాలసాహిత్యం] పిల్లలకొక కానుక. ఈకృషి చేసినరచయితకుఅభినందనములు. బాలబాలికల కుద్దిష్టమైన ఈ పుస్తకం వెల మాత్రం అధికం అనక తప్పదు.

శ్రీ రెడ్డిగారి కలంనుంచి మరిన్ని మంచి కవితా సంపుటాలు వెలువడాలని ఆకాంక్షింప వచ్చును.

- రత్నశ్రీ

—...—

## గాయత్రీ జపసంపత్తి:

[ప్రకాశకులు. శ్రీ అనుర్తి వెంకట సీతారామ చంద్రరావు గారు. వరహా పురం. వెల 2-00]

ఇందుగాయత్రీ మహిమను వివరించు పది ఖండములు కలవు. వీనియందు గాయత్రీ ప్రశస్తి విపులముగా వేదాది ప్రమాణములతో వివరింప బడినది. సంధ్యాకాలోపాసనపై పలు విధము లగు ప్రమాణములు వివరణలు దీనివలన గ్రహింపవచ్చును. చివర గాయత్రీజప విశేషములు వివరింపబడినవి. ఇట్టి గ్రంథ మాస్తికుల సహాయమున ముద్రితమైనది. గాయత్రిని, దాని మహత్తును, అందలి ప్రమాణములను నెరుగగోరినవారికీ గ్రంథము చక్కగా నుపయోగపడును. ఇట్లు సంకలనము చేసిన వారు శ్రీ తోలేటి వెంకటరత్నం గారు. ఈ వివరణమున సంకలన వ్యాఖ్యాతల యాస్తిక బుద్ధి, పాండిత్యము వ్యక్తములగును. ఇందలి భాష సరళము. కాని విషయము గంభీరము. ఖండములవారిగా వివరణను మరింతగా నిచ్చినచో చాల బాగుండెడిది. ఆస్తికులగు వారు తప్పక చదువవలసిన మంచిగ్రంథ మిది.

- శ్రీ గౌతమ

—...—

# శ్రీనాథుని భాష - పదకల్పములు

- శ్రీ డాక్టరు నేతి అనంతరామశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

1-1-0 పదములకు గాని పదబంధము లకుగాని పరమందు చేర్చబడు ప్రత్యయ రహిత శబ్దముల జాతిని పదకల్పము లందురు. ఒకటిరెండక్షరముల ప్రమాణము కలిగి పదములతో పదబంధములతో, ఉప వాక్యములతో నిర్మాణాత్మక సంబంధము కలిగి కారకసాధకములైన శబ్దములజాతిని పదకల్పములని యందురు 2 వీనిని అపద ములనియు వ్యవహరింతురు. ఇవి ధ్వన్యాత్మకములుగా అతి స్వతంత్రము లేదైనను వానికి పదస్థితి కలదు. కేవలము నిర్దిష్టము లైన ప్రాతిపదికముల వర్గములకు మాత్రమే నియతములై యుండునట్టి ఉత్పాదక పదాంశములకు గాని, నిష్పాద పదాంశములకు గాని, ఇట్టి పదస్థితి లేదు. ఇవి అనేక విధములైన భావభంగులను సూచించును. ఇవి వేరువేరు భావభంగులను సూచించు నపుడు పదములకు పరమందు చేరును. ఇవి ప్రత్యయములు కావు. పదతుల్యప్రత్యయములు. ప్రత్యయములు సాధారణముగా నిర్దిష్టములైన ప్రాతిపదికల మీదనే చేర వలసి యుండును. ఇవి ఆ విషయమున స్వచ్ఛందములై యుండును. వీనికి విస్తృతమైన అవకాశము కలదు. కాని స్వతంత్ర ప్రయోగార్హత లేదు.

1-2-0 భిన్నపదములకు నీపద కల్పములు చేరుటచే కలుగు విశేషార్థముల ననుసరించి వీనిని ఈక్రింది విధముగ విభజింప వచ్చును.

1. ఏవార్థకము [Emphatic Particle]

2. ప్రశ్నార్థకము [Interrogative particle]

3. సందేహార్థకము (Expressive of doubt or surprise.)

4. సముచ్చయార్థకము (Conjunctive particle)

5. కిలార్థకము (Assertive Particle)

6. కొన్ని అవ్యయములు (Indecti-vebles)

ఈక్రింద చూపబడిన పదకల్పములు శ్రీనాథునికావ్య భాషలో భిన్నార్థములలో ప్రయోగింపబడినవి.

1-3-0 ఏవార్థకము: (Emphatic particle)

11-12 శతాబ్దులలో ఏవార్థక పద కల్పము 'అ.' నన్నయలో ఇదియే ఉన్నది. నన్నెచోడునిలో 'అ'తోపాటు కొన్ని ప్రయోగములలో 'ఏ' అనుపద కల్పముకూడ కనబడు చున్నది. సమకాలపు శాసనములలో అ ఏలు ప్రక్క ప్రక్కన వాడిబడి ఉండుటను బట్టి ఈ రెండు పదకల్పములు ఆనాడు వ్యవహారములో నున్నవని తెలియును. క్రమముగా నాధునిక భాషలో 'ఏ' కారము నకు వ్యాప్తిహెచ్చి 'అ' కారము లోపించినది.

శ్రీనాథునిలో -అ. -ఎ/-ఏ అను పదకల్పము లంతమునచేరి ఏవార్థకము లగుచున్నవి.

1-3-1 -అ: నామములకు, సర్వనామములకు, పదబంధములకు, అవ్యయములకు, క్రియా పదములకు చివర-అ చేరును.

'హింసయ' నీకువేడ్క యగునేని (శృ.నై 1-107)

'నీవ' ప్రమాణంబు (కాశీ 2-98)

'నీక' యొప్పు (భీమ 4-76)

యుద్ధము సేయఁ 'జాలకయ' (శివ 4-62)
కృష్ణద్వైపాయను తోడి 'ద' లోకము (భీమ 4-14)
'ఇదియ' నాకు వరం బనివ (కాశీ 4-142)
అనంతరంబ (హర 2-107)
తనుంగనిన నీశ్వరుండంచు (భీమ 5-45)
కాంబరి 'ధరించియ' (శృ.నై 3.118)
అట్లు 'పలికెం చెన' యేని నిలువేద (శృ.నై 4-75)

1-3-2 -ఎ/-ఏ: నామములకు, సర్వ 'నామములకు, అవ్యయములకు,' 'క్రియా పదములకు చివర చేరును.'

-ఎ: ఏము సేర'మె' వచింప (శృ.నై 4-59)
శక్యం 'బె' (భీమ 1-93)
'వీరె' సఖులు వచ్చుచున్నవారు (శృ.నై 2-98)
ఖలుఁడు 'వీఁడె' (శృ.నై 2-122)
ఇ'దె' (శృ.నై 4-82)
సొగడఁదర'మె' (హర 5-20)
ఆరగించి'తె' (కాశీ 7-190)
వచ్చునె వానిఁ గానఁగాన్ (శృ.నై 3-23)

-ఏ: తగ'నే' కులకన్యలకును (శృ.నై 4-61)
బ్రహ్మకు వశ'మే' (భీమ 3-30)
ఇతఁ'డే' (శృ.నై 3-42)
అ'ట్టే' కాక విభూతియందు కాని (హర 2-3)
రక్షింపఁ 'దే' (కాశీ 4-40)
నాకెఱింగింప 'వే' (భీమ 4-47)

1-4-0 'ప్రశ్నార్థకము: (Interrogative particle)

నన్నయ భాషలో ప్రశ్నార్థమున -ఎ/-ఏ అనుపదకల్పములును, నన్నెచోడుని లో నీపద కల్పములకు తోడు - అయ్య అను పూజార్థకాను బంధమును చేరుచున్నవి. 13వ శతాబ్ది నుండి ప్రశ్నార్థమున-ఎ/-ఏ అనుపద కల్పమునకు తోడు, -అ అనుపద కల్పమును వాడుక లోనికి వచ్చినది. క్రమముగా నిది వ్యాప్తిచెంది 'ఎ' లోపించినది. నన్నయ, నన్నెచోడులలో -ఎ అను పదకల్పము, తిక్కన, శ్రీనాథులలో - ఎ/- ఏలతో పాటు - అ కూడవాడ బడినది.

1-4-1 '-ఎ/-ఏ,-అ అనుపద కల్పములు నామవాచకములకు' 'క్రియలకు చేరును.' స్వరభేదముచేత ప్రశ్నించిన విషయము యొక్క వ్యతిరేక నిశ్చయమును కాకువర్థమును తెలుపును.

-ఎ. చేలనె? ననున్ శక్యంబె పట్టంగ (శృ.నై 2-47)
ఇవ్విధంబున్న లోకంబులెల్ల నగరె? (హర 4-28)
ఇవికి రావించిద గక్క గలదె? (శృ.నై 4-85)
కానని తీర్థముల్ గలవె? (భీమ 3-13)
కంటికి నిద్రవచ్చునె? (కాశీ 1-108)
-ఏ: మీతంద్రియే? (హర 3 74)
వార్చి'నే'? సంధ్య (కాశీ 4-86)
అతిక్రమింపవచ్చునే? (శృ.నై 8-90)
అన్యాయము సేయు'నే'? (శివ 3-91)
-అ: అతని కెయ్యది తెప్పచెప్ప 'మా' (శృ.నై 2-59)
తెప్పలా? పూవుఁబోఁడి (కాశీ 2-71)

1-5-0 సందేహార్థకము: '(Expressive of doubt or surprise)'

1-5-1 'నామములకు, క్రియలకు -ఒ1- ఓ అనుపదకల్పములు చేరగా సందేహార్థకము లేర్పడుచున్నవి.

-ఒ: వెలుఁడ 'వొ', యెలదిలుకూర్మి యాత్మజుఁడ'వొ' పంచబాణుండవో, దేవపతి సుతుఁడ'వొ'
నిజము దప్పక చెప్పుము నిషధపతి'వొ' (శృ.నై 4-8)
ఎల్లన్ శిష్యులఁగొంచు వత్తు'నొ' (భీమ 2-120)
అప్పగించి'రొ' లేదొ యధిపుఁగూర్చి (కాశీ 2-86)
నిజ'మొ' కల్ల 'యొ' కాని (హర 2-97)
-ఓ: చంద్రుఁ'డో'! యుపేంద్రుం'డో'! కంతుం'డో'! జయంతుం'డో'! యని (శృ.నై (4-2)
అదిదాక్షారామ మహిమ మగు 'నో' కా'దో' (భీమ 1-113)
శూద్రుఁ'డో'? బ్రాహ్మణుండో (కాశీ 7-49)
ఎఱుఁగుదో? యెఱుఁగ'వో' (కాశీ 7-59)

1-5-2 -ఒకొ /- ఒకో,- ఒక్కొ/1 ఒకో,-- అనుపదకల్పములు 'నామములకు, క్రియలకు చేరుటచే సందేహార్థక, ప్రశ్నార్థక, ఆశ్చర్యార్థక, సంభావనార్థకము లగును.

'-ఒకొ:'
సందేహార్థకము: హరిహరయుఁ దేమియయ్యె 'నొకొ' (శృ.నై 4-65)
ప్రశ్నార్థకము: ఎవ్వరొ'కొ'? వీరు (కాశీ 3-168)
ఎక్కడఁబోయె 'నొకొ'? (కాశీ 5-280)
సంభావన: ఎంతభాగ్య'మొకొ' (హర 2-88)

'-ఒకో':
సందేహార్థకము: మానవేంద్రుం డిద్దం 'డొకో' యని (శృ.నై 3-20)
ఇదియేమి ఘోషం'బొకో' యని (శృ.నై 3-50)
ప్రశ్నార్థకము: వేటోకండొకనితోఁ గలహింప సహించి తెట్లొకో? (శృ.నై 8-183)

అద్దాం'డొకో'కియయ్య (కాశీ 7-74)

ఆశ్చర్యార్థకము: శిరములకు విరులు కల్పించు'నొకో' (భీమ 2-8)

సంభావన: ఏమని తలంతు'నొకో' (శృ.నై 4-93)

'-ఒకొ:'

సందేహార్థకము: ఎటుసేసె 'నొకొ' తానతపంబు (కాశీ 4-148)

ఎవ్వ'రొకొ' వీరు (కాశీ 3-138)

ప్రశ్నార్థకము: నిషధనాథు నికెవ్వతె 'యొకొ' భార్య (శృ.నై 2-58)

వరుడెవ్వడ 'డొకొ'? యాతలిరుచ బోడికి (కాశీ 5-338)

సంభావన: ఎవ్వతె 'యొకొ' యూయింద బింబావన (కాశీ 4-149)

ఫలమేమి 'యొక్కొ' యాపటు సాహసమునకు (శృ.నై 4-8)

'-ఒకో:'

ప్రశ్నార్థకము: నిర్వ్యథనకలన మది యొట్టొకో?' (శృ.నై 3-287)

సంభావన: ప్రకృతి విరోధంబే వెంట కలిగె'నొకొ' (శృ.నై 8-196)

1-6-0 'సముచ్చయార్థకము:(Conjunctive particle)

నన్నయలో-ఉన్ సముచ్చయార్థక పదకల్పము. -ను,ని వాని రూపాంతరములు. సముచ్చయ నకారములోపించి పూర్వస్వరమునకు దీర్ఘము వచ్చుట శాసనములలో 11వ శతాబ్ది నుండి, కావ్య భాషలో 13వ శతాబ్దినుండి కనబడుచున్నది.3

తిక్కనలో: నమ్మీనమ్మని (శాంతి2-351)

శ్రీనాథుని చాటువులో | చల్లాయంబలి ద్రావితిన్.

1-6-1 శ్రీనాథుని భాషలోని సముచ్చయార్థకము లీక్రింది విధముగ నున్నవి.

1. అదిదంత నామములకు, క్రియలకు- ఉన్,- ఉను -ఉనున్ అనియు, ఉదంత నామములకు-న్,-నున్ అనియు సముచ్చయ పదకల్పములు చేరును.

-ఉన్: నీడయున్ (కాశీ 3-246)
సమ్మృద్ధియున్ (హర 2-142)
కలజముఖియున్ (శివ 2-94)
-ఉను: వినియును (కాశీ 2-113)
ఉనున్: అదియునునొక (హర2-67)
అంగనయునున్ (శివ 2-94)
ముగ్ధియయునున్ (శివ 2-91)
విద్రుమాధరయునున్ (శివ 2-94)
-ను: సిరియాలుండును (హర 2-20)
మగడును (గాశీ 6-28)
-న్: మాసంబులున్ (హర )
-నున్: కన్నునున్ (శివ 2-30)
వినినున్ (హర 2-141)
హుతవహుండునున్ (శృ.నై 5-173)

2- ఉన్: అనుసముచ్చయము ఈక్రింది రూపములలో అత్యంతారము (emphasis) నందు ప్రయోగింప బడినది.

నానేర్పొప్పగా నెం'తయున్' నీకై పూజయొనర్తు. (హర 7-96)

ఇన్ని'యున'ట్లుండ నిమ్ము (కాశీ 6-89)

3.- ఉన్ అను సముచ్చయము 'ఏని' అనుపదకల్పముతో కలిసి చేదర్థకమున ప్రయోగింప బడినది.

తన్నును దియ్యదనంబు
వాసనా యోగముగల్గెనేనియు
(కూడ అనునర్థము) (శృ.నై 2-82)

ఇంచుకేనియుం దాల్మిలేక- (కాశీ 7-131)

ఎబ్బంగి ప్రాణముపేక్షింతేనియు
- వెతస్వగుణికబ్బ (శృ.నై 4-75)

వాంఛితంబు (అయినప్పటికీ)
ఎక్కడకేని యున్ (కాశీ 6-92)

4. -ఉన్ అనుసముచ్చయము ఈక్రింది రూపములలో అప్యర్థము నందు ప్రయోగింప బడినది.

భూమి పాలకునిచే నాశ్లిష్టమయ్యెన్శ దిన్. (శృ.నై 3-114)

వైదర్భి కాముకుండకాన్యను నయ్యాది గర్భేశ్వరుండు (శృ.నై 3-73)

5-ఉన్ అను సముచ్చయమునకు అయ్యు (అయి: అసమాప్యర్థకము) చేత' అయినప్ప'టికి' అనునర్థము నిచ్చును.

పిరరస గర్భితరిబయ్యు విస్తరిల్లె (హర 7.10)

6.- ఉన్ అనుసముచ్చయార్థకము నందలి- ఉన్ అనుపదకల్పము మీద తిరిగి- ఉన్ అనునది ఆగమముగుచున్నది.

అదియునుంగాక (హర 7.61)

అనుకరించునదియునుంబోలె (శృ.నై 2-46)

(సశేషము)

---

1. "Clitics are a class of uninflected words which are suffixed to words or phrases" -- William Bright: An out line of Colloquial Kannada, P. 45.

2. Bh. Krishna murthi - Kouda or Kubia Dravidian Language. P. 327.

3. క. మహాదేవశాస్త్రి: 'కావ్యభాషా పరిణామము' - తెలుగుభాషా చరిత్ర, 1974, పుట-231.

## Statement about ownership and other particulars about 'Samalochana' National & Cultural Fortnightly, Rajahmundry.

### Form IV

( See Rule 8 )

| | | |
|---|---|---|
| 1. | Place of pubication | : Rajahmundry |
| 2. | Periodicity of publication | : Every I st and 16 th |
| 3. | Printer's Name<br>(Whether citizen of India ?)<br>(if foreigner state the country of origin) | : Sri B. Sitharama Sastry<br>: Indian |
| | Address | : 6-8-7 Innespeta<br>Rajahmundry -1 |
| 4. | Publisher<br>Whether citizen of India?<br>(if foreigner state the country of origin) | : Sri B. Sitharama Sastry<br>: Indian |
| | Address | : 6-8 7 Innespeta<br>: Rajahmundy-1 |
| 5. | Editor's Name<br>(Whether citizen of India ?)<br>(if foreigner state the country or origin) | : Sri B. Sitharama Sastry<br>: Indian |
| | Address | : 6-8-7, Innispeta,<br>: Rajahmundry-1. |
| 6. | Name and address of individuals who own the news paper and partners or shareholders holding more than one percent of the total capital. | : Sri B. Sitharama Sastry<br>6-8-7, Innespeta,<br>Rajahmundry-1. |

I, B. Sitharama Sastry, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date 1-3-1980. (Sd ) B. Sitharama Sasrry, Publisher.

# ఈ పక్షంలో

ఫిబ్రవరి నెల 24, 25 తేదీలలో రాజమండ్రి యంగ్ మెన్సు వైశ్యాఅసోసియేషన్ అండ్ వైశ్యాలేడీ అసోసియేషను వారి యాజమాన్యమున సదరు అసోసియేషను హాలులో సాహితీ వసంతోత్సవాలు జరిగినవి. మొదటి రోజున ఆమ్రపాలికావ్యా విష్కరణ సభ జరిగినది.

కులపతి శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు అధ్యక్షత వహించారు. 23వ తేదీ సాయంత్రం గం 6 లకు ఆరంభం కావలసిన సభ 8 గం॥ లకు ఆరంభమైనది. ఆనాటి వక్తలు అధ్యక్షులు కృతికర్త కృతిభర్త మున్నగు వారు వేదికపై ఆసీనులై యుండగా పండితులు వేదికపై నిలిచియుండి స్వస్తి వాచనము గావించిరి. అనంతర మధ్యక్షుల ఆదేశముపై వేదికమీద ఆసీను అయిన వారు, సభాసదులు లేచి జాతీయ గీతముతో పాటు 'మా తెలుగు తల్లికి మల్లె పూదండ' పూర్తి అయ్యేవరకు నిలబడి యుండి ఔచిత్యమును ప్రదర్శించిరి. వేద మంత్రముల స్వస్తివాచనమునకు, తెలుగు పాటలకు, గల అంతర మదొక విచిత్ర రీతిగా భాసించినది.

విద్వత్కవి శ్రీ మధునాపంతుల సభా ప్రారంభము గావించిరి. కవిని, కావ్యాన్ని, కృతిభర్తను, పరిచయం చేసిరి. దండ - ధారణం గురించి చమత్కరించారు. నిర్ణీతసమయంలో సభ ఆరంభం కానందున కావ్యావిష్కరణము చేయ

వెలసిన శ్రీశ్రీశ్రీ అప్పణ యతీంద్రు లంగీకరించక పోవడంవల్ల మధునాపంతుల వారే కావ్యాన్ని ఆవిష్కరించారు.

అధ్యక్షులవారు చమత్కారప్రసంగం చేస్తూ దండలధారణం ప్రాచ్య శుభ సంప్రదాయ మనీ, చివరిదాకా దండలుంచు కోలేని వారు, వేదికమీదికిరాకూడ దనీ, అట్టివారు అప్రాచ్యులనీ సగం ప్రాచ్య పద్ధతీ సగం అప్రాచ్య పద్ధతీ అవలంబించడం (కొంతసేపు దండ ఉంచుకుని తర్వాత తీసివేయడం అయియుండాలి) మరీ దోష మనీ వక్కాణించిరి. పాదరక్షలతో వేదికపైకి రావడం తప్పు అని కూడా సెలవిచ్చిరి. కృతికర్తను, కృతిని, కృతిపతిని, ప్రశంసించిరి. ఫామిలీ ప్లానింగు లేదు కనుక కృతికన్యల సొం దతి సైనా శ్రీ కరుటూరి సత్యనారాయణ గారు కనాలని ఆకాంక్షించిరి. సాధారణంగా సభాధ్యక్షులంతా దీర్ఘరోగిలా చాలాకాలం తీసికొంటా రనీ తామట్లు కాక త్వరలో ముగించ దలచి నట్లు చెప్పిరి.

ఇతర - అధ్యక్షులు - దీర్ఘరోగులు, ఫామిలీప్లానింగు లేకపోవడం, కొందరు అప్రాచ్యులు, వంటి పదాల ప్రయోగం కులపతిస్థాయి గౌరవాస్పదుల ఉదాత్తతకు తగియుండలేదని కొంద రను కొన్నారు.

ఆమ్రపాలి కృతికర్త శ్రీ కరుటూరి సత్యనారాయణగారు తనకృతిని గురించి ఔచిత్యం తప్పకుండా కొలది మాటలు పలికి కృతిపతి నుద్దేశించిన పద్యములు చదివిరి.

వదాన్య శేఖరులు శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యము దంపతులు మంత్రోక్తముగా గ్రంథప్రతులకు సరస్వతీ దేవీ పూజ కావించి సాలంకృతముగా సవస్త్రకముగా కృతి కన్యాప్రదానము గావించిరి. కన్యాదానమునకు పూర్వము గౌరీపూజ యుచితమే కాని కన్యనే దేవిగా పూజించుట దానినే (కృతి) భర్తకు దానము కావించుట యను కల్పము చిత్రముగా భాసించినది.

శ్రీ వడలి మందేశ్వర రావు గారు కృతికర్తతో దమకు గల అనుబంధమును వివరించిరి. కావ్యరచనను ప్రశంసించిరి. ఆమ్రపాలి 'గణిక' కనుక కృతిభర్త జాగరూకత వహింపవలయు నని హెచ్చరించుట సరసముగనే అనిపించ వచ్చును గాని తజ్జనకన కాధ్వని యెంతవరకు రుచించునన్నది ఆలోచనీయాంశము.

పి. ఆర్. గవర్నమెంటు కాలేజి సంస్కృతోపన్యాసకులు శ్రీ పేరాల భరత శర్మగారు కె. వి. కె. సంస్కృత కళాశాల సంస్కృతోపన్యాసకులు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులుగారు త్రివేణిసంపాదకులు భావరాజు నరసింహారావుగారు ప్రసంగించిరి.

24-2-80 ఉదయం రామాయణ కల్పవృక్ష జయంతిసభ జరిగినది. కేంద్రీయ విద్యాలయము ప్రిన్సిపాలు హైదరాబాదు శ్రీ వడలి మందేశ్వరరావుగారు, శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులవారు శ్రీమద్రామాయణ కల్పవృక్షవిశేషములు వివరించిరి.

సాయంకాలం 6 గంటలకు జరిగిన సభలో శ్రీ పేరాల భరతశర్మగారు రామాయణ కల్పవృక్షములోని తెనుగుదనమును ఔచిత్య అర్థవిశేషములను విశదీకరించిరి. శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ శర్మగారు రామాయణ కల్పవృక్ష కావ్య పఠనము గావించిరి.

25-2-80 తేదీ సాయంకాలం జరగవలసిన సభ శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కవివర్యుల స్మారకసభగా మారినది. ఆచార్య దామెర్ల వెంకటరావుగారి అధ్యక్షతన సాహిత్యాభిమానులనేకులు కృష్ణశాస్త్రి కవితా విశేషములను జీవిత విశేషములను ప్రశంసించిరి.

దండల పురాణ మాద్యంత మీ సభలలో చర్చనీయాంశమగుట ఒకవిశేషము. వివాదాస్పదమగు టంతకంటెను విశేషము.

ఆమ్రపాలి బౌద్ధమత ప్రతిపాదకమైన ఆధునిక కావ్యము. పరమశైవాగ్రేసరుల కది యంకితమగుట విచిత్ర సన్నివేశము. కవులు పండితులు తమ రచనల నధికారులకు ప్రభువులకు అంకిత మొసరించుట పరిపాటి. ఒక అధికారి సత్కవియై కవిపండితులకు తన కావ్యము నంకిత మొసగుటయు విచిత్రవర్ణనీయ సన్నివేశము.

కొలది సంవత్సరములక్రిందట శ్రీజ్ఞానానంద కవి రచిత 'ఆమ్రపాలి' ఆవిష్కృతము కాగా నేడు రిటైర్డు సి.టి.ఓ. గారి ఆమ్రపాలి ఆవిష్కృతమైనది. రచనాభేదము రుచిభేదము సహృదయులకానందదాయకమే యగునుగదా. *

## అమ్మ అనురాగం

- శ్రీ మల్లాది కామేశ్వరరావు.

నవమాసాలు మోసి
జీవిని భువిపై వేసి
మమతను మాలిక జేసి
పాప మెడలో వేసే...
అమ్మా! నీ అనురాగం తీయనిదమ్మా!

వెన్నెల పాటలు పాడి
చల్లని చంద్రుని పిలచి
పాపకు తోడుగ నిలిపి
ముద్దులబువ్వను పెట్టే
అమ్మా! నీ అనురాగం తీయనిదమ్మా!

ఆటల పాటలు నేర్పి
చదువుల తోటలు త్రిప్పి
కమ్మగ జోలను పాడి
పాపను నిద్దురబుచ్చే
అమ్మా! నీ అనురాగం తీయనిదమ్మా!

విశేష ప్రచారముగల

# సమాలోచన పక్షపత్రిక

సంవత్సర చందా రు. 10 - 00 లు మాత్రము.

సంచిక ఒకటికి ముద్రణవ్యయం రు. 1-00 అగుచున్నది. సాహిత్య ప్రచారమునకై తక్కువ చందా నిర్ణయింపబడినది.

---

## సమాలోచన

1, 2 సంపుటములు ఒక్కొక్కటి సుమారు 120 వివిధ జాతీయ సాంస్కృతిక విషయముల రచనలు గలిగి హాఫ్ క్యాలికో బైండు చేయబడినవి. పోస్టేజితోసహా ఒక్కొక్క సంపుటము వెల రు. 18-00 లు ఎం. ఓ. చేసినవారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

ప్రతులకు :—

ఎడిటర్, 'సమాలోచన'
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్)
రాజమండ్రి-1. 533101.

---

-*- ప్రకటన రేట్లు -*-

| | |
|---|---|
| కవరు 4 వ పూర్తి పేజీ | రు. 400 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 225 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 150 - 00 |
| లోపలి పూర్తి పేజీ | రు. 200 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 110 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 60 - 00 |

ప్రత్యేక కంట్రాక్టు రేట్లకు సంపాదకునిపేర వ్రాయవలయును.

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.**

# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 | రాజమహేంద్రవరము 16-3-1980 | సంచిక 10

—* ఈ సంచికలో *—



1—4—1980 సంచికలో నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ, నేటి కథానికా సాహిత్యపు తీరుతెన్నులు, ఆంధ్ర సాహిత్యంలో మిన్నంటిన కంకంటి, నాకు నచ్చిన కావ్యం ఖడ్గనారాయణం మొదలగునవి ఉంటాయి.

—• 1, 16 తేదీలలో ప్రచురింపబడును •—

చందా
సంవత్సరమునకు రు 10.00.
అర్ధసంవత్సరమునకు రు 5.50.

విడిప్రతి 50 పై.

★ సమాలోచన

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 8 రాజమహేంద్రవరము 16-8-1980 సంచిక 10

# ఆధునిక తెలుగు నవలా పరిణామం

— విద్వాన్ శ్రీ చక్రవర్తుల రామానుజాచార్యులు, ఎం. ఏ.

సుప్రసిద్ధ నవలాకారుడు, నవలా విమర్శకుడు, అయిన E. M. Forester తన 'Aspects of the Novel' గ్రంథంలో నవలను గూర్చి ఈవిధంగా చెప్పాడు. 'What does a novel do?' అని ప్రశ్న వేసికొని—

'Yes—oh clear yes · the novel tells a story. That is tı e fundamental aspect with out which it could not exist. That is the highest factor common to all novels, and I wish that it was not so, that it could be something different — melody, or perception of the truth, not this low atavistic form.' అని సమాధానం చెప్పాడు. నవల అంటే కేవలం కథ కాదని, అంతకంటే మహత్తరమైన సత్యాన్వేషణకి లోగివుండాలని అతని ఆశయం. సాహిత్యానికి పరమప్రయోజనం ఈ సత్యాన్వేషణమే. రచయిత సత్యాన్ని అన్వేషిస్తూ తనలో ఒకటిగా దాన్ని కలుపుకొంటాడు. 'రచయితకు సంబంధించిన ఆత్మకథని అతని సాహిత్య కృషి ప్రతిబింబిస్తుంది.' అనే మాటల్లోని అర్థం కూడ ఇదే.

వచన రచనా పరిణామంలో ముఖ్యమైన ఆధునిక తెలుగు సాహితీ ప్రక్రియల్లో నవలకు విశిష్ట స్థానం ఉంది. దీనికి కారణం పైచెప్పిన నిరంతర సత్యాన్వేషణమూ, మరియు రచయిత ఆత్మికభావ వ్యక్తీకరణమూ. కందుకూరి వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రను విమర్శిస్తూ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు నవల అనే పదాన్ని ప్రయోగించారు-ఇది తెలుగులో మొదటి ప్రయోగం. Lord David cecil 'a novel is work of art ın so far as it introuduces us into a living world in some respects resembling the world we live in but with an individuality of its own సజీవమైన జగత్తుతో పరిచయం చేసే కళాకృతి నవల' అని అతని అభిప్రాయం. Richard croses అనే నవలా విమర్శకుడు, యథార్థ జీవితాన్ని యథార్థ దృష్టితో అధ్యయనం చేసి గద్య రూపంలో వ్యక్తం చేసేదే నవల అని పేర్కొనెను.

'వ్యక్తి జీవితాలను ఆధారంగా తీసికొని సామాజిక జీవితాన్ని ప్రతిబింబింపచేసేది నవల' అని R.S. సుదర్శనం గారు తెలిపారు. ప్రజా బాహుళ్యంలో ప్రాచీన కావ్య పఠనంపై మోజు తగ్గి, క్రమక్రమంగా కథా పఠనంపై ఆసక్తి పెరుగుతున్నది. ఇది కాలంలో వచ్చిన మార్పు. ప్రపంచ సాహిత్యంలో కథలే విరివిగా ప్రచారంలోకి వచ్చాయి. రెండవ ప్రపంచ సంగ్రామం పాశ్చాత్య దేశాల్లో నూతన సాహిత్య సృష్టికి దోహదం చేస్తే, జాతీయోద్యమచైతన్య ప్రభావం తెలుగు సాహిత్య ప్రక్రియల్లో ఆధునికతకు కారణమైంది. స్వాతంత్ర్యానికి పూర్వం కంటే స్వాతంత్ర్యానంతరం కలిగిన నవలా వికాసానికి చాలా భేదం కన్పిస్తుంది. ప్రజా జీవితంలోను, వారి ఆలోచన లోను ఎంతోమార్పు వచ్చింది. 1947 తరువాత విద్యావిధానంలో కూడ మార్పు కలిగింది.

నవలా వికాసాన్ని స్థూలంగా నాలుగు దశలుగ విభజింప వచ్చును. 1878 ప్రాంతాలలో బ్రహ్మ సమాజోద్యమం, సంఘ సంస్కరణాభిలాష, తెలుగు నవల్లో కనిపిస్తుంది. 1920 ప్రాంతం నవల్లో జాతీయోద్యమం, సంస్కరణ

భావాలూ, దేశీయతా దృష్టి ఎక్కువగా వున్నాయి. 1939 నుండి 1946 వరకు అనగా స్వాతంత్ర్యం వచ్చేవరకు జాతీయోద్యమ భావాలు, దేశీయతా దృక్పథం, ఆర్థిక వత్తిడి, సమాజానికి వ్యక్తికి ఏర్పడే సంఘర్షణ, ఆనవలలో ప్రతిఫలించాయి. 1947 తరువాత స్త్రీ ప్రవృత్తిని గూర్చిన నవలలకే ప్రాచుర్యం కలిగింది.

వ్యక్తి సంఘంలో ఒక సభ్యుడు, వ్యక్తిపై సంఘ ప్రభావం ఎప్పుడూ వుంటుంది. దానివల్ల వ్యక్తి చైతన్యం కలుగుతుంది. ఈ చైతన్యం మానసిక పరమైంది. వ్యక్తిలో కలిగిన ఈ మానసిక చైతన్యం ఆవ్యక్తిచే సృష్టింపబడే సాహిత్యంలో తప్పక ప్రతిబింబిస్తుంది. ఏతన్మూలంగా సాహిత్య పరిణామం జరుగుతూ ఉంటుంది. ఇలా జరిగే సాహిత్య పరిణామంలో వాస్తవిక సామాజిక దృక్పథం చోటు చేసుకొంటుంది. ఈ సూత్రమ్మీద జరిగిన సాహిత్య సృష్టిలో నవల ప్రధానమైందిగా భావించవచ్చు.

నవలకు కథా సంవిధానం (Plot-making), పాత్రచిత్రణ (charecterization), ఉత్కంఠ (suspense) అనేవి ప్రధానాంగాలుగా వుండి రసస్ఫూర్తిని కలిగిస్తున్నాయి. చక్కని కథా సంవిధానం నవలకు సమగ్రమైన అస్థిపంజరం వంటిది. నవలకు ఉచితమైన ఇతివృత్తం ప్రధానంగా రెండురకాలు 1) సాంఘికము (Social) ii) చారిత్రికము. ఇతివృత్తం సాంఘికమైనపుడు సమకాలీనమైన అనేక (Historical) విషయాలను స్పృశిస్తుంది. నవలలో అనేక సంఘటనలను కూర్చే సంవిధానం ముఖ్యమైంది. అంటే అనేక చిన్నచిన్న సంఘటనలను తీసుకొని, సారస్యం చెడకుండ కథ అల్లుకు పోవడం, కళాత్మకంగా రచించిన నవలలకు గొప్పఆదరణ, గౌరవం, ప్రయోజనం, ఉంటుంది. అన్ని సంఘటనల్లోని ఔచిత్యానౌచిత్యాలను, ముందు వెనుకలను చర్చించి ఒక శిల్పంగా రూపొందించగలగటమే సంఘటనా శిల్పం. వ్యక్తుల జీవితాన్ని ప్రధానంగా తీసుకొని, సామాజిక జీవితాన్ని ప్రతిబింబింపచేసేసాహిత్యప్రక్రియ నవల. ఇలాంటి సాహిత్య సృష్టికి కారకుడైన రచయితకు కావలసిన అర్హతల్లో సామాజిక స్పృహ ముఖ్యమైనది. రచయిత ఎంత ఎక్కువగా సామాజిక దృక్పథాన్ని కలిగి ఉంటే ఆసాహిత్యానికి అంత సార్థకత సిద్ధిస్తుంది.

చైతన్య వంతమైన పాత్రలు నవలకు ముఖ్యం. వ్యక్తి జీవితాన్ని ఆధారంగా చేసుకొని సామాజిక దృక్పథాన్ని ఆవిష్కరింప జేయడం నవల కర్తవ్యం. జీవితమంటే సుఖ దుఃఖాలు. ఒక వ్యక్తి జీవితంలో భిన్న సందర్భాలలో చూపే ప్రవర్తనపై ఆవ్యక్తి వైశిష్ట్యం ఆధారపడి ఉంటుంది. 'Charecter is destiny' 'వ్యక్తిత్వమే విధివ్రాత.' జీవితాన్ని కథగా మలిచే ప్రక్రియయైన నవలలో ఆవ్యక్తి వైశిష్ట్యాన్నే పాత్రచిత్రణఅంటారు. అనూచానంగా వస్తున్న ఆచారాలను సంస్కరించడానికి పవిత భవితవ్యాన్ని చక్క చేయడానికి, ధర్మాచరణకు గాని, ధర్మ వ్యతిక్రమణకు గాని వ్యక్తిదే బాధ్యత. పాత్రచిత్రణ అంటే వ్యక్తిత్వ చిత్రణ. కాబట్టి వ్యక్తి ప్రాధాన్యం వహించే నవలలో ఈపాత్రోన్మీలనం (Charecterization) అంత ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది.

నవల ప్రధానంగా కల్పనాత్మక సాహిత్య ప్రక్రియ. ఐతే యథార్థాలను ఎన్నిక చేసుకొని వాటిని ఒక క్రమంలో తీర్చిదిద్ది సామర్థ్యవంతంగా ఆవిష్కరింప చేసేదే 'వాస్తవికత.' సత్యాన్వేషణ దృష్టి, సత్యావిష్కరణ కృషి, ఏరచయితకైనా అవసరం. అదే రచనకు ప్రాణం. సాహిత్యానికి వాస్తవికత ప్రాణమైతే కల్పన శరీరం లాంటిది. వాస్తవికత అంటే మానవ జీవితంలో మారని నిత్యసత్యాలు. ఈ వాస్తవికతను ప్రదర్శించడానికి నవలలో ఏర్పరచు కొన్న పరిసరాలు, సందర్భాలు సాంస్కృతిక సంప్రదాయాలు, నాగరిక వస జాలం, ఇవన్నీ కల్పన అవుతుంది. 'వాస్తవికత' అనే ప్రాణం 'కాల్పనికత' అనే శరీరాన్ని అంటి పెట్టుకొని ఒక సంపూర్ణ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాలి అదే నవలకు కావలసింది. నవల గాని పద్యంగాని, కథగాని పాటగాని ఏదైనా పరే పాఠకునిలో ఆసక్తిని రేకెత్తించే ఒక మహానుభవం కావాలి. నవలా రచయిత ఏకాలానికి సంబంధించిన విషయాన్నైనా రాగద్వేషాలకు తావివ్వకుండా పైపైనే కాక లోతుగా అవగాహన చేసుకోవడం అవసరం.

ఆధునిక కాలంలో పాశ్చాత్యులు ప్రతిపాదించిన కొన్నిసిద్ధాంతాలు ఆధారంగా తెలుగు నవలల్లో ప్రయోజనాత్మకమైన మార్పు వచ్చింది. వ్యక్తియొక్క అంతర్గత జీవితంలో మనోవిజ్ఞానిక తత్త్వ ప్రాతిపదికగా మూడు సిద్ధాంతాలు వె[illegible]నాయి.

1) Freudian theory - Sigmund freud.
2) Adlerian theory - Alfred Adler.
3) Jung theory - C. G. Jung.

వ్యక్తి అంతరంగిక జీవితాన్ని నిర్ణయించేది లైంగికము అని frued వాదము. లైంగిక ప్రభావము వ్యక్తి బాల్యజీవితం నుండి వుంటుంది. ఆడపిల్లలకు తండ్రుల పైని, విశేషంగా ప్రేమ ఉండటం లైంగికాకర్షణవల్లనే. వ్యక్తిలో నైరాశ్యము

(Neurosis) ఎడిపస్ భావగ్రంథి (Oedipus complex) ఒక కారణము ఇది ప్రాతిపదికగా మాతృస్థిరత్వం (Mother fixation) కలుగుతుంది. ఇది వ్యక్తి ఆంతరంగిక జీవితంలో నిగూఢంగా జరిగే మార్పు. మాతృ స్థిరత్వం కలిగిన ప్రతిపురుషునికి ప్రతిస్త్రీ తల్లిగా కనపడుతుంది. ఇదే వ్యక్తిలో కలిగే వైరాగ్యం. మాతృస్థిరత్వంనుండి బయటపడాలంటే వ్యక్తిలో లైంగిక పరిణామం జరగాలి. దీనినిబట్టి వ్యక్తి బాహ్యజీవితం ఎప్పుడూ లైంగిక ప్రభావంతో ముడిపడి వుంటుందని Frued అభిప్రాయము. బుచ్చిబాబు 'చివరకు మిగిలేది', పద్మ చండీదాస్ 'హిమజ్వాల' మొదలైనవి ఈ సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకొని వెలసినవి.

ఒకవ్యక్తి బాల్యజీవితంలో సంభవించిన ఒక బలమైన అనుభూతి, స్పందన, హఠాత్పరిణామం ఆవ్యక్తియొక్క భావి జీవితాన్ని నిర్ణయిస్తుంది. సాధారణంగా ప్రతి వ్యక్తిలో ఆత్మన్యూనతా భ్రాంతి (Inferiority Complex) ఏదో ఒక రూపంలో చోటుచేసుకొంటుంది. ఈ ఆత్మన్యూనతా భ్రాంతికి కారణం వ్యక్తిలోని బలహీనత. ఈ బలహీనత మానసికమైనా కావచ్చు, భౌతికమైనా కావచ్చు (అంగవికలత). మానసికపరమైన ఆత్మన్యూనత తొలగుటకు అంటే ఆభ్రాంతినుండి బయటపడుటకు వ్యక్తిలో మానసిక పరిణామం అవసరం. జీవితానుభవం వ్యక్తికి మానసిక పరిణామాన్ని కలిగిస్తుంది. అప్పుడు వ్యక్తి ఆత్మన్యూనతా భ్రాంతినుండి బయటపడగలుగుతాడు. ఒక వ్యక్తి జీవితంలో బాల్యంలోని బలమైన సంఘటన భావిజీవితంలో పునరావృత్తిమైనపుడు ఆవ్యక్తి మానసిక విశ్లేషణ,ఆవ్యక్తికి ఆత్మన్యూనతాభ్రాంతి నుంచి విముక్తి కలిగిస్తుంది.ఇదే Alfred Adler చేసిన సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ఆధారంగా రూపొందినదే రాచకొండ విశ్వనాథశాస్త్రి 'అల్పజీవి.'

వ్యక్తి పరిపూర్ణతకు (Individuation) నాలుగు ప్రవృత్తులు ముఖ్యకారణాలు.

1) మేధావృత్తి (Intellectual)
2) అనుభూతి (feeling)
3) చేత (action)
4) ఆధ్యాత్మికము (Intuition)

ఈనాలుగు వ్యాపారాల్లో ఒక్కటే వ్యక్తిలో బలవత్తరంగా వుంటుంది. అయితే అది మిగతా మూడు వ్యాపారాల్లో సామరస్యతను (convence) కల్పించాలి. ఈనాలుగు వ్యాపారాలు సమానపాళ్లల్లో వ్యక్తిలో నిల్చినపుడు వ్యక్తి పరిపూర్ణత సాధ్యమవుతుంది. బలవత్తరమైన మానసిక వ్యాపారం మిగిలిన మూడు వ్యాపారాలను సంఘటిత పరచి, సామరస్యం ఏర్పరిచినపుడు వ్యక్తి పరిపూర్ణత సాధిస్తాడు అని jung [యూంగ్] సిద్ధాంతము. R.S. సుదర్శనం గారి 'మళ్ళీ వసంతం' ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన తెలుగు నవల.

మనోవిశ్లేషణ తర్వాత మానవతావాదాన్ని ఆధారం చేసికొని తెలుగులో కొన్ని మంచినవలలు వచ్చాయి హేతువాదాన్ని పరామర్శం చేస్తూ గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర' వెలసింది. మానవతా వాదాన్ని ప్రతిబింబిస్తూ వచ్చినవి. జి.వి. కృష్ణారావు 'కీలుబొమ్మలు,' మార్క్సిస్టుదృక్పథంలో రాచకొండ విశ్వనాథ శాస్త్రి 'గోవులొస్తున్నాయి జాగ్రత్త', అధునాతనమైనవ్యక్తి వాదానికి పరాకాష్ఠ అయిన అస్తిత్వ వాదన, చండీదాస్ 'హిమజ్వాల' మొదలైనవి. పాశ్చాత్య నవలా విధానంలో వచ్చిన ఆధునిక పద్ధతులు తెలుగు నవలల్లో ప్రవేశించాయి. ప్రతీకాత్మకత (Symbolism) ఆధునిక రచనా విధానంలో వచ్చిన పరిణామం. విశ్వనాథ వారి 'వేయిపడగలు' వినుకొండ నాగరాజు 'ఊబిలో దున్న' చలం 'అరుణ' మొదలైనవి దీని ఉదాహరణాలు.

చైతన్యస్రవంతి నవలలు (Stream of consciousness) ఇటీవల వెలసినవి. యాదృచ్ఛికమైన భావాలను ఆలోచనా పరంపరతో యథాతథంగా చూపించడం చైతన్య స్రవంతి రచనా విధానం. చేతనలో జరిగే, ఆలోచనా తరంగాలకు భాష నివ్వడం. దీనినే 'Interior monologue అంటారు. చలం 'అమీనా' చండీదాస్ 'హిమజ్వాల' నవీన్ 'అంపశయ్య' బుచ్చిబాబు 'చివరకు మిగిలేది,' రా. వి. శాస్త్రి 'అల్పజీవి' మొదలైనవి ఈపద్ధతిలోనివే.

యథార్థ జీవితానికి వాస్తవ రూపకల్పన, రచయిత ఆత్మకథనమూ, సత్యాన్వేషణమూ, నవలకు ప్రాణాలు.

Bibliography :-


1. 'ఆధునిక తెలుగు నవలా రీతులు' (సిద్ధాంత వ్యాసం) (Modern Trends in Telugu Novel)- డా॥ యు. శ్రీరామమూర్తి
ఎం. ఏ., పిహెచ్.డి.

2. 'సమాజము - సాహిత్యము' - ఆర్. యస్. సుదర్శనం.

3. 'మహతి' - 'యువభారతి' ప్రచురణ.


(ఈ వ్యాసానికి సంబంధించిన అనేక విషయాన్ని తెల్పి, వారి సిద్ధాంత వ్యాసాన్ని (Thesis) ఉపయోగించుకోవ డానికి అనుమతించినపూజ్యపాదులు, మా గురుదేవులు డా॥ ఉప్పల పాటి శ్రీరామమూర్తి గారికి కృతజ్ఞతా నమస్సులు తెలుపు కొంటున్నాను.]

—...—

# జాషువా చారిత్రక రూపకం - 'వీరాబాయి'

- డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం. ఏ., పిహెచ్. డి.

మార్గరూపక రచన భారతీయులకు ప్రాచీనమైనప్పటికీ, ఆంధ్రులకు అర్వాచీనమైనది. ఆధునికకాలంలో ఈరచనా ప్రక్రియ తరచైనది. ప్రక్రియా వైవిధ్యాన్ని ఆదరించిన జాషువాగారు రూపకాలను గూడా రచించారు. లభించిన రూపకాలలో పౌరాణికాలు, చారిత్రకం, సాంఘికం ఉన్నాయి. వారు ఏయే కావ్య ప్రక్రియలను స్వీకరించినప్పటికీ, సంఘ సంస్కరణమే ప్రధానంగా కనిపిస్తుంది. కళ్ళకుకట్టినట్లు శ్రవ్యకావ్యాలను రచించే కౌశలం గల జాషువాగారు దృశ్యకావ్యాలను రచించటంలోనూ సిద్ధహస్తులనిపించుకున్నారు. పౌరాణిక, చారిత్రక రూపకాలలోనే సంఘ సంస్కారానికి ప్రాధాన్యమిచ్చిన కవిగారు సాంఘిక రూపకంలో దాన్ని స్ఫుటతరం చేయటానికి ప్రయత్నించి సాఫల్యాన్ని పొందారు. ప్రస్తుతం ఈవ్యాసం జాషువాగారి చారిత్రకరూపకమైన 'వీరాబాయి' పరామర్శనాత్మకమైనది.

జాషువాగారీ నాటకాన్ని గుంటూరు బాలమిత్ర సమాజంవారి కోరికపై 1926 లో వ్రాసినట్లు 'భూమిక'లో తెలిపారు. నాటకం చరిత్రాత్మకం. హిందూ ముస్లిం మైత్రిని మనస్సులో వుంచుకొని కవిగారీనాటకాన్ని రచించినట్లు తెలుస్తున్నది. ఉదయసింహుడి హృదయేశ్వరి అయిన 'వీరాబాయి' యొక్క శౌర్యప్రతాపాలిందు వర్ణితాలైనవి. కులమత ద్వేష దూషితుడు కాని అక్బరుచక్రవర్తి గుణగ్రహణపారీణత, బనబీరుని శత్రుసంహార దీక్ష. చిత్తూరురాజ్యనాశనార్థ మతడు పన్నిన పన్నాగాలు, మొగలురాజును వివాహమాడి, తన సర్వసమతాపవిత్రాశయాన్ని ప్రకటించిన 'మధురాదేవి' శీలమూ మొదలైన అంశాలీనాటకంలో యథోచితంగా పోషింపబడినాయి. ఇది అయిదుఅంకాల నాటకం. ఇందులో అక్కడక్కడ కొన్ని మధురమైన పద్యాలుకూడా వున్నాయి. సంభాషణలను చెప్పించటంలోను, పాత్రలను సహజసిద్ధంగా చిత్రించటంలోను కవిగారి ప్రతిభ మనకు గోచరిస్తుంది. కవిగా తమ ప్రధానాశయమైన హిందూముస్లిం మైత్రిని – ప్రథమాంకంలో రెండోరంగంలో అక్బరుపాత్ర ద్వారా సాధించటానికి ప్రయత్నించారు. అందువల్లే అక్బరుచేత ఈవిధంగా పలికించారు.

"అక్బరు (తనలో). మున్నటి యుద్ధమున జయపురపతి నాకుఁ బాదాక్రాంతుడై నాకుఁగూతు నిచ్చెద నని వాగ్దానమిచ్చెను. ఈవివాహము హిందూముసల్మానుల మైత్రి కెంతయు ననుకూలించును. ఈ హైందవ బాంధవ్యము నాకీర్తికి వనె వెట్టకపోదు. నాజీవన మనేకుల కాదర్శప్రాయమై నూతనజ్ఞాన జ్యోత్స్నఁ బ్రకాశింప జేయఁగలదు......"

మధురాదేవిచే ఢిల్లీపురాన్ని, తద్వైభవాన్ని వర్ణింప చేయుటంలో కవిగారు పురాణపురుషులను కొనియాడి, తమ సంప్రదాయాసక్తిని వెల్లడించారు.

"పాండవేయాది వీరభుజాభిరక్షితంబై శ్రీకృష్ణభగవానుని పాదవిన్యాసమునఁ బవిత్రమై, వ్యాసకావ్యామృత వృష్టియందు మునిఁగి తేలి, భరతవర్షమునకు యశము నార్జించిన నగరరాజ్యమును నేఁడుకదా కనులారఁ గాంచితిని" అని మధురాదేవి పులకిస్తుంది. నిజానికి ఈ పులకింపు జాషువాగారిదే.

"కులమత ద్వేషము ఘోరభూతంబులై
  యొండొంటితోఁ బోరుచుండినపుడు
పరులసంపదలకోర్వని స్వాభిమానంబు
  కారాలు మిరియాలు నూరునపుడు
అఘముకల్పనచేయు నపకార దేవత
  స్వేచ్ఛగా రాజ్యము సేయునపుడు
కూటికైపడియుండు కుక్షింభరత్వంబు
  మితిమీరి తనువు లమ్మించునపుడు
ధర్మదేవత మూఁడుపాదములు దునిగి
  యొంటిపాదాన నల్లాడుచుండినపుడు
ధరణి విజ్ఞానమున కెందు తావులేక
  యీసరోజాక్షి నిట్లాశ్రయించె నేఁడు!"

మధురాదేవి తన జననీజనకులు తనను అక్బరున కిచ్చి పెండ్లిచేయటానికి అంగీకరించకపోయినా, తానే స్వయంగావచ్చి 'పాదుషా పాదాలను ఆశ్రయించెద' నని తన మనోనిశ్చయాన్ని తెలిపినప్పుడు– స్త్రీవేషంలోవున్న అక్బరు పైవిధంగా అనుకుంటాడు. ఈపద్యంలో ఆనాటి సమాజపరిస్థితి సునిశితంగా విమర్శించబడింది.

ఉదయసింహుడితో జయమల్లు చిత్తూరురాజ్యలక్ష్మియొక్క శౌర్యప్రతాపాలను వివరించి చెపుతూ–

"కుంభరాణా రాజకుంభి నిర్భయశీల
కారాడి చన్న కాంతా సీమ
రసపుత్ర రక్తవర్షములు కాల్వలుగట్టి
ప్రవహించినట్టి దివ్యస్థలంబు
పద్మినీదేవ్యాది భామామణుల నెల్ల
నాహుతింగొన్నట్టి యజ్ఞభూమి
చెంగలించుచు భీమసింగసింగ పుంగవుల్
గర్జిల్లియున్న సంగ్రామధరణి
శత్రురాజుల కదనదేశముల మీద
దృష్టిపిదలని ఘనపురంధ్రులలాను
మిట్టి మనరాజ్యమునకు ముందున్న దేది
లేనిదుర్గతి సాహింప కోనరేంద్ర !"

అని స్వదేశానురక్తితో, వీరరసోచితంగా పలుకుతాడు.

బనవీరుడి దుష్టస్వభావంతో పాటు దృఢనిశ్చయాన్ని చిత్రిస్తూ, చిత్తూరు సామ్రాజ్యసింహాసనం క్రింద విషమాగ్ని శిఖలు ఉద్భవించే వరకూ, ఉదయసింహుడి మేని మురుదు నెత్తురుజల్లు బహుముఖాల చిందిపారేవరకూ, రసపుత్ర శుద్ధాంత రామామణుల ఘోష ప్రతి మార్గయుగళాన్ని జొచ్చేవరకూ, వీరాబాయి పసుపుకుంకుమసిరి పుస్తెతో దిగిమండమోసేవరకూ, మృత్యుదేవత రాణీమ నెల్లకడల ప్రేగుపెంటలపై తాండవించేవరకూ, దాయుమన్నీల పత్నులను కోసేవరకూ నిశ్చయంగా నాకు నిద్ర రాదని చెప్పించినారు. ఈ చెప్పించటంలో బనవీరునిపాత్ర స్వభావం మనకు విశదమవుతున్నది. బనవీరుని సర్వనాశనకాంక్ష, పట్టుదల ఎంతటివో మనకు అర్థమవుతున్నది.

ద్వితీయాంకంలో తురకబంట్ల చేత వచ్చీరాని తెలుగును మాట్లాడింపచేసారు. వారి సంభాషణలు వారి పాత్రలకు తగినట్టుగా, కొంతహాస్యంగా కూడా వున్నాయి. కవిగారు పాత్రోచిత భావను ప్రవేశపెట్టడంలో తమ నేర్పును చూపించారు.

పంచమాంకంలో వీరాబాయి శౌర్యం వర్ణించబడింది.

"ముద్రింతు నా పేరు ముల్లోకములు మెచ్చ
కాళిముష్కరుల గోరీలమీద
చిత్రింతు కన్నీటి చిత్తజల్లుల పెల్లు
కోమటిపిల్లల గండములమీద
ఆడింతులోకి మల్లాడ నా దురికత్తి
దుశ్చరిత్రుల పత్నుల విూద
నటియింతు నగ్నిగంధకఘూమపటలంబు
బాలకాధముల దేరాలమీద
పరువులెత్తింతు బాదుషాబలము నెల్ల
జగతిమాయాంగ బోరలు పెనుగుల మీద
విజయకేతనమెత్తింతు విస్ఫుటముగ
కలికి ! చిత్తూరు వజ్రదుర్గముల మీద"

అని వీరాబాయి ఖడ్గహస్తయై పరుగిడుతుంది. పై పద్యంలో వీరాబాయి శౌర్యమూ, కార్యదీక్షా వర్ణించబడినాయి. కవిగారు అక్బరు చేత భరతఖండ ప్రశంస చేయించటంలో సంప్రదాయాభిజ్ఞతను దేశాభిమానాన్ని వెల్లడించారు. ప్రమథనాథుని నీరు త్రాగింపజాలిన వజ్రాల కొడుకులను పొందినదని, నరకాధిపతి గుండె కరగింపజాలిన శీలవతి మిన్నకు ఉగ్గుపెట్టిందనీ, బ్రహ్మ అంతటివాణ్ణి వణకింపజాలిన మునులకు మూపున పెట్టుకొని మోసిందనీ, అంటినంతనే పాపమడగింపజాలిన దీర్ఘకోటుల మూనిగి తేలిందనీ, ఉర్వీపుట్టకముందే తానున్నదనీ, సకలశాస్త్ర పురాణాలను చదివిందనీ, గొనబుసిరిగల భాగ్యశాలిని అనీ భారతాంబను అక్బరు ప్రశంసించి, నమస్కరిస్తాడు.

వీరాబాయి భర్త అయిన ఉదయసింహుణ్ణి శత్రువులు సంహరించటం, ఆమె కుమారుడు క్షతగాత్రుడై మరణించడం మొదలైన దుర్భరవిషయాలకు తల్లడిల్లి కత్తితో పొడుచుకొని "భరతఖండము, నా భాగ్యము, సుఖము, చిత్తూరు, దాహము సంతోషము, యుద్ధము, అక్బరు' మొదలైనమాటలు మాట్లాడుతూ ప్రాణాలను విడుస్తుంది. ఈ ఘట్టంతోనే కవిగారు తమ 'వీరాబాయి' నాటకాన్ని ముగించారు.

రూపకప్రక్రియలో చారిత్రకేతివృత్తాలను స్వీకరించి, నెగ్గటం దుష్కరం. అటు చారిత్రకతకు లోటు రానీకుండా, ఇటు కావ్యధర్మానికి లోపం రానీకుండా దృశ్యకావ్యాన్ని రచించటం కత్తిమీద సాములాంటిది. జాషువాగారు 'వీరాబాయి' నాటకంలో చారిత్రకాంశానికి ఆధునిక సాంఘిక పరామర్శను వర్తించారు. ఇది గొప్ప సమర్థులు మాత్రం చేయదగిన పని. ఈ కార్యంలో జాషువగారు కృతకృత్యులైనా రని నిస్సందేహంగా చెప్పవచ్చు. అందుకు ఈ 'వీరాబాయి' నాటకమే సాక్ష్యం. అందుని కాంధ్ర సాహితీప్రియులు జాషువా గారిని విలక్షణమైన నాటకరచయితగా కూడా గుర్తించి, గౌరవించటం ఎంతైనా ధర్మమని నాఅభిప్రాయం !!

—...—

# పిరదౌసి - గుణాఢ్యుడు - తులనాత్మక సమీక్ష

— శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

'క్షణము గడచిన దానివెన్కకు మరల్ప
 సాధ్యమే మానవున కీలాచక్రమందు?
దాటిపోయిన యుగముల నాటిచరిత
 మరలఁబుట్టింపఁగవియె సమర్థుడగును'

అట్టి చరితములలో కవుల చరిత్ర యొకటి. మన సాహిత్యమున కావ్యములుగా వెలసిన కవుల చరిత్రలు తక్కువ. వెలసినను వానిలో కవుల సారస్వత జీవనాత్మక సన్నివేశముల వివరణము తక్కువ. పండితారాధ్యచరిత్రలో శైవమత సంబంధమైన వాతావరణమునకు, వాల్మీకి చరిత్రలో సప్తర్షుల తీర్థయాత్రాభివర్ణనములకును, శ్రవణానందమున వేశ్యాసంగమ నిరసనాత్మక వాతావరణమునకును ప్రాధాన్య మియ్యబడెను. అదియునుగాక శ్రవణానందము లోనిది కల్పిత కవికుమారుని కథ. కాని, పండి పెద్ది కృష్ణస్వామి ప్రణీతముగాఁ జెప్పఁబడుచున్న బిల్హణీయకావ్యము మాత్రము సారస్వత జీవనాత్మక వాతావరణముతోఁ గూడినదని చెప్పవచ్చును. విశేషించి ఆంధ్రసాహిత్యమున మనభాషా కవుల చరిత్రలే కావ్యాలుగా వెలువడుట జరిగినది. ఇట్టికావ్యము లధికముగా ఆధునిక కాలమునందే వెలువడినవి. అట్టి వానిలో ఆధునిక కవితా ప్రపంచమునకు మకుటము లేని పీష్వా అయిన శ్రీ జాషువా గారు రచించిన 'పిరదౌసి' యొకటి. నత్కీరునికథ గలిగిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యము వంటి ప్రాచీన కావ్యాలతో పాటు కొన్ని ఆధునిక కావ్యాలలో సందర్భానుసారముగా ప్రధాన కథలో ఒకభాగముగా గూడ కవుల చరిత్రలు గలవు. ఇట్లనుటకు సంస్కృత ప్రాకృత భాషాకవియైన 'గుణాఢ్యు'ని చరిత్ర గలిగిన ఆంధ్రపురాణము పేర్కొనదగినది. ఈ గ్రంథమునందే నన్నయ, శ్రీనాథుల చరిత్రలు రసవత్తరముగా తీర్చి దిద్దబడినవి. ఈ గ్రంథమును మధుర కవితా రచనా పరాయణులైన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ గారు రచించిరి. పిరదౌసి, గుణాఢ్యుల కథలు, వేరైనను, పాత్రల స్వభావానుభవములు రెండింటియందును కొంతవరకు ఒకే తీరునఁ గలవు. ఇందలి కథాసన్నివేశములను, పాత్ర చిత్రణములను తులనాత్మక దృష్టితో స్థాలీపులాకన్యాయమును సారముగా పరిశీలించుట ప్రకృతాంశము.

పిరదౌసి గజనీమహమ్మదు కడనున్న పారశీక కవి. గుణాఢ్యుఁడు హాలునికడనున్న సంస్కృత ప్రాకృత కవి. విశేషించి మంత్రి. పిరదౌసి గజనీకోరికపై 'ఒక్కొక్క పద్యమున కొక్కొక్క బంగారు రూక కొసఁగుదును కవీ' యను మాటపై నమ్మక ముంచి 'షానామా' అను గ్రంథమును రచించెను. గుణాఢ్యుఁడు హాలభూపాలుని మెప్పును పొందుటకై అతని కళారాసిక్యముపై నమ్మక ముంచి పైశాచిక భాషలో 'బృహత్కథ' అను గ్రంథమును రచించెను. 'పారశీక గ్రంథ భాండారముల నెల్ల కదలించి తియ్యని పదములేఱి... ఇత్యాదిగా శ్రమించి పిరదౌసి తన కావ్యమును రచించెను. 'బాస పాలుపుల్ మలపుల్ తులఁ దూచి విజ్ఞానమయ కృతీందిరగా గుణాఢ్యుఁడు కావ్యమును రచించెను. ఇరువురి డెందముల లోను సోకిపోవని తలఁపులు, తలలు వంపని యుపమలు, పదములంటని పదములు నాటి వాఙ్మయమునందు మందునకైనను లేవు. 'సత్కవి ధరింపరాని వేషములు గలవె' అనసూక్తికి ప్రతీకలుగా ఇరువురును తమ కావ్యములను తీర్చి దిద్దిరి.

అరువదివేల పద్యముల గ్రంథము షానామా, ఏడులక్షలగ్రొత్తు కావ్యేందిర బృహత్కథ. ముప్పదియేండ్ల కృషిఫలితము షానామా, ఏడేండ్ల తపస్సు పండిన ఫలము బృహత్కథ. కావ్యమును వ్రాసి పిరదౌసి గజనీసభలో ముమ్మాసములు చదివి సభ నంచితానంద జలధినోలాడఁ జేసెను. కావ్యమును వ్రాసి గుణాఢ్యుఁడు తనశిష్యులచే హాలభూపాలునకు పంపెను. పిరదౌసి కావ్యమును మెచ్చుకొనియు గజనీమాట తప్పినాడు. అరువదివేల బంగారు నాణెములకు బదులుగా వెండినాణెములను పంపెను. అచట హాలుఁడు భాషాబహిర్వ్యాపమును జూచి, ద్వేషమును పూని సంస్కృతాభిమానియై 'గుణాఢ్య' గ్రంథమును తిరస్కరించెను. ఈ విధముగా జీవితములో ఓడిపోయిన కవులిరువురకును క్రోధము మిన్నుముట్టినది. పిరదౌసి ధనమును మానవేంద్రునకు తిరిగి పంపి, పారలు కొనివచ్చు దుఃఖంపుఁ దారల నడుమ, ఆకృతి దహించియున్న నిరాశకంటె ఉత్తగమును నిందాసహోక్తికముగా వ్రాసెను. గుణాఢ్యయాజ్వ తోనకి దొరగెడి కనుఁజెప్ప దొప్పనీరు నిండుదోసిళ్లముంచి మంత్రించి అగ్నికి తనకావ్యమును ఆజ్యమువకమైనహోమము చేయనెంచెను. ఆసమయమున సామిధేనీ మంత్రముల సారమే కవిత్వరూపమున బయటపడెను. రెండింటి యందును ఈసన్నివేశము నిజముగా రసవన్నివేశము! ఇందు భేదసాదృశ్యములు కొన్ని గలవు.

పిరదౌసి దుఃఖము నిరాశామయము. కనుకనే 'ఓసుల్తాను మహమ్మదూ! కృతకవిద్యుద్దీపముల్ నమ్మి ఆశాసౌధంబును కట్టికొంటి నిది నిస్సారంపు టాకాశమై నా సర్వస్వము దొంగిలించినది' అనియు 'ఈనిరాశాంకిత బాష్పములే ఫలములైనవి ముప్పది యేండ్ల సేవకున్' అనియు

దుఃఖించి నాఁడు. పిరదౌసికి ఈ నిరాశ యేర్పడుటకుఁగల కారణము అతనికి గలిగిన కష్టమునకు తగిన పరిష్కారము లేక పోవుటయే! కాని గుణాఢ్యునకు హాల తిరస్కారరూపమైన కష్టమేర్పడినప్పటికిని తనకావ్యమును హోమము చేయఁదలంచి కనీసము ఆరూపములోనైనను దుఃఖము విషయమున తాను తృప్తిని పొంది ఆత్మ నిర్వృతిని చెందఁదలంచినాఁడు. ఆవిషయమునే ఇట్లు చెప్పినాఁడు:-

'వినిపితి దోసిళుల్ వలిపి
  వేసరితిన్ మునివర్య్య నేటికిన్
వినము లకాసుఁగోటిఁ బెను
  వీతిచి పైని యుఁక బాసచేసెదన్
గొసరిన నీశిఖారసనకుం
  గవితాఘృతధారఁ జాలగా
నొసఁగెద బ్రహ్మవర్చసము
  నొందెదఁ గొందద నాత్మనిర్వృతిన్॥'

ఇంతకును గుణాఢ్యుఁడు తనకష్టమునకు తానే పరిష్కార మార్గమును గల్పించుకొని విశేషించి కర్మసిద్ధాంతముతో ఈవిధముగా తనచేష్టను సరిపెట్టుకొని ఆత్మతృప్తిని చెందెను:-

'నీలో నాకృతి నిల్చుయోగ మది యుం
  డెన్ గానిచో హాలభూ
పాలగ్రామణి భావనావిషయుఁడున్
  భాషాబహిర్ద్వేషమే
యాలోచించి తిరస్కరించునె 'గుణా
  ఢ్య' గ్రంథ మేలా కృతి
శ్రీలన్ రాజుల గాజుచూపుల పిశా
  చీరూపముల్ దాల్చెనే?'

ఇందులో 'గుణాఢ్య' శబ్దము కవి నామాత్మకముగను, గుణములచేఁ బ్రసిద్ధమైన దని కావ్యవిశేషణాత్మకముగను శ్లేషయుక్తముగా ప్రయుక్తమగుట విశేషము. పిరదౌసిలో ఇట్టి కర్మసిద్ధాంతము కన్పించదు.

పిరదౌసి,

'చిరముగ బానిసీని కభి
  షేక మొనర్చితి మల్లెపూవుట
త్తరు లొలికించి మాయజల
  తారున రాజుగదా! పసిండి, ఓ
కలుషతురుష్కభూపతి! యు
  ఖండమహీవలయమ్మునందు నా
శిరమునఁ బోసికొంటిని న
  శింపని దుఃఖపుఁగిన్క ఖండముల్॥'

అని తన్ను తాను నిందించుకొనెడి రూపములో అధిక భాగము సుల్తానును నిందింపఁగా, గుణాఢ్యుఁడు తనకు ద్రోహ మొనర్చిన హాలభూపాలుని స్పష్టముగనే నిందించుటకు ప్రయత్నించినను, ఆ నింద అంతగా ఉద్వేగస్థితిని పొందలేదు. దీనికి కారణ మతఁడు పలికిన మాటలు ప్రత్యక్షముగా హాలనింద కుద్దేశించినవి కాకపోవుటయే? ఇచట తన కృతి నాశన మగుచున్న దను దుఃఖమే గుణాఢ్యునిలో ప్రధానము. పిరదౌసియు గజినీ మహమ్మదును స్పష్టముగా నిందించిన పద్యములుగూడ గలవు. దీనికి

'అల్లాలో డని పల్కి, నాపసిడి కా
  వ్యద్రవ్యమున్ వెండిలోఁ
జెల్లింపన్ దొరకొన్న టక్కరివి, నీ
  చేఁబూజితుండైనచో
నల్లాకున్ సుఖమే, మహమ్మదునృపా
  లా! సత్యవాక్యం బెవం
డుల్లంఘింపఁడొ వాఁడెపో! నరుఁడు ధ
  న్యుండిద్ధరామండలిన్'

ఆ-పద్యము నిదర్శనము. ఇందుఅకృత్య మాడినవాడు 'అల్లా'ను పూజించినచో ఆదేవునకుఁ గూడ సుఖము శూన్యమనుట చమత్కారము! ఇంతకును పిరదౌసి తన్ను తాను నిందించుకొనెడి రూపమునను, గుణాఢ్యుఁడు తన కృతి నగ్నిదేవునకు నివేదనచేసెడి రూపమునను ధ్వన్యాత్మకముగా మాత్రమే రాజనిందగలదు.

ఇఁక వీరిరువురు తమతమనిందలలో రాజసమాజము యొక్క దుష్టస్వభావమును గూడ వెల్లడించిరి. 'పూని ఖురానికిన్ మనుజభుక్తి నొసంగెడి రాతిగుండె సుల్తానులకు' అని పిరదౌసి సుల్తానుల కఠిన స్వభావమును వెల్లడించగా, గుణాఢ్యుఁడు.

'సౌజన్యం బను మేకతోలు మెయి నా
  చ్ఛాదించుకొన్నట్టి యీ
రాజుల్ రాజులు కారు, బెబ్బులులు, వీ
  రౌ? మా శ్రమస్వేదపా
నీజాలంబు హరించువారు, కృతియి
  త్తున్ మెచ్చ రైకోఁగదే!
నీజిహ్వాగ్రములన్ ధనంజయుఁడు! రా
  ణింపన్ జిరస్థాయిగన్॥'

'మీసలతేనియల్ విసపు
  మెప్పులు అచ్చముగాని కౌగిళుల్
మోసపుఁగానుకల్ మొగము
  ముందరినవ్వుల నొల్కఁబోసి, వి
శ్వాసకృతజ్ఞతా హృదయ
  భావుకతల్ దిగఁద్రోచి, జీవితో
ల్లాసముఁ దీర్చుకొన్న నృపు
  లా! కవితాకళ నుద్ధరించుటల్॥'

అని రాజసమాజముయొక్క వంచనా స్వభావమును వెల్లడించెను. పైని చెప్పఁబడిన రెండవ పద్యమున రాజసమాజము యొక్క వంచనా స్వభావమును అచ్చ తెలుఁగు పదాలలో వెల్లడించి కవి వారి దుర్గుణములలోని స్వచ్ఛతను స్పష్ట పఱచెను.

ఇఁక పిరదౌసి గుణాఢ్యు లిరువురు తాముపడిన కావ్యరచనాశ్రమను తెలుపుకొనుటలో సామ్యము గలదు. మచ్చుకొకటి:-

'ఒక్కొక పద్దియమ్మునకు
  నొక్కొకనెత్తురుబొట్టు మేనిలోఁ
దక్కువగా రచించితి, వృ
  థాశ్రమ యయ్యెఁ గులీనుఁడైన రా

జిక్కరణిన్ నృపుల్ వలుకు
   నే? కవితాబ్ధిమా మాయమందునే ?
నిక్కమెఱుంగనైతి, గజ
   నీసులతాను మహాత్ముదగ్రణీ !'

ఇది పిరదౌసి పలికినది.

'దాచితి, నేండ్లుగా బహువి
   ధంబుల నోచితి, రక్తమాంసముల్
వేచితిఁగమ్మనై రుచులు
   పెల్లగునీయుపహారభుక్తి నీ
వా చవిఁదిండి కంచుఁగొని
   వచ్చితిఁ బావక ! వాడినాలుకల్
చాచుడు, తృప్తవీక్షణము
   లన్ దనియింపుము, పేదపండితున్ ॥'

—ఇది గుణాఢ్యుఁడు పల్కినది. 'అలసట తీర్చుకొందును...'. 'ఇది యేదేండ్ల తపస్సుపండిన ఫలం బీ నా కృతిన్...' మున్నగు పద్యములను బట్టి గుణాఢ్యుని కంటె పిరదౌసియే అధికముగా దయనీయమగు స్థితిలో శ్రమపడినట్లుగా తెలియుచున్నది. ముత్తమీద పిరదౌసి కరుణారసములోనికి పర్యవసించునట్టి వీరమును ప్రదర్శించగా; గుణాఢ్యుఁడు శాంతరసములోనికి పర్యవసించునట్టి వీరమును బ్రదర్శించె ననవచ్చును.

చివరకు పిరదౌసికి ఫలితము 'పట్టి చంపు'డను మహాత్ముని కఱకుటానతి. అది విన్నవెంటనే

'ఎన్నో కొండలు గుండెలో కరగిపో
   యెన్, వారిధిసంతానముల్
గన్నీరై ప్రవహించె, లోకము నిరా
   కారస్థితిన్ బొందె, ను
త్పన్నం బయ్యె విషాదమేఘపటల
   ధ్వాంతౌఘ మాలాలతల్
సున్నాలాయె, నగాధశోకజలరా
   సుల్ దోఁచెఁ బిర్దౌసికిన్ ॥'

ఇచట చివరకు ఫలితము గుణాఢ్య గ్రంథము నిరవశేషముగా దగ్ధమగుట. ఆసమయమున కవి (గుణాఢ్యుఁడు) వేయిదళాల తమ్మివిరిఁబోని హృదయము ఒక్కొక్క రేకుగాఁ బ్రిదులుచుండె. తిరువాత అచటి ఆస్థానపండితుల హితోపదేశముచే గజనీ హృదయము మారినది. ఇచట గుణాఢ్యుని కావ్యహోమమువలన గలిగిన ప్రకృతి వైపరీత్యముచేతను, కైత కవటాకులు ఫుటుగులై 'కూయుట చేతను హాలుని హృదయము మేల్కొన్నది. గజనీ బంగారు నాణెములను కవికి పంపినాఁడు. అప్పుడే సుకవిదేహము ప్రేతభూమికి లభించినది. నడుమ ఒక్కనిమిషము మాత్రమే భేదము! ఇది విధివిలాసము. కవిపుత్రిక తనతండ్రిని కష్టపెట్టిన ధనమును తిరస్కరించినది. హాలుఁడు కావ్యహోమము నాపుచేయించి గుణాఢ్యుని కౌగిలింతలచే నోడించినాఁడు. గజని పశ్చాత్తాపముతో పిరదౌసి పేర నొక సత్త్రమును కట్టించెను. గుణాఢ్యుని మరణానంతరము హాలుఁడు పైశాచిక భాషను నేర్చుకొని మిగిలిన కావ్యమునకు పీఠికను వ్రాసెను. కాని గజనీ పట్టణ వీథులందు నృపుని కళాంశము సప్రాణమై రజనిమధ్యములందు తిరుగుచుండునట! హాలుని కట్టిగతి పట్టలేదు. ఈ రెండును జరిగినకథ లగుట విశేషము.

ముత్తమీద పిరదౌసి గుణాఢ్యులు దుష్ప్రభుస్వామ్యము నెదిరించుటకే ప్రయత్నించిరని యీకథలనుబట్టి తెలియుచున్నది. కాని, ప్రభువుల గొప్పతనము నెదిరించుటలో గుణాఢ్యుఁడు చూపిన ధీరగంభీర పాండిత్యమున కనుకూలమైన ఔదార్యము పిరదౌసి గజనీ నెదిరించుటలో చూపలేదు. ఎంత సేపటికిని పిరదౌసి నిరాశాపూరితుఁడై తన్ను తాను నిందించుకొనుటయే సరిపోయినది. అదియునుగాక గుణాఢ్యుఁడు హాలునినుండి ఆశించినది పిరదౌసి గజనీనుండి ఆశించినదానికంటె గొప్పది. పిరదౌసి గజనీనుండి ఆశించినది ఐహికమైన ఫలము కాగా, గుణాఢ్యుఁడు హాలునినుండి ఆశించినది సారస్వతాత్మకమైన ఫలము. అదే ఒక రకముగా గుణాఢ్యుని ఉదాత్తతను నిలబెట్టుచున్నది. కాని, పిరదౌసిలో గజనీ చేసిన గొప్పమోసమును సహించలేని బలహీనత, గుణాఢ్యునికంటె ఎక్కువగా ఉన్నదని భావింపవచ్చును. ఏది యేమైనను, రాజుల చేతిలో మోసపోయిన ఇరువురిలోను పాఠకుల సానుభూతిని వెంటనే పొందునది పిరదౌసి మాత్రమే! కాని పరిశీలించినచో గుణాఢ్యుఁడే నిజముగా దయనీయుఁడు. దీనికి కారణము అతనికృతి చాలభాగము అగ్నికాహుతియైనది కనుక !

ఇంతవరకు పిరదౌసి గుణాఢ్యుల జీవితాలు 'నీవెక్కదలచుకున్న రైలు జీవితకాలం లేటు' అన్నదానికి నిదర్శనాలు. మహాస్రష్టయైనవాఁడు మరణించిన పిమ్మటనే నిజముగా జీవించుననుటకుఁ గూడ వీరి జీవితాలే దృష్టాంతాలు ! కనుకనే పిరదౌసి గుణాఢ్యులు మరణించిన పిమ్మటనే గజనీ హాలభూపాలురచే గౌరవాలను పొందిరి. పాఠకుల మెచ్చని ఆవిరులనే ఊపిరులుగా తీసికొని చిరంజీవు లగునట్లుగా పిరదౌసి గుణాఢ్యు లాయాకవులచే ప్రశంసాగ్ర్యమగురీతిలో అక్షరాకృతులను దాల్చిరనుటలో సందేహము లేదు. ఇన్ని మాటలు దేనికి? పిరదౌసి గుణాఢ్యుల కథాకృతులు సాహితీజగతిలో అమృతజ్యోతులను నిలుపగలట్టి సుకృతులు! ఆంధ్రభారతికి వెలలేని అలంకృతులు! ఆయాకృతులకు, కృతికర్తలకు ఇవియే నా అక్షర-హారతులు !

—•••—

# నా దేశము

శ్రీ వసంతరావు రామకృష్ణరావు,
ఎం. ఏ.

శ్రీలక్ష్మి నిలయంబుగా నెగడి, తు
ష్టిం గూర్చి, జాతీయ భా
వాలన్ గల్గుమనోజ్ఞ జీవనము, వి
శ్వశ్రేయమున్ గూర్చ, వా
గ్విలాశోభిత కావ్యమాధురులు, శ
క్తింజూప, నెల్లప్పుడున్
వైలక్షణ్యము కల్గుపాలనము సం
భావింతు! నాభూమిపై!

ఎంత యుపద్రవంబు తల
యెత్తిన, భారత యోధవార మా
వంతయు సంచలింపక యె
బాహుబలంబున శాత్రవాళి నే
చింతలపాలు జేసి, నవ
జీవన భాగ్యము, భారతంబునన్
సంతత నిత్య నూతన వ
సంత శుభోదయ ముదం జేయుతన్!

దేశమునాది, నాయకుడ
దీనికి నేనె యటంచు బల్కు నా
దేశమువీడి, భారతి స
విత్రికి సేవయొనర్చ, నూత్నసం
దేశమునంద జేయుటయె
నీవిధి, నిప్రతికూల శక్తులన్
నాశ మొనర్చి,నీవు, భువ
న స్తుతనీయ ప్రతిష్ఠ గాంచుమా!

నాదేశం బిది, భారతీయుడను, వి
జ్ఞానంబు నాదీక్షగా,
భేదంబుల్ సమయింప జేయుదును, తృ
ప్తింగూర్చు, సాఫల్యసం
మోదంబిచ్చెదు, జీవితంబునను, సం
పూర్ణంబుగా సౌఖ్యముల్
పొదుంగొల్పెద! భారతీయులకును
ల్లాసంబుం జేకూర్చుచున్!

వసుధన్ సుస్థిర శాంతి సౌఖ్యముల ప్రా
భావంబు సూచింప, తా
మస భావంబు నశింపజేయుటకు, సౌ
భ్రాత్రంబునన్ గూడి, పెం
పెసలారన్ సహకార జీవనము దీ
పింపంగ, నాదేశమే,
యసమానంబగు కీర్తిగాంచినది! ధ
న్యంబయ్యె నా జన్మమున్।

సమతా భావము, దేశభక్తి, నియత
స్వచ్ఛంద జాతీయ భా
వము నిండన్, మన భారతంబునను, ధ
ర్మఖ్యాతి నార్జించుచున్,
మమతాగంధ మెసంగి, యెల్లరును నా
నందంబు దీపింపగాఁ
దమిమీరన్, ధరణీవనిన్ మెలగి, ని
త్యంబున్ సుఖం బందుడీ।

కవితా భారతి సన్నుతిన్ గనుము, న
గ్రస్థాన ముండుండగా,
భవితవ్యంబులు దీర్చిదిద్దుమను, సం
పత్ సౌఖ్యముల్ నిండగా.
నవనిన్ మానవజీవితంబు, రసర
మ్యంబై వెలుంగొందఁగా,
నవతా భావము, దేశవైభవనిధా
నంబై, ముదం బిచ్చుతన్।

ఆకలంకం బగు దేశభక్తిగలపు
ణ్యాత్ముల్ జనింపంగ, మా
మక దేశంబున, జాతి జీవనము స
న్మాన్యంబునైయుండ, వా
రక మాదేశమునందు ధర్మమును న
శ్రాంతంబు పాటింపరే?
యొకరా, యిద్దర, ముగ్గురా, నలుగురా
యున్నార లెందెందరో!

శ్రీలక్ష్మి సదనంబు భారత ధరి
త్రీమాతకున్ ప్రీతియౌ
శీలంబంది ప్రజల్ నితాంతవిజయ
శ్రీ గాంచి, యేపారి, లో
కాలన్ వేగగడించి వర్ధిలుడు! దీ
ర్ఘాదక్షులై పౌరులే
ప్రాలంగావలె! విశ్వశాంతి నిలయం
గాఁ దేశ ముప్పొంగగాన్।

శ్రీకరమై, మనోజ్ఞమయి
శ్రేయముగూర్చుచు భారతంబుసు
శ్లోకులు, మాన్యులున్, ఘనులు,
చూపిన భవ్యపథంబు నందు న
స్తోకము, శాంతి సౌఖ్యముల
తో ముదమందగ, నాదుదేశమే
నాకమువోలె, నందనవ
నంబు విధంబున, హాయి గూర్చుతన్।

ప్రాణపదమ్మునై, పరమ
పావన జీవన భావనంబు, ని
ర్వాణపరిస్థితిన్ దిటము,
ధన్యము భారతభూమి నిత్యక
ల్యాణము, పచ్చతోరణము
నై విలసిల్లుచు, పౌరులెల్ల, వి
న్నాణముగా వెలుంగవలె
నాదగు భారతదేశ మందునన్ ॥

దారుణమైన సంగర వి
ధానము శాంతితో సంగఁజాలి, డిం
పారగ సామ్యజీవనవి
హారమె, లోకమునందు శాంతికిన్
కారణ మంచు నేడు పలు
కందగు వాడొక భారతీయుడే।
భారతదేశ గౌరవము భాసిల
పౌరులు కీర్తి గాంచుడీ!

—•••—

# భారతీయ సమాజవాద సాహిత్యానికి ఆద్యుడు- మున్షీ ప్రేమ్‌చంద్

— శ్రీ సోమసుందర్.

మున్షీ ప్రేమచంద్ 1880 లో జులై 31వ తేదీని జన్మించాడు. అక్టోబరు ఎనిమిదో తేదీని, 1936 లో చనిపోయాడు. ఏభయ్యారేళ్ళ జీవితంలో దాదాపు నలభై ఏళ్ళు సాహిత్యసేవ చేసి అపార సాహిత్యాన్ని సృజించాడు. ఈ శతాబ్దపు మొదటి నాలుగు దశాబ్దాల కాలమూ ప్రేమ్‌చంద్ సాహిత్యంతో పూతమైంది. ఈ సంవత్సరమంతా ఆ మహారచయిత శతజయంతి ఉత్సవాలను జరపాలని భారతీయ అభ్యుదయ రచయితల సంఘం నిర్ణయించింది. తద్వారా మనసాహిత్యంలో సమాజవాద సాహిత్యానికి నివాళులర్పించ నిర్ణయించింది.

తన గ్రంథాలద్వారా ఎంతో ధనం సంపాదించాడు. కాని స్వయంగా నడిపిన పత్రికలద్వారా సంభవించిన దుర్భర నష్టాలకి గురవుతూ, నిరంతరం పేదరికపు జలరేఖను దాటి ఎరుగడు. జాగరణ, హంస అనే పత్రికలను ఎంతనష్టం వాటిల్లినా విడిచిపెట్టక, ఆశయసిద్ధి కోసం నడుపుతూనే వచ్చాడు.

ఈ విషయాన్నే తన యువమిత్రుడు శ్రీబనారసీదాస్ గుప్తాకు లేఖరాస్తూ ఇలా అంటాడు. 'సాహసోపేతంగా నడుపుతున్న ఈ పత్రికలు నన్నాదుకోవడం లేదు. హంసవల్ల పెద్దనష్టం వాటిల్లడం లేదుకాని, జాగరణ విషయం దుస్సహంగా ఉంది. ఈ విషమపరిస్థితినుంచి బయటపడే మార్గమేమిటా అన్నదే నన్ను వేధించే సమస్య! ప్రతినెలా రెండువందలరూపాయలు నష్టపోతున్నాను. ఈ విధంగా ఎన్నాళ్ళు సాగుతుంది? ప్రారంభించడమనే మహాపేరానికి ఈ పత్రిక నన్ను కట్టి కుడుపుతోంది. దీనిని ఆపుచేదామంటే ఆత్మగౌరవం అడ్డువస్తోంది. ఇతరులేమేమి గుసగుసలాడుకుంటున్నారో ఘోషన చేస్తున్నారో! ఈ పత్రికలను ఆపుచేయగలిగే ధైర్యం నాకుంటే ఈ హృదయవేదననుంచి రక్షింపబడుదును. కాని అదే సాధ్యంకావడం లేదు!...'

అని రాసిన ఈ లేఖాంశాలలో అతను పొందిన ఆత్మవేదన ప్రత్యక్షమవుతుంది. 1930లో రెండువందల రూపాయలంటే సామాన్య ధనంకాదు. నాలుగు బస్తాల ధాన్యానికి సరసమానం! అలా తాను నమ్మిన సదాశయాలకోసం జీవితాన్ని పణంగా ఒడ్డి పోరాడిన మహావ్యక్తి ప్రేమ్‌చంద్. మనమిలా కళ్ళు తెరవడానికేనా ఆయన అన్ని కష్టాలూ నిశ్శబ్దంగా అనుభవించాడు? అనే ప్రశ్న మనల్ని బాధిస్తుంది. ప్రేమ్‌చంద్ సాహితీమూర్తిని కీర్తించుకుంటున్నామంటే– భారతీయ సాహిత్యంలో సమాజవాదాన్ని, అభ్యుదయ దృక్పథాన్ని కీర్తించుకుంటున్నామన్నమాటే! నేటి సాహితీపరుల సర్వవిశ్వాసాల్ని ఆయనే ఆనాడు ప్రోదిచేశాడు. మన కార్యదీక్షలను ఆయనే ప్రదీప్తంచేశాడు. మనలో అచంచల ఆశావాదాన్ని ఆయనే ప్రేరేపించాడు. నలభైఏళ్ళ క్రితమే ప్రేమ్‌చంద్ అసహాయ సాహితీనాయకుడుగా నిలచి– జీవితంపట్లా, సాహిత్యంపట్లా సాహసోపేతంగా శాస్త్రీయదృష్టిని పెంపొందించాడు.

అప్పుడప్పుడే కళ్ళు తెరుస్తూ, యింకా పూర్తిగా మేల్కొనదలని భారతజాతిహృదయాన్ని తట్టిలేపాడు. నవీనదృష్టికిపుష్టిని కలిగించాడు. జాతిజీవనాడుల్ని స్పర్శించి, మథించి, నవజీవనప్రదాతలుగా నిలిచిన త్రిమూర్తులలో ఒకడై నిలిచాడు. మిగిలిన ఇద్దరూ, రవీంద్రుడూ - శరత్ చంద్రుడూను!

మన గురజాడకన్నా, రవీంద్రునికన్నా, దాదాపు ఇరవైఏళ్ళు చిన్నవాడు ప్రేమచంద్. రచయితగా కళ్ళు తెరచి బాహ్యవాస్తవికతను దర్శించగలిగే నాటికి– దుర్భర ప్రజాజీవితం కోటి గొంతులతో ఆక్రోశిస్తూ ఎదుట నిలిచింది. బాధాకర సత్యాలు కఠోరరూపాలుగా సాక్షాత్కరించాయి. దానితో మేధావిగా రచయిత విశాల జీవితంనుంచి విడిపడి బ్రతకలేడని గ్రహించి మమైకత్వం సంకల్పం చేసుకొన్నాడు. ఆరంభ యౌవనంలోనే అతని హృదయంలో సామాజిక చైతన్యం వికసించ నారంభించింది. ఆమరణాంతం అది ప్రబుద్ధమవుతూనే వుంది. అదే అతని ఆ మేరుసాహిత్యానికి ఆధారభూమిగా నిలచింది.

చైతన్యానికిగల విలక్షణత్వమే అది. ఒకసారి ఒక హృదయంలో జాగృతమై జ్వలించిందా, నిరంతరాయంగా ప్రకాశిస్తుంది. నిర్నిద్రంగా ప్రవహిస్తూ, పరిసరాలన్నిటినీ కాంతిమయం చేస్తుంది. అతి తెలివికి పోయి, బుద్ధిని పెడతలకు చేర్చి స్వార్థపర కూటనీతులకు అర్రులు చాచే కొద్దిమంది మేధావులలో తప్ప– ఇది సార్వత్రిక సత్యమే!

## మహాత్వపూర్ణసిద్ధి :

సాధారణంగా ప్రేమ్‌చంద్ నందరూ హిందీరచయితగా భ్రమిస్తూంటారు. మన కాలంలో అంతర్జాతీయ మహాకీర్తి సముపార్జించిన కిషన్ చందర్ లాగనే, ఆయన కూడ ఉరుదూ రచయితే! ఆయన కాలానికి ఉరుదూ అప్పుడప్పుడే సర్వసమగ్ర సాహిత్యభాషగా రూపుతొడుగుతోంది. మిశ్రమభాషగా ఉరుదూ– భారతదేశంలోనే పెంపొందింది. బ్రిటిష్ వారిచేత సిపాయీల భాషగా సంస్కరింపబడింది. ప్రేమ్‌చంద్ కాలాని కింకా ఉరుదూ భాషలో సర్వసాహిత్యప్రక్రియలూ అవి

ష్కారం కాలేదు. అందుకు సరిపడే సముచిత స్థాయినీ అందుకోలేదు.

ఉరుదూ భాషలో కవిత్వం మాత్రం అప్పటికే అభివృద్ధి చెందింది. అలాంటి ప్రాథమికదశలో ఉన్న ఉరుదూను పెంచి పోషించి, విస్తృతసాహిత్యాన్ని దానికందించి, సంపన్నయు గర్భీభూతం కావించినవాడు ప్రేమ్‌చంద్! ఏ భాష అయినా కవిత్వాభివృద్ధివల్ల సంతోషింపబడుతుంది. కాని వచన రచనలోనే నిజమైన అభివృద్ధి సాధిస్తుంది. విశాల జనజీవితాన్ని ప్రతిబింబించి, సజీవంగా పెరుగుతుంది. ఆధునిక సాహిత్యస్వరూపాలైన కథానిక, నవల, నాటిక వంటి వాటిని ఉరుదూలో ప్రథమంగా విస్తృతపరచినవాడు ప్రేమ్‌చంద్.

అంతే! అంతర్జాతీయ నాగరక భాషల స్థాయికి ఉరుదూను సముద్ధరించింది అతనే! ఈమహత్త్వపూర్ణసిద్ధికి ఈయన కళాశేముషి ఎంతో దోహదం చేసింది. ఆయన సాహిత్య వ్యవసాయం సాగిన నాలుగుదశాబ్దాల కాలంలోనూ అకుంఠిత దీక్షతో నిరంతరాయంగా లేఖినీశ్రామికుడుగానే జీవించాడు. అలా కాకుండా, ఏకోవిధంగా ధనం సంపాదించడమే జీవితధ్యేయమైతే ఇంత క్రాంత దర్శనానికి అవకాశమే ఉండేదికాదేమో! కష్టపడకుండా బ్రతకడానికి తనకేమాత్రం హక్కు లేదని త్రికరణశుద్ధిగా భావించాడు. మిత్రులందరికీ కంఠోక్తిగా చెప్పేవాడు! ధనం కూడబెట్టడం అంటే పేదల రక్తంతో దాన్ని బలవర్ధకం చేయడమే!' అంటూ ఆయన ఒక ఆత్మీయునికి రాసిన లేఖలో వెల్లడించాడు.

రష్యాలో జరిగిన మహత్తర మానవ విప్లవ పరిణామాలను గురించిన భోగట్టా ప్రేమ్‌చంద్‌కు 1922 ప్రాంతంలో మొదటిసారిగా తెలిసింది. మన దేశానికి కూడ స్వరాజ్యంతోపాటు అలాంటి సురాజ్యం వస్తే తప్ప నిత్యదరిద్రులుగా కునారిల్లిపోతున్న అనంతసామాన్య మానవసందోహానికి నిజమైన జీవితకాంతి లభించదని చాటాడు. ఆనాడీమాట చెప్పడానికీ పత్రికలో రాయడానికీ ఎంత ధైర్యసాహసాలుండాలో మన మీనాడు తేలికగానే ఊహించుకోవచ్చు. ఆనాటి అంతర్జాతీయ పరిస్థితులభూమిక ప్రేమ్‌చంద్ సృజనాత్మక హృదయాన్ని ఎలా ప్రేరేపించిందో - రంగభూమి అనే నవల ప్రబల సాక్ష్యంగా నిలుస్తుంది.

క్రాంతదర్శనం :

1936 ఏప్రిల్ 4వ తేదిని అమృతసర్‌లో భారతీయ అభ్యుదయ రచయితల ప్రథమమహాసభ జరిగింది. ఆమహాసభకు అధ్యక్షతవహిస్తూ ప్రేమ్‌చంద్ ఇలా ఉపన్యసించాడు. ఆఉపన్యాసానికెంతో చారిత్రిక ప్రాధాన్యం ఉంది.

'సత్యాన్వేషణకై మనల్ని పురికొల్పని, మానసికంగానూ హృదయపరంగానూ తుష్టినీ పుష్టినీ కలిగించని, సాహిత్యం మనకీనాడు పనికిరాదు. మనలో మంచిని ప్రేమించేశక్తినీ, చెడుని ద్వేషించే ధైర్యాన్నీ ఇవ్వలేని సాహిత్యం నిర్వీర్యమైనదే! జీవితంపట్ల సౌందర్యదృష్టిని ప్రేరేపించని సాహిత్యం మనకు నిరసనీయమే!...

'కష్టాల నెదుర్కొనే ధీరత్వాన్నీ, సామానికయాత్రపట్ల స్థిరచిత్తతనీ మన సాహిత్యం ప్రోత్సహించాలి. అభ్యుదయ సాహిత్యమంటే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ప్రతీకగా నిలచేదే! పేదల కవోష్ణరుధిరంతో పంకిలమైనసంపద తుచ్ఛంగానూ కడుహేయంగానూ పరిగణించేదే అభ్యుదయ సాహిత్యం! ...'

అంటూ సాగిన ప్రేమ్‌చంద్ ఉద్ఘాటన త్రికాలాబాధిత క్రాంతదర్శనానికి నిదర్శనంగా నిలుస్తుంది. ఆనాడే పీడిత వర్గాల హర్షాతిరేకాలకది ఆకరమైంది. యువ హృదయారవిందాలకు ప్రభాత భాస్కరద్యుతిలా సోకింది! భారతీయ మనీషను పులకింపచేసింది !! *



# ప్రస్థానగీతి

(గురుపాదులు శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి మిత్రులను స్మరిస్తూ)

- శ్రీ శనగన నరసింహస్వామి, ఎం. ఏ



*'కర్కశశిలయు నవజీవకళల దేర
మోడు మోక చివురులెత్తి మురువురూప
గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి'
పాడితివి నీవు స్వేచ్ఛాప్రబంధములను.

*ప్రాతపాటలె క్రమ్ముట పాడలేక
దారి తెలియక మానవ్రతమ్ము గొన్న
కొదమకోయిల లెన్నియో గొంతు విప్పి
పాడె నీ వెంట విశ్వమే పరవశింప!

*పాడుకొనుచునె మానసాభ్యంతరమున
కరుగుదెంచితి వపుడు పికాగ్రయాయి!
పాడుకొనుచునె నందన వాటివైపు
ఎగిరిపోయితి విపుడు గానైకలోల!

*తీయతీయని కవితల తీరులెఱుగ
వార్తపెట్టెనో యేమొ సుపర్వవిభుడు -
కల్పదళమున మదనలేఖను లిఖించి
పంపెనో యేమొ యూర్వశీ ప్రణయరాశి!

*మందారకుసుమైక మాలగైకొని రంభ
ద్వారదేశమ్మును జేరినిల్వ —
పారిజాతలతాంత పరిఫుల్లశయనీయ
సీమ నూర్వశి వేగ సిద్ధపఱచె —

మేనక సంతానసూన సంతానమ్ము
దోసిట భాసింప నొంగిచూచె —
హరిచందన ప్రసవాళి జల్లుల తిలో
త్తమ తీర్చె మెత్తగా దారినెల్ల —

విరహతాపాతిరేకత వేగ హారిణి —
మంజువేషము సవరించె మంజుఘోష —
కోకిలస్వామి! మామిడి కొమ్మదాటి
స్వర్గనగరమ్మునకు నీవు సాగువేళ!



# శ్రీనాథుని భాష - పదకల్పములు

- శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

1_6_2 'ఏని' అనుపదకల్పము భిన్నార్థములలో ప్రయోగింపబడుచున్నది.

1. 'ఏని' అను పదకల్పము సాధారణముగా చేదర్థకమును సూచించును.

ఇచ్చగలదేని గూర్చుండు మిందువచ్చి (ఎడల అని అర్థము) (శృం.నై 4_6)

ఇందఱుఁగొనిపోయి లేనివత్తు (హర 2_139)

వింటేని (శివ 2_106)

రజ్జువల్లరిమీఁద ప్రణయంబు గలదేని యంతరిక్షంబేలు (శృం.నై 4_7)

2. కొన్నియెడల నామమునకు విశేషణమునకు మధ్య 'ఏని' వాడుటచే విశేషణముయొక్క అర్థమునకు ఆధిక్యము కలుగుచున్నది.

పెద్దగాలమేనిఁ దపముచేసిన. (కాశీ 4_171)

పెద్దయేనిఁ జడవు (శృం.నై 4_117)

3. ప్రశ్నార్థక సర్వనామములకు 'ఏని' అను పదకల్పము చేరి అనిర్దిష్టార్థమునిచ్చుచున్నది.

'ఎందేని' : 'ఎందేని' యుం జనువాడ (ఏప్రదేశమునకైనను) (కాశీ 4.110)

ప్రవహించు 'నెందేని' భాగీరథీగంగ (కాశీ 7_147)

నారదుం 'డెందేని' యుం జనితెం. (కాశీ 1_106)

'ఎక్కడకేని' : 'ఎక్కడికేని' యుం జనుదురు. (కాశీ 2_79)

'ఎంతేని' : శీతాకాలం'బెంతేని'యు నిద్రవోదురు. (శివ 4_27)

లేవడి 'యంతేని' జీవనంబు. (శృం.నై 1_109)

'ఎన్నేని : వరము 'లెన్నేని'యూ పతివ్రతలకొసఁగి. (భీమ 5_55)

'ఇంచుకేని' : అంతరంగములఁ బ్రీతి యయుండర 'యించుకేని'యున్. (శృం.నై 3_115)

*'ఒండు' శబ్దములతోఁ గూడిన 'ఏని' వికల్పార్థమును తెల్పును.

విహారాపేక్ష 'నొండేని' ఘర్మనిరాసంబున. (కాశీ 5_45)

అష్టమీ భానువాసరంబందు నొండె 'నొండెనేని' చతుర్దశి' (భీమ 6_72)

5. 'ఏని' అనుపదకల్పము అనిశ్చయార్థము నిచ్చుచున్నది.

ఎద్దియేని యొకరంధ్రంబు చెప్పుడుంగాక (కాశీ 7_118)

1_6_3 వచ్యర్థధాతువైన 'అను'కు క్త్వార్థకరూపము 'అని' రెండు వాక్యము అను కొన్ని విశేషార్థములతో అనుసంధించుటకు ఈ 'అని' శబ్దము పదకల్పముగా ప్రయుక్తమగును.

1. పలికి, చెప్పి అనునర్థములలో :

పొదండు పొదం డని పోయిరి. (శృం.నై 7_122)

అప్పరమేశ్వరుని నిట్లని స్తుతియించిరి. (హర 6_72)

చూడుం డని మఱియు నిట్లనియె (కాశీ 2_10)

2 అవయవి సూచకముగ 'అని' వ్యవహరించును. ఇక్కడ ఇది క్రియ కాదు. క్రియ అయినచో సాధారణముగా కర్త ఉండును. ప్రముఖమైన సొంతఅర్థమేమి లేక వ్యాకరణ నిర్మాణబోధను ప్రధాన ప్రయోజనముగ గల శబ్దములు అవయవి సూచకములు 4 (construction maker.)

సురలు మునులు రాక్షసకృతావరోధ సంరంభ మింకఁ దమకు లేదని తెలిసిరి తత్త్వబుద్ధి. (భీమ 4_157)

ఇక్కడ 'అని'కి వచ్యర్థములేదు. అసలిక్కడ ఇది క్రియకాదు.

3. అనుకరణమునందును, ధ్వన్యనుకరణమునందును 'అని' అనుబంధముగా ప్రయోగింపబడును.

అతిం డుస్సు 'రని' నిజస్థానంబునకుం బోయి. (కాశీ 7_45)

చుట్టు 'ముని' మూర్ధములు దాఁకి (శృం.నై 6_130)

ఘుం ఘుం'అని' ఘలుగుమలిపంపు వలువల (భీమ 1_118)

ముట్టు'ముని' యుచ్చైర్ధ్వనిఁ గూతవెట్ట (కాశీ 7_70)

9. హేత్వర్థము :

విశత యేమి కారణమున దాస్యంబు వహించె నని యడుగుటయు (కాశీ 6_15)

తగవుగాదని రాడయ్యెఁ దాత వేల్పు (శృం.నై 4_129)

5 ఉద్దేశార్థము :

మాదివ్యత్వము నీకు నిత్తుమని సంభావింప. దీని స్థానమున 'అంచు' అనియు శృం. నై (4_43)

అంబిః కంచుఁ దెచ్చిన మహామణి సంఘము ప్రోగుచేసి (కాశీ 6_168)

6 వాక్యాలంకారము :

ఒక్కనాఁటిరాత్రి గతంబున నిట్లని వితర్కించితి. (కాశీ 1.6)

ఊనికయొక్క మార్పును బట్టి యీ పదకల్పములు పెక్కుభావములను ప్రకటించుటకు సమర్థములైయున్నవి

1_7_0 కిలార్థకము (Assertive Particle)

1_7_1 ఇందు_కద/_ కదా,_కదె/_ కాదే, _కదమ్మ, _కదయ్య, _కదవె/, _కదషే, _కదరా, _కదవయ్య_ అను పదకల్పములు సందర్భానుసారముగా ప్రసిద్ధి నిశ్చయము, సంతాపము, ప్రార్థనము, ప్రశ్న మున్నగువానిని సూచించును.

_కద : నిశ్చయమునకు : దారపరిగ్రహమే 'కద'సారపు ధర్మముల కెల్ల (హర 4_44)

ప్రసిద్ధికి : కలవారు మీరలే'గద' (ప. పీ 31)

_కదా : సంతాపమునకు : వైరమున కుంభి కుంభవి, దారణ దారుణ కృపాణ

ధారలు పరిభూతాకారములు కందమూలో
ద్ధారములకు బాలుపడెఁ 'కదా' నీకర
ముల్ (హర 7_28)

నిశ్చయమునకు : భక్తులకు భస్మమే
'కదా' ప్రాణరక్ష (హర 2_85)

ప్రశ్నమునకు : ఏదిహేతువు దప్ప
నాడఁ 'కదా' (శృ. నై 4_91)

ప్రసిద్ధికి: ఈశరీరంబు పరోపకారా
ర్థము 'కదా' (శృ. నై 2_57)

ఆశ్చర్యార్థకము : పుట్టించినవాడు
కుసుమశరుఁడు'కదా'! (హర 3_91)

_కదా : సార్థకమునకు : మేలుకొనఁ
'కదా' రాజన్యమానలక్ష్మి (శృ. నై8_13)

_కదే : ఆశ్చర్యము : నీవెంతేదవ్వు
గ నేఁగు దెంచితి ''దే' యేలమ్మ
(శృ నై 2_47)

_కాదే : ప్రశ్నమునకు : గరిమమై
నుండనికొప్పు'గాదె'? (శృ. నై 3_126)
గరుడుండు మోమోటఁ 'గాదె ?'
(శృ. నై 2_108)

_కాదే : నిశ్చయము : సర్వకార్య
కార్యహారమగుఁ 'గాదే' (హర 6_26)

_కదమ్మ: ప్రసిద్ధి: గోదావరితల్లీ, సం
పాదించు 'గదమ్మ'నీవు, భవ్యశుభంబుల్.
(భీమ 4_169)

_కదయ్య : ప్రార్థనము : కృపఁ
దలంప 'గదయ్య' యో నృపవరేణ్య
(శృ. నై 1_109)

ప్రశ్నము : అదనుఁదప్పిన దలఁగి
యంతింపనున్న, వారలేరు 'గదయ్య'మీ
వంగడమున ? (కాశీ 7_191)

_కదవె : ప్రార్థనము : నన్ను గౌగి
లింపగఁ 'గదవె' (కీడా 95)

_కదవే : ప్రార్థనము : అనుగ్రహింప
'గదవే' ? నీరేజపత్రేక్షణా !
(శృ. నై 8_52)

_కదరా : సంబోధనార్థకము : గాలె
ఱుకున గొంటలిడియుట, చీటంబున పెడ్డ
యెల్లఁ జెలఁచితి 'కదరా' (హర 7_52)

_కదయ్య : ప్రార్థనమునకు : కావఁ
'గదవయ్య' యర్థార్థికల్పశాఖి
(శృ. నై 1_109)

1_8_0 కొన్ని ఇతర అవ్యయములు :
(Indeclinables)

1_8_1 _కాక / _కాని యను నవ్యయ
ములకు వ్యంజకత్వము పెక్కురీతులుగా
కనిపించును.

1_8_2 _కాక అను నవ్యయము అగు
ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూ
పము. ఈ సందర్భానుసారముగ పెక్కు
విధముల ప్రయోగింపబడుచున్నది.

1. వికల్పార్థము : వరము వేడిన వేఁడ
వచ్చుఁ 'గాకబ్బంగి' (కాశీ 3_224)

2 కాని అనుఅర్థము : పురావిహిత
కర్మం బెట్టిదో 'కాక' ఆత్మజ,కాలుష్యము
రాజయక్ష్మమును ఇక్కం బెట్ట లేఁడయ్యె
డున్. (శృ నై 8_185)

నీలకంఠుఁ డింతచేసె నుగాక తాదేమి
ప్రాంతి. (భీమ 2_114)

3. అంతమాత్రమే కాని అనునర్థమును
దెలుపును : కొందఱు, నిజుమపరులు
పాదసరసిజయుగళ ప్రసాద మాత్ర
మబ్బెదరు 'గాక' మన భాగ్య మల్ప
మగునె. (హర 2_42)

4. ఆశీర్వాదమును తెలుపును : ఉత్తర
కర్మం బవిఘ్నం బగుం 'గాక'.
(శృ. నై 4_110)

కుసుమవర్షంబు మీమీద కురియుఁ
'గాక'. (శృ. నై 2_94)

5. శాపమును తెలుపును : మూఁడు
తెరువులఁ జెడు 'గాఁక' మోక్షలక్ష్మి.
(కాశీ 7_158)

6. అన్యార్థనిషేధమును తెలుపును :
అలుమగడును నొకటత్తుకైనఁ 'గాక'యిట్టి
ధర్మంబు మిన్నక యేలకలుగు(హర2_60)

7. నిశ్చయమును తెలుపును : భూభు
జుల తప్పెయరివారిఁబొంగియున్న,ధరణి
సామ్రాజ్యభూతంబు తప్పు'గాక'
(కాశీ 4_202)

8. కాంచారానుజ్ఞను తెలుపును :
ప్రాధిపరికింప... ఎవ్వరేమన్న వంద్రు
'గాకే' మి కొలత. (భీమ 1_15)

9. అక్కుపెట్టక అనునర్థమున : లావు
ననురుండి పాణిపల్లవయుగమున, నొత్తి
పట్టినసరకు గాకల్లసమున (శృ. నై7_179)

10. అదనముగా నను నర్థమున: ఎవ్వ
నికే మనోవికారంబు పుట్ట కుండునే ?
(కాశీ 4_201)

11. కాకేమి_ నిశ్చయార్థకము : ఏ
మన్నవనియెఁ గాకేమి మాయేలిక.
(కాశీ 6_221)

1_8_3 _కాని అను అవ్యయము అగు
ధాతువుయొక్క వ్యతిరేకార్థక విశేష
ణము.

1. సంభవింపని, తగని మొదలగు నర్థ
ములను దెలుపును. కాక మనబోంట్ల
కల్లనుకాని బ్రతుకు (తగని బ్రతుకు)
(భీమ 2_159)

2. తక్క అను నర్థమును తెలుపును.
దీనికి తరువాతివచ్చు క్రియ వ్యతిరేకార్థ
ముగ నుండును.

చక్రఘోషమున నించుక యించుక
గాని యంత యేర్పడ విననైతి...
(శృ. నై 2_58)

అనేకలోకంబులఁ గడచి కాని వైకుంఠ
పురంబునకుం బోవరాదు (కాశీ 3_128)

3. పూర్వోక్తవిరుద్ధమగు నర్థమును
స్ఫురింపచేయును.

జలదకాళిమఁ జూపంగఁ జాలెఁ గాని
సహజకాళిమఁ జూపంగఁ జాలదయ్యె
(శృ. నై 8_127)

4 'కానీ' వికల్పార్థమును తెలుపును.
నను గానీకంథు'గానీ'రమేశ్వరు గానీ...
(కాశీ 2_9)

(తరువాయి 17 వ పేజీలో)

# శ్రీమద్రామాయణము - యోగదర్శనము

- శ్రీ భారతీ పిళ్ళ

శ్రీమద్రామాయణమునందు ఋష్యశృంగుడు, దశరథుడు, జనకుడు, విశ్వామిత్రుడు, ఆంజనేయుడు, రావణుడు మున్నగు పాత్రల వృత్తాంతమును సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు అందలి యోగపరమార్థము బోధపడును. దీనికి ముందుగా కవియైన వాల్మీకిని గూర్చి ధ్యానము చేసినపుడు కూడ ఇట్టి యోగదర్శనమే కలుగును. వాల్మీకి అనగా వల్మీకము నుండి పుట్టినవాడు. అనగా పుట్టనుండి పుట్టినవాడు - పాము అని అర్థము వచ్చును. దీనికి మనవారు చిన్నకథ చెప్పుదురు. వాల్మీకి పూర్వాశ్రమమున కిరాతుడని, నారదోపదేశమున తపస్సు చేయుట మొదలిడగా కాలము గడచిన కొలది అతని చుట్టును పుట్టలు పెరిగినవనియు పిమ్మట జ్ఞానియై, తపస్వియై ఆపుట్టలనుండి వెలువడుటచే వాల్మీకి మహర్షిగా పేరుపొందెనని, చెప్పుదురు. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించినచో భార్యా-బిడ్డలకై మనము చేయు, మోసములు, కుట్రలు, దురాచారములు, అత్యాచారములు మున్నగునవియే మన కిరాతజీవితము. మన భాగ్యవశమున నార-ద అనగా నారాయణుని గూర్చి ఉపదేశమిచ్చి భగవద్భక్తిని మనకు అనుగ్రహించు ఒక గురువు లభించినచో మనము జీవితము ఒక తపస్సుగా పండించు కొన్నచో ఈశరీరమే ఒక పుట్టవంటిదని మనకే అనిపించును. అపుడు మనకు ఇతరులకు సంబంధించిన దేహభావము వదలి అందరియందు ఉన్నది నారాయణుడొక్కడే అను పరమాత్మ జ్ఞానముతో జ్ఞానులమై మనము జీవింపగలుగుదుము. అపుడు ఈదేహమనెడి పుట్టలో అంతవరకు చుట్టలు చుట్టుకొని నిద్రించియున్న పామువంటి దివ్యచైతన్యము జ్ఞానస్వరూపమై మననుండి వెలువడును. ఇట్టిపాము వంటి దివ్యచైతన్యమునే మనవారు యోగశాస్త్రమున కుండలిని అని పేర్కొనిరి. దాని మేల్కొల్పుటకు కుండలినీ ప్రబోధము అని పేరిడిరి. ఇట్లు కుండలినీ ప్రబోధము జరిగి జ్ఞానియైన వ్యక్తియే వాల్మీకి అని అనిపించుచున్నది కదా. అప్పుడు అతనికి లోకవృత్తాంతమంతా రామాయణమై దర్శనమిచ్చును గదా.

ఈ దృష్టితో మనము ఋష్యశృంగుడు, దశరథుడు, జనకుడు, విశ్వామిత్రుడు హనుమంతుడు, రావణుడు మున్నగు పాత్రలను ధ్యానించినచో ఆమహర్షి వాల్మీకి అనుగ్రహవిశేషమున రామాయణ యోగదర్శనము మనకు కూడ కలుగును. శ్రీమద్రామాయణమునందు నాయికా నాయకులు సీతా, రాములు. సీత తండ్రి జనకుడు. శ్రీరాముని తండ్రి దశరథుడు. వీరిద్దరు సీతారాముల సంయోగమునకు ప్రధాన కారకులు. శ్రీరామునిచే శివధనుర్భంగము చేయించి సీతారాములకు వైవాహిక సంయోగము సమకూర్చినవాడు విశ్వామిత్ర మహర్షి. మరి సీతారాములకు పునఃసంయోగము సమకూర్చిన మహానుభావుడు హనుమంతుడు. అసలు శ్రీరాముని అవతరణమునకు దశరథునిచే పుత్రకామేష్టి చేయించిన లోకోత్తర చరితుడు ఋష్యశృంగుడు. ఆయా పాత్రలను గురించి మనము సూక్ష్మదృష్టితో పరిశీలన చేయుదము.

ఋష్యశృంగుడు :-

ఋష్యశృంగుడు అనగానే నెత్తిన కొమ్ముగల వింతరూపము గోచరించును. ఋషి అనగా చూచువాడు. (ఋష్-చూచు) ఋష్యశృంగుడు అనగా చూడబడిన శృంగము, శిఖరాగ్రము కలవాడు. యోగపరమార్థమున ఈశిఖరాగ్రమనగా సహస్రారము అని అర్థము. సహస్రారమందు సుప్రతిష్ఠమైన ప్రజ్ఞ కలవాడు కావుననే ఆయన దశరథుని చేత పుత్రకామేష్టి జరిపించి శ్రీరామ జననమునకు దోహదము చేసినాడు. ఈవిధముగా శ్రీరామావతారములోని యోగపరమార్థము ప్రారంభమగును.

దశరథుడు అనగానే పదిరథములు కలవాడా ? అనిపించును. కాదు. దశదిక్కుల ప్రయాణించు రథము కలవాడని అర్థము. భూమిమీద ఎనిమిది దిక్కుల రథము పోవుట మనకు తెలిసిన విషయమే. కాని పైకి ఆకాశముమీదకు స్వర్గంలోనికి రథముపోవుట ఎట్లు ? అని సందేహము కలుగును. హృదయములోనున్న జీవుని ప్రజ్ఞ శిరస్సువరకు పోవుచున్నట్లే అని గ్రహింపవలయును. యోగసాధన చేత హృదయమునందు పనిచేయుచున్న దివ్యప్రజ్ఞను సహస్రారమువరకు కొనిపోగలిగినచో ఇట్టి ఆకాశగమనము సాధ్యపడును. ఇట్లు సహస్రారము చేరిన ప్రజ్ఞ కలవానిని ఎవ్వరును యుద్ధమున ఓడింపలేరు. వాని రాజధానిని అయోధ్య - యోధులకు ఎదిరింపశక్యముకానిది అని అందురు. ఇట్టివాని కుమారుడు గనుకనే శ్రీరామునకు అయోధ్యారాముడు అని పేరుగలిగినది. అనగా సహస్రారమునందు ఉన్న ఆత్మప్రజ్ఞ ఈవిధముగా యోగసాధన చేయు జీవుడు దశరథుడు. అతని శిరస్సునందలి సహస్రారము అయోధ్యకాగా అందు శ్రీరాముడు అవతరించుటతో అనగా ఆత్మజ్ఞానము కలుగుటతో శ్రీరామావతార ప్రయోజనము ప్రారంభమగును.

విశ్వామిత్రుడు :-

ఈయన పేరును బట్టియే విశ్వమునకు మిత్రుడు అని తెలియుచున్నది. అనగా లోకకళ్యాణకార్యములు గావించువాడని అభిప్రాయము. ఆయన జరపించిన శ్రీరామకళ్యాణము రావణ సంహారము ఎట్లు లోకకల్యాణముగా పరిణమించినదో మనకు తెలిసినదే. సీతతో కళ్యాణము

చేయుటకై విశ్వామిత్రుడు శ్రీరాముని ఎట్లు చేపట్టి క్రమశిక్షణ నిచ్చినాడో పరిశీలించినచో రామకథలోని విశ్వామిత్ర పాత్రలోని యోగపరమార్థము బోధపడును. విశ్వామిత్రుడు తాను గావించు యాగరక్షణకై దశరథ మహారాజు వద్దకు వచ్చి అప్పటికి బాలుడైన శ్రీరాముని తమ్మునితోపాటు తనవెంట పంపుమని కోరినాడు. దశరథుడు తాను చతురంగ సైన్యసమేతుడై వచ్చెదనన్నను తిరస్కరించినాడు. ఇట్టి పరిస్థితిలో శ్రీరాముడు మిన్నకుండినాడు. మాట వరుసకు మన ప్రక్కయింటి పెద్దమనిషి వచ్చి మా యింటిలో పాము వచ్చినది, మీపిల్లవానిని పంపుడు అని అడుగునా? ఆతండ్రి వచ్చెద నన్నచో రావలదనునా! పిల్లవాడు కిమ్మనకుండునా! మరి శ్రీరాముడు విశ్వామిత్రుని వెంట వెళ్ళుటలో అంతరార్థమేమి? ఇందేదో పరమార్థమిమిడియుండునని స్పష్టముగ తోచుచున్నది గదా! విశ్వామిత్రుడు శ్రీరాముడు కలిసి లోకకళ్యాణమునకు పూనుకొనినట్లు ఈసుప్రభాత శ్లోకము నిరూపించుచున్నది.

శ్లో॥ 'కౌసల్యా సుప్రజా రామ
పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల
కర్తవ్యమ్ దైవ మాహ్నికమ్'

ఈవిధముగా శ్రీరాముని దైవకార్య నిర్వహణము చేయు పురుషోత్తమునిగా మేలుకొలుపుటలో శ్రీరామజనన పరమార్థము విశ్వామిత్రునకు తెలిసినట్లే గదా! అందుకే ఆమహర్షి శ్రీరాముని సుగుణాభిరామునిగా ఎట్లు తీర్చిదిద్దినాడో చూడుడు.

రామలక్ష్మణులను వెంట బెట్టుకొని పోవుచుండగా తాటకి అను రాక్షసస్త్రీ ఎదురయ్యెను. విశ్వామిత్రుడు ఆమెను చంపుమని శ్రీరాముని ఆజ్ఞాపించెను. రాముడామెను సంహరించెను. ఆపిదప వారి ప్రయాణమధ్యమున అహల్య అను తాపసస్త్రీ తటస్థపడెను. రామపాద స్పర్శచే ఆమెను పవిత్రురాలిని చేయుమని విశ్వామిత్రుడు శ్రీరాముని నాదేశించెను. అతడట్లే చేసెను. ఆపిమ్మట మిథిలానగరమున శివధనుర్భంగము చేయుమని విశ్వామిత్రుడు శ్రీరామున కుపదేశించెను. రాముడట్లే చేయగా సీత అను దివ్యస్త్రీతో వివాహమయ్యెను. ఈవిధముగా విశ్వామిత్ర గురు సన్నిధిలో శ్రీరామునకు ముగ్గురు స్త్రీలతో మూడు విధములైన సంబంధమేర్పడెను. వారు వరుసగా తమస్సు, రజస్సు, సత్త్వము అను మూడుగుణములకు ప్రతినిధులు. తమోగుణమైన తాటకిని సంహరించెను. రజోగుణమైన అహల్యను సంస్కరించెను. సత్త్వగుణమైన సీతను స్వీకరించెను. ఇట్లు సీతను పెండ్లాడి కళ్యాణరాముడయ్యెను. ఈవిధముగా శిష్యునకు ఇంద్రియజయము సిద్ధింప చేయుటకై గురువు అనుగ్రహించు క్రమశిక్షణగా విశ్వామిత్రపాత్ర పరమార్థము శ్రీరామ యోగజీవితము నందు మనకు దర్శనమిచ్చును.

జనకుడు :-

ఈ పేరునకు తండ్రియను నర్థము. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుటచే అట్టి రాజునకు జనకుడు అను పేరు కలిగెను. అతనికి విదేహుడు అనికూడ వ్యవహారము కలదు. అతని రాజధాని మిథిల. ఈ పేర్లు విచిత్రముగా నున్నవి గదా! ఇతడు యజ్ఞమునకై భూమినిదున్నింపగా నాగటిచాలులో సీత లభించెను. ఇట్టి జన్మ చరిత్ర విశేషము గదా! ఇవన్నియు యోగపరమార్థమును సూచించుచున్నవి. దేహమును రంజింపజేయు జీవుని రాజు అందురు. రాజునకు రాజ్యము దేహము వంటిది. అట్లైనచో! అతడు రాజుగా కొంతకాలము పరిపాలనచేసి ఋషికావలసియుండును. రాజర్షులైన జనకాదులు అట్టివారుకారు. వారు తమ దేహములకు అనగా రాజ్యములకు తండ్రిగా నుండి పోషణబాధ్యత స్వీకరించిరి. ఆ దేహము తమదని మమకారపడలేదు. కనుకనే విదేహులు (దేహములేనివారు) అనిపిలువబడిరి. వారు ఆధ్యాత్మ జ్ఞానముచేత ధ్యానయోగముచేత నిత్యము దేహమును మథించుచుండిరి. కనుకనే వారి రాజధాని మిథిల యనబడెను. జ్ఞానము నాగలి వంటిది. నాగలిచే భూమిని దున్నినట్లు జ్ఞానముచే శరీరము సంస్కరింపబడును. అట్టి దేహమునుండి వెలువడిన దివ్యచైతన్యమే మనస్సు. అదియే సీతామహాదేవిగా వర్ణింపబడినది. ఆమె శివధనుర్భంగము చేసిన శ్రీరాముని పెండ్లియాడినది. శివధనుస్సు అనగా మనస్సే. దానిని జీవితమున కవసరమైనట్లు వినియోగించుకొనుటయే శివధనుర్భంగము. ఆత్మస్థితి నందినవాడే ఇట్లు చేయగలడు. దీనిని బట్టి సీతారాములనగా మనస్సు ఆత్మయని తెలియుచున్నది. వారి దాంపత్యరూపమైన, వీనిసంయోగముచేతనే మన శరీరములు పనిచేయును. రామాయణ పరమార్థమును దర్శించుటకు అవకాశము కల్గియున్నవి. ఎవడు తన దేహమును మథించుకొని జనకుడగునో వానికి శ్రీరాముని రూపమైన ఆత్మజ్ఞానము అల్లునివలె లభించును. ఈవిధముగా సీతారామ సంయోగమును తన జీవితమున యోగసిద్ధిగా అనుభవించిన రాజయోగి జనకుడు.

(సశేషము)

# తెలుగువారు హిందీ భాషాసేవ

- శ్రీ వెలుదండ నిత్యానందరావు.

తెలుగువారు అన్నిభాషలతో పాటు హిందీని కూడ నాదరించిరి. తమిళనాడు హిందీని తీవ్రముగా ద్వేషించి ఉద్యమములు నిర్వహించుచున్నను, దాని ప్రభావము పొరుగున నున్న ఆంధ్రదేశము పై నిసుమంతయు పడకపోవుట ఆంధ్రుల పరభాషా సహనమునకు చక్కని తార్కాణమని చెప్పవచ్చును.

సంస్కృత ప్రాకృతముల పిదప నాంధ్రులు ఈ హిందీ భాషకే ఎక్కువ సేవ చేసినారని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఆంధ్రుడై హిందీ ప్రాంతంలో మత శేతనారోహణం గావించిన వల్లభాచార్యులు (1473–1531) ఆంధ్రదేశంలోని కాకరపాడు గ్రామంలో జన్మించి మధురలో స్థిరపడ్డాడు. వర్గవిచక్షణ, స్త్రీ పురుష, భేదం లేకుండ సర్వులు భగవంతుని పరిశుద్ధమైన ప్రేమతో పూజించవలెనని బోధించాడు. దీనిని పుష్టిమార్గ అంటారు. ఇంకా తమ కమనీయ కవితాగానంతో హిందీ ప్రజల్ని రసానందసాగర తరంగాలలో నూయలూగించిన సూరదాసు, నందనార్ (దాస్?) లు ఆంధ్రసంతానము. వల్లభాచార్యుల పుత్రుడైన గోస్వామి విఠలనాథుడు హిందీలో తొలిగద్యరచయిత. ఇంకా పద్మాకర భట్టు, బాల్‌కవి అని పేరు గడించిన గోకులాల్ ఆంధ్రులే.

1884 లో 'నేషనల్ థియేటర్' సంస్థాపకులైన దాసాని వెంకటస్వామి మున్నగు వారికి హిందీలో నాటకములు వ్రాయించి ప్రదర్శించవలెనని తలంపు కల్గినది. వారి సలహా ననుసరించి నాదెళ్ళ పురుషోత్తమకవి ముప్పదిరెండు హిందీ నాటకములు రచించి స్వయముగా దర్శకత్వము నెరపారు.

వెదురుమూడి శేషగిరిరావు శివాజి చరిత్ర మున్నగు చారిత్రక హిందీ నాటకములు రచించి ప్రదర్శించారు. మింది రామారావుగారు హిందీ నాటకముల కొరకే 'భక్తివిలాసినీ సమాజము' స్థాపించారు.

దీనివలన ఆంధ్రులు హిందీ నాటకరంగమున కనలేని సేవ చేసిరని తెలియుచున్నది.

తులసీదాసు 'రామచరితమానస'మును మండా కామయ్య, శిష్టు కృష్ణమూర్తి గారు తెనిగించిరి. వీరు హిందీ ఛందస్సులకు స్వతంత్రాక్షర ప్రాసలు, తెనుగు యతి నియమాలు జత చేయుట గమనించ వలసిన విషయము.

ఏభాష యయినను విస్తృతి పొందవలెనన్నను, సుసంపన్నము కావలెనన్నను యన్యభాషలోని శిష్టసాహిత్యము ఈ భాషలోనికి, ఈభాషలోని సాహిత్యము ఆభాషలోనికి అనువాదములు జరుగవలెను.

అట్లూరి పిచ్చేశ్వరరావు, చావలి రామచంద్రారావు ప్రభృతులు ప్రేమచంద్ నవలలను, శ్రీ ఘాయేశ్వర్ గారు జయ శంకర్ ప్రసాద్, కిషన్‌చందర్ రచనలను అనువదించారు.

అనువాదములే గాక స్వయముగా హిందీలో రచనలు చేసిన యాంధ్రులు కూడ నున్నారు. ఆరిగపూడి రమేశ్ చౌధరి గారు హిందీలో దాదాపు ఇరువది నవలలు, అసంఖ్యాకమైన కథలు రచించి కీర్తి గాంచినారు. 'పతితపావని', 'ఉధార్ కే పంఖ్' ఇత్యాది నవలలు, బంద్ ఆంఖే మొదలగు కథా సంకలనములు రచించినారు.

బాలశౌరిరెడ్డిగారు 'లకుమ' శబరీ, బారిస్టరు, మున్నగు నవలలు, తెలుగులోని కొన్ని రచనలను 'ఆంధ్రభారతీ' అను పేర ననువదించి హిందీ ప్రజలకు అందించినారు.

'విహాగ్ కే గీత్' కవితా సంకలనకర్త శ్రీ వారణాసి రామమూర్తి గారు పేరు గడించిన హిందీ విద్వాంసులు. వేమనను గురించి సమగ్రముగ హిందీవారికి తొలిసారిగా పరిచయము చేసిన ఘనత శ్రీ వారణాసి రామమూర్తి గారికి దక్కుతుంది. వీరు రేడియోలో ప్రస్తుతం 'భారత భారతి' అను శీర్షికను నడుపుచున్నారు. ఇంకా వీరు 'ఆదాన్ ప్రదాన్' అను వ్యాససంకలనంలో తులనాత్మక పరిశీలనం గావించినారు. ఇది తెలుగు వారు హిందీలో చేసిన ప్రథమయత్నము.

హిందీలో పరిశోధన చేసి డాక్టరేటు పొందిన ఆంధ్రులు దాదాపుగా పలుబది మంది కలరు. వారినందరని పరిచయము చేయవలెనని కోరికయున్నను వ్యాస విస్తరభీతిచే పేర్కొనజాలను. అయినను కొందరని గురించి తెలుపుకొందను.

తెలుగు–హిందీ రూపకములను తులనాత్మకముగా పరిశీలనము గావించిన డాక్టరేట్ పొందిన శ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారు హిందీలో డాక్టరేట్ పొందిన ప్రథమాంధ్రులు. వీరు హిందీలో వెలసిన విశిష్టకావ్యమగు 'కామాయని'ని తెలుగువారికి అనువదించి అందించినారు. 'కామాక్షీ విలాసము' అనే హిందీకావ్యము రచించి రచించి 'కవిరత్న' బిరుదును గ్రహించిన ఘనులు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని హిందీ శాఖాధ్యక్షులు శ్రీ జి. సుందరరెడ్డిగారు 'హిందీ ఔర్ తెలుగు–ఏక్ తులనాత్మక్ అధ్యయన్'లో తెలుగు హిందీ సాహిత్యములను లోతుగా పరిశీలించినారు. ఇంకా

వీరి ఇతర రచనలు దక్షిణ్ కీ భాషాయేం తథా సాహిత్య', 'మేరే విచార్', సాహిత్య ఔర్ సమాజ్' ముఖ్యమైనవి.

'హిందీ-తెలుగు రామాయణముల'పై పరిశోధించి Ph.D పొందిన డా|| చావలి సూర్యనారాయణమూర్తి గారు పెక్కు నాటకములు రచించిరి. సత్యమేవజయతే' మహానాశ్ కీ ఓర్' మున్నగు పౌరాణిక నాటకములే గాక 'సమస్యా' అను సాంఘిక నాటకమును కూడ వెలయించారు.

'సాహిత్య కే అభిరుచి తథా సమీక్ష' అంశంపై యస్. టి. నరసింహాచారిగారు డాక్టరేట్ తీసుకున్నారు. సౌందర్య తత్వ నిరూపణ్. వీరి ముఖ్యమైన ఇతర గ్రంథము.

'దక్షిణభారత హిందీ ప్రచార్ సభా' కార్యదర్శి శ్రీ కమూరి రాధాకృష్ణమూర్తి గారు 'నాగార్జున సాగరం' అను బుఱ్ఱ కథను తెలుగుఫక్కీలో రచించారు.

డా|| భీమసేన్ నిర్మల్ గారు నాదెండ్ల పురుషోత్తమకవి రచించిన నాటకములనుగూర్చి 'తెలుగు భాషా హిందీ నాటక్ కార్ పురుషోత్తమకవి' అను పేరుతో నొక గ్రంథము వెలయింపజేశారు. వీరు హిందీ సాహిత్యమును తెలుగువారికి పరిచయం చేయుటలో ఎంతో కృషి చేయుచున్నారు. ప్రపంచ తెలుగు మహాసభ సందర్భములో శ్రీ ఇరవెంటి కృష్ణమూర్తి గారు, భీమ్ సేన్ నిర్మల్ గారు, 'తెలుగు ఉత్తర భారత సాహిత్యాలు' అను పేర నొక చక్కని గ్రంథమును వెలయింపజేశారు. ప్రస్తుత వ్యాసమున కెక్కువగా తోడ్పడిన గ్రంథములలో నిదికూడ నొకటి గ్రంథ రచయితలకు నాకృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

శ్రీ యస్. దక్షిణామూర్తి గారు 'హిందీ ఔర్ తెలుగు కహావతోంకా తులనాత్మక్ అధ్యయన్' అను పరిశోధన గ్రంథమును రచించి 'హిందీ సాహిత్య సమ్మేళన్' అలహాబాదు వారిచే 'సాహిత్య మహోపాధ్యాయ్' బిరుదమందిన విద్వాంసులు. వీరి గ్రంథమును 1966 లో సంజన్ కూడ ప్రకాశన్ వారు ప్రచురించిరి.

కామమూరి వీర వెంకట లక్ష్మీ నరసింహారావుగారు ఆగ్రా విశ్వవిద్యాలయము నుండి 'తెలుగు ఔర్ హిందీ లోకోక్తియాఁ' యను అంశంపైని Ph.D పట్టా గ్రహించిరి. దీనిని మైసూరు భారతీయ భాషాసంస్థ ప్రకటించెను.

వై. వెంకటరమణారావు గారు 'తెలుగు ఔర్ హిందీ లోకోక్తియాఁ' యను విషయము మీద 1962 లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి Ph.D పొందిరి.

శ్రీమతి పజాలున్నీసా బేగం గారు 'తెలుగు ఔర్ హిందీ క్రియాకత్ ప్రయుక్త మహావిరె' యను నామముతో నసమాన పాండితీ పటుత్వముతో, సునిశిత మేధా శక్తితో తెలుగు హిందీ నుడికార విశేషములను పరిశోధించి 1973లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి Ph.D గైకొన్నారు.

నేటి విదేశాంగ శాఖమంత్రి శ్రీ పాములపర్తి వెంకటనరసింహారావు గారు బహుభాషాకోవిదులు. వీరు కీ||శే|| శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు' నవలను 'సహస్రఫణి' అను పేరుతో హిందీలోనికి అనువదించినారు.

ఈవిధముగా ఆంధ్రులు హిందీనికూడ నాదరించిరి.

—•••—

( 13 వ పేజీ తరువాయి )

శ్రీనాథునికాలము నాటికి పైవిధముగా పదకల్పములతీరు తెన్నులు కన్పించుచున్నవి. ఈవిధమైన పరిణామము నన్నయ, నన్నెచోడ, తిక్కనల భాషయందు అరుదు. *

ఆధార గ్రంథములు

1. Krishna murthi, Bh,: Konda or Kubu A Dravidian Language.

2 Ramachandra Rao,B: A Descriptive Grammar of Pampabharata.

3 Subrahmanyam, P.S.: Dravidian verb Morphology.

4. William Bright . An out Line of Colloquial Kannada

5. మహాదేవశాస్త్రి, క : కావ్య భాషాపరిణామము - తెలుగుభాషాచరిత్ర.

6. రామశాస్త్రి, ఎస్. వి, : శ్రీనాథుని భాషా-వర్ణనాత్మక విశ్లేషణము.

7. రామారావు, చేకూరి : తెలుగులో 'అని' చేసేపని- అక్షరార్చన.

సంకేత పదవివరణము

కాశీ : కాశీఖండము.
క్రీడా : క్రీడాభిరామము.
ప. వీ : పల్నాటి వీరచరిత్ర (బాలచంద్రుని యుద్ధము)
భీమ : భీమఖండము.
శివ : శివరాత్రి మాహాత్మ్యము.
శృ.నై : శృంగారనైషధము.
హర : హరవిలాసము

* చేకూరి రామారావు : 'తెలుగులో 'అని' చేసేపని'- అక్షరార్చన- 1972. పుట 253.

—•••—

# డాడాయిస్టు కవిగా పఠాభి

- శ్రీ కె. వెంకట్రామయ్య, ఎం. ఏ.

నవ్యాంధ్ర సాహిత్యంలో తాలోత్తాలంగా లేచిన కవితోద్యమం భావకవిత్వం. రాయప్రోలు, కృష్ణశాస్త్రిగార్ల ప్రభావం నుండి నాడు కలంపట్టిన ఏకవీ తప్పించుకోలేకపోయాడన్న మరి భావకవితను గూర్చి వేరుగా చెప్పనవసరం లేదు. అపారమైన ఆదరాభిమానాలకు గురియైన ఈ కవిత 'పోపో నీళ్లకం బల్చైంది. వాస్తవిక జగత్తుకు దూరమై_ కాల్పనిక జగత్తులో విహరిస్తూ_ 'దివి నుండి భువికి దిగిరాక' సామాన్యులకు దూరమవడం వలననూ, అంధానుకరణ ప్రబలి కేవలం ప్రతిధ్వనులు వినవస్తూ అకవిత్వం కవిత్వం ముసుగులో చెలామణి అవటం వలననూ_ ఈ కవితోద్యమం పై తిరుగుబాటు బయలుదేరింది. ఈ తిరుగుబాటుదారుల్లో ముఖ్యంగా పేర్కొనదగినవాడు పఠాభి. ఈయన తన 'ఫిడేలు రాగాల డజన్'తో జడప్రాయమైన తెలుగు కవిత్వానికి విద్యుచ్ఛికిత్స' (Shock treatment) చేశాడు

'As I lay on my bed and looked through the window, I saw the full moon surreptitiously puring the smoke filled sky. All the thousand metaphors I had read in the Bhava Kavitvam, in prabandhams and in Tagore's songs, suddenly lost all their meaning.'

I here by delare that Tristan-Tzara found the word DADA on February 8th, 1916, at 6P M I was present with my five children when Tzara uttered this word for the first time-filling us with justified enthusiasm. This took place in the Cafe Terrace in Zurich. I was putting a roll into my left nostril at the time. I am convinced that this word is not of the slightest importance and that only morous and Spanish Professors can be interested in dates. What interests us in the Dada spirit and we were all Dada before Dada ever existed.'[2] - అన్న Jean Arp పలుకులు 'డాడా' పుట్టుకను వివరిస్తాయి 1914_18 మధ్య జరిగిన ప్రథమ ప్రపంచసంగ్రామ ఫలితంగా ప్రపంచవ్యాప్తంగా సాంఘిక, రాజకీయ రంగాలలో అనూహ్యమైన పరిస్థితులు చోటుచేసికొన్నవి. యుద్ధరంగంలో కన్పించిన వాస్తవికత_ యుద్ధంలో పాల్గొన్న దేశాలు తమ ఆశయాలు తామే పాటించక సర్వవిధాల నైతిక పతనాన్ని పొందడం_ వ్యక్తి మేధస్సుమీద గొప్ప దెబ్బతీసింది. అస్తవ్యస్తమైన ఈపరిస్థితే కళారంగంలోనూ ప్రతిఫలించింది. రాజకీయ, సాంఘిక రంగాలలో నైతిక సమగ్రతను నిలపటంలో కళారంగం విఫలమైందని కళాకారులు భావించారు. వారిలో 'కళా ప్రయోజనం ఏమిటి? కళల్ని ఎందుకు సృష్టిస్తున్నాం?' అనే ప్రశ్నలు ఉదయించాయి. తత్ఫలితంగా సాంప్రదాయికంగా సృష్టింపబడుతూ వచ్చిన సాహిత్యం సాధించిన ప్రయోజనం ఏమీ లేదని, హేతువాదంకూడ లోపభూయిష్టమైందని, వీరు భావించారు. వీరికి భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పట్టింది. వర్తమానం అయోమయస్థితిని చూపించింది. ఈ నైరాశ్యస్థితి సమాజనాగరికతపై తీవ్రమైన క్రోధం, వైరం, కసి పెంచింది. Ibsan అన్నట్లు నాటికళాకారునిపని 'to move the boundary Posts' అయింది. 'It was finally left to the Dadaists, who emerged in the middle of a frutal war, to reflect accurately a growing sense of absurdity- of the fragmented nature reality and the total over throw not only of reason and traditional modes of thought but of faith in an cxistence dominated by order and accurately expressed by a precise systematic language -[3] అన్న విమర్శక వాక్యాలు నాటిస్థితికి దర్పణప్రాయములు. ఈవిధంగా ఆనాటి మత, సాంస్కృతిక, సామాజిక వ్యవస్థలమీద అసహనంతో, అసహ్యంతో ఆవిర్భవించిన ఈకళాత్మకవ్యవస్థకు ఒక సిద్ధాంతదృక్పథంగాని, నిర్మాణాత్మకధ్యేయంగాని లేవు. ఉన్నదల్లా పాతను ధ్వంసం చేయడమే. అందుకే 'Do not trust' Dada. Dada is every thing, But the real Dadas are against Dada' అంటాడు. Tristan Tzara. 1610 ఫిబ్రవరి 8న జ్యూరిచ్‌లో ట్రిస్టన్ టారా తాము ప్రారంభించిన నూతన కవితోద్యమానికే పేరు బాగుండునని ఆలోచించి. చివరకు-కళ్ళుమూసికొని ఫ్రెంచి_జర్మన్ డిక్షనరీ తెరవగా మొదట కన్పించిన పదం'DADA' ఈ పేరుతోనే అర్థరహితము,అరాజకము, నగు ఈనూతనకవితోద్యమాన్ని పిల్చిరి. త్వరలోనే యిది యూరప్‌లోని అన్ని దేశాలకు విస్తరించింది. రుమేనియాలో ట్రిస్టన్‌జారా, యార్కోలు జాన్కోలు, ఫ్రాన్స్‌లో జీన్ ఆర్ప్, ఫ్రాన్సిస్ పికాబియాలు, జర్మనీలో హ్యూగోబాల్, రిచర్డ్ హ్యూల్సెన్‌బెక్, ఎమ్మీ హెన్నింగ్స్, హాంస్ రిచర్‌లు, ఆస్ట్రియాలో వాల్టర్ సెర్నర్, యుక్రెన్‌లో మార్సెల్ స్లాడ్కీ, స్విట్జర్లాండ్‌లో సాఫీటిబర్ మున్నగువారు'డాడాయిజమ్' కు పట్టుకొమ్మలై నిలిచారు. వీరందరూ ఆనాటి సంకుచిత జాతీయతత్వంలో ఇమ

డనివారు. అంతే కాదు 'As individuals they were increasingly suspecious of social and artistic values which sanctioned or at best tolerated the brutality of war and the Soliprism of art' [4] అంటాడు C. W. E. Cigxy. ఈ విధంగా రూపుదిద్దుకొన్న డాడాయిజమ్ వస్తురహితము. అర్థరహిత వాక్యవిన్యాసము, అవ్యవస్థీకృత రచనాక్రమము, వికృతవీక్షణము, అయోమయములైన శీర్షికలు, గతినిరసనము, విధ్వంసక ప్రోద్బలము మున్నగు లక్షణాలని గర్భీకరించుకొని, సాహిత్యంలో ఒక అరాచక పరిస్థితిని సృష్టించింది. అయితే 1921 కల్లా యీ రూపు మాసింది. దీనిలోని విధ్వంసకతా వాదమే దీన్ని రూపు మాపింది.

కానీ పాశ్చాత్యదేశాల్లో ఏర్పడినంత 'ఇరుకుపరిస్థితి' తెలుగుదేశంలో ఏనాడును లేదు. 1935 నాటికి ఆంగ్ల సాహిత్యం ద్వారా ఈ అతినవ్యకవితాధోరణి తెలుగు సాహిత్యానికి పరిచయమైంది. అప్పటికి భావకవిత్వం తనఉత్కృష్టతను కోల్పోయింది. ఆ పేరుతో అకవిత చలామణి కాజొచ్చింది. దీనితో నాటియువకకవులు విసిగి తిరుగుబాటుధోరణి అవలంబించారు. అప్పుడే పట్టాభి భావకవిత్వంపై తిరుగుబాటు రూపక 'విధ్వంసక కవిత' యగు ఫిడేలురాగాలడజన్ రచించాడు.

పఠాభి పేరులోనే వైచిత్రి ప్రదర్శించాడు. ఆయన అసలుపేరు పట్టాభి రామిరెడ్డి. 'పట్టాభి'ని పఠాభిగా మార్చుకొనుటలో అతని నవ్యతాప్రీతి ప్రస్ఫుటమౌతుంది. కావ్యనామంలో కూడ చమత్కారం ప్రదర్శించాడు. ఫిడేలు అని వ్రాయటానికి బదులు ఫిడేలుబొమ్మ, దాని క్రింద రాగాలడజన్ అక్షరాలు ముద్రించారు. (ద్వితీయ ముద్రణ ముఖపత్రం కూడ వైచిత్రీయుతమే. 'బోగంచాన'ల రేఖాచిత్రాలు ముద్రితాలు). 'ఫిడేలు దేశీయమైన జంత్రముకాదు, పాశ్చాత్యుల్యది. ఫిడేలుమీద గాయకులు కర్ణాటక సంగీతముకూడ చక్కగా పలికిస్తున్నారు. దానిమీద మన సంగీతము పలికించటము సాహసకృత్యమనీ, అనుచితమనీ, సంగీత విద్వాంసులుగాని సామాన్యజనులుగాని అనుకోవడం లేదు. ఇక కవిత్వసాధనాల్లోకి ఫిడేలువంటి పాశ్చాత్యసాధనాలు తీసుకువస్తే పండితులకూ, పాఠకులకూ తగాదా ఎందుకు? గాయకుల కిచ్చిన స్వాతంత్ర్యం కవుల కియ్యకూడదా? ఈ విధంగా సూచించినాడు 'ఫిడేలురాగం' అనే చివరికావ్యంలోనూ, కావ్యసంపుటి నామకరణంలోనూ' [5] అంటారు శ్రీనోరి నరసింహశాస్త్రి గారు.

'మీవారద్దరు సనాతనాచార్ యుల్
ముఖమ్మొరిచి, ఇన్ గ్లీష్తానిని
నన్ను సెపరేట్ టవర్ దని
గద్ దిచ్చినా కూడ నీవు
మహాసాహసన్తో, రుమాన్టిక్ గా
మోహూరి జేసుకొన్నావు గదా! స్వీట్
హార్ట్ !'

'ఫిడేలురాగం' అన్న చివరి ఖండిక లోని ఈమాటల్లో పై అభిప్రాయమే వ్యక్తమౌతున్నది.

ఇది పంద్రెండు రాగాల సంపుటి. ఇందు మొదటి ఖండిక 'ఆత్మకథ'లో తన్నుగూర్చి, తన కవితా ధర్మాల్ని గూర్చి చెప్పుకొన్నాడు.

'ఎవ్వనిని యనుకొంటిరో నన్ను
ఏను పఠాభిని ......
కాంగ్రెసు రాష్ట్రపతిస్థానాని కోసం
బాబూ సుభాసుతో పోటీచేసి
ఓడిపోయిన డాక్టర్ పట్టాభిని
గాన్నేను, మరో పఠాభిని'

అని తనని పరిచయం చేసికొంటాడు. 'ఎవ్వరని యెంతురో నన్ను ఏనవంత శోకభీకర తిమిరలోకైకపతిని' [6] అన్న కృష్ణశాస్త్రిగారి భావకవితా పంక్తులకు మొదటి రెండుపంక్తులు హేళన. ఇక తర్వాత పంక్తుల్లో అప్రస్తుతమగు డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారివంటి ప్రఖ్యాత జాతీయనాయకుని ఎత్తిపొడిచాడు. అంతేగాదు డాక్టర్ పట్టాభికున్నంత ఉపజ్ఞ తనకు ఉన్నదట. గాంధీటోపి, జవహర్ జాకెట్ మీసాలు, లేకున్నా, పయిజమ్మాలు వేస్తాను కాబట్టి నన్ను మీరు సాదా సోషలిస్టని తిట్టకండి, ప్రఖ్యాతంగా ఉన్న కవిన్నేను- అని కుహనా రాజకీయవేత్తలపై దాడిచేస్తాడు. ఇది డాడాయిజమ్ లక్షణమే అయితే 'అక్కడక్కడ ఈ పద్యాలలో వచ్చునట్టి పఠాభి అను పేరు గల పాత్రకు, గ్రంథకర్తకు ఏమాత్రం సంబంధంలేదని గమనింపు. 'కృష్ణపక్షం' లోని 'కృష్ణ'కును గ్రంథకర్త నామంలోని 'కృష్ణ'కును ఎలాసంబంధం లేదో అలాగే' అని కవి తొలిమాటలు. ఆత్మకథలోని పై పంక్తులు, ఇవి పరస్పర విరుద్ధములు. పాఠకులకు ఒకవిధంగా అయోమయం కరిగించే లక్షణం యిది. భావకవిత్వం లోని ఆత్మాశ్రయతత్త్వానికి విధ్వంసక చర్య యిది. ఆత్మకథలోనే-

'నాకు విచిత్రంబగు భావాలుకలవు
నా కన్నులందున టెలిస్కోపులు
మయిక్రాస్కోపు లున్నవి'

అంటూ తన'కున్నదేమిటో' చెప్పాడు. కృష్ణశాస్త్రి గారు-

'నాకు గాములు లేవు నాకుషస్సులు లేవు
నేను హేమంత కృష్ణాంతశర్వరిని'

అని విషాదస్థితిని ప్రకటించిన దానికి పఠాభి హేళన పై వాక్యాలు. అంతేకాదు తనకవితా 'నగ్నత్వాన్ని' పై మాటల్లో ధ్వనింప చేస్తున్నాడు.

'నారచన పద్యాలనే దుడ్డుకర్రతో
పద్యాల నడుముల్ విరగదంతాను
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని
చాల దండిస్తాను
ఇంగ్లీషుభాషా భాండారంలోనుండి
బందిపోటుంజేసి కావల్సిన
మాటలన్నా దోస్తాను.
నాయిష్టం వచ్చినట్లుజేస్తాను
అనుకరిస్తాను నవీనపంథా, కానీ
భావాలవి వ్యాఘ్రముకాన్నే, నే
నహంభావకవిని.'

చిన్నయసూరివ్యాకరణాన్ని దండిస్తాననటంలో అతని విశృంఖలత్వం సాంప్రదాయిక కవితపై తిరుగుబాటు లక్ష్యాలం ప్రస్ఫుటమౌతాయి. వ్యాకరణంమాత్రం? కర్త, కర్మ, క్రియల అనుబంధం విధిస్తారు కాదూ? వీటికి నవకవి విడాకులిస్తున్నాడు. కర్తలేకుండా ఒక్క క్రియామాత్రమే నిరంకుశంగా విహరిస్తాం టే కొందరు కళ్ళు పొడుచుకుంటున్నారు. కాని కవి సర్వతోముఖ స్వాతంత్ర్యదూత. స్వేచ్ఛాదాత. అన్వయం అనాచ్ఛాదకంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా పికారుపోవచ్చును. 'ప్రతిఫలం విచిత్ర సౌందర్యం' 7 అంటారు శ్రీశ్రీ. పరాభిక విలువ ఈమాటలు వ్యాఖ్యానప్రాయాలు. *

1. ఫిడేలురాగాలడజన్. (ద్వి.ము.) Thirty years Ago పద్యం.

2. 'On my way'— Jean Arp

3. Dada and Surrealism— C.W.E. Bigsby. P. 24.

4. Dada & Surrealism. P. 14

5. ప్రతిభ - జూలై. 1940. ఫిడేలు రాగాలడజన్. (ద్వి.ము.)- p. 9.

6. కృష్ణపక్షము. p. 58



## ప్రతీక్ష

- శ్రీ ఎస్. వి. రాఘవేంద్రరావు,
ఎం. ఏ., బి ఇడి.

తెలుఁగుఁ దోఁట నాటిన సాహితీలతలను
బాదుచేసి, జలముపోసి, ప్రోదిచేసి
సరసగతి నేకరీతిని సాఁకుచున్న
తోఁటమాలి కేలనో! నేఁటితొట్రుపాటు.

నిచ్చలు కలకలలాడుచు
నచ్చపుఁదన్నునఁదలిర్చు వాతని ముఖమం
దచ్చిన వేదనగా విన
వచ్చెను వ్యాధగతవిషాదవచనము లెవియో!

'వ్యాస వల్లికయును, ...యవల్లరియును,
కతిల లేఁగయూ, నాటక లతిక యిటుల
పూఁతలైపువ్వులముఁ బొంపుఁగన, నొక్క
కావ్యలత పసుమిండని కతమిదేమి?

కరఁగున్ నెమ్మది నేఁడు మిక్కిలిగఁ బ్రా
   క్కాలంబునకి వెల్గిన
వ్యరసాస్వాదన భృంగముల్ గరసది
   వ్యానందమున్ గ్రోల, మే
దురకీర్తింగని దర్శనీయ యయి యాం
   ధ్రోద్యాన వాటిన్ సమా
దరమా పద్యమదు ప్రసూనముల త
   త్సాహిత్య వల్లిఁగనన్.

కరము పూచిన యొక నాటి కావ్యవల్లి,
మెండుగాఁ బూయ దొండును,
   రెండుఁదక్క
వానిపై నేఁడు సురభిళ శ్రీసుమములం;
ఇట్టిగతి గొడ్డువోవఁగా నేమికతము?

లోటు వాటిలె నేమొ నేఁటికోహాదమున!
   నేకరీతిని వాని సాఁకుచుంటి;
సమసిపోయినదేమొ సారగ్రహణశక్తి!
   వివరింపఁగా వది యొకరికెఱుక?

## ఉగాది - ప్రసాది

- శ్రీ పి. వి. యల్. సుబ్బారావు

ఏ ఉగాది ఏమి తెచ్చింది?
ఈ ఉగాది నీకేమి ఇచ్చింది?
ఉగాది ఆంధ్రులలో జీవకళ తెస్తుంది.
ఆంధ్రులకు జీవనకళలో నేర్పు నిస్తుంది.
చేదుని తీపితో కలిపి తినిపిస్తుంది.

కష్టాన్ని సుఖం అనుపానంగా
   ఆరగించమంటుంది.
నవ్యరుచులతో నవరసాలు అదిస్తుంది.
నీలో నీరసాన్ని తొలగించుకోమంటుంది.
నిన్ను నీ రసాన్ని పెంచుకో మంటుంది.

కోయిలకు అందము - అనాకారము
   ఆకారము - వికారము
కోయిల కంఠనాదము
   మకరంద ప్రవాహము
ఈ కవితం నీకు అర్థం కాకన్నా,
దానిలో ఆనందానికి అర్థం లేకన్నా
నీ—

అనుభూతులను, ఆశయాలను
ఆకర్షణీయంగా, అనుసరణీయంగా
అమర్చి. అలంకరించి,
నీకాతికి అందించమంటోంది.
నిన్ను ముందుకే అడుగేయమంటోంది.
మంచు తెరల్లో మంచినీటి బిందువులా,
కారు చీకటిలో కాంతి కిరణంలా,
నీకు తోడుగా నేనుంటా నంది.
ఉగాది - ఆశలకు ప్రసాది. *

సహృదయాదరణమ్ము సన్నగిల్లినదంచు
   నలుకఁ బూనెనో! కావ్యరసవల్లి;
మాత్సర్య వంతుఁడో మనుజాని తామసు
   దృష్టిదోషమ్ము ప్రాప్తించెనేమొ!
క్రొత్తవింతలు ప్రాఁతలు గోఁతలు గన!
నవ్య తెలుఁగరో! యీ కావ్య దివ్యశక్తి
పడయునో లేదో యిది పురాప్రాభవమ్ము
నాకు సాంత్వనమ్ముక వసంత ప్రతీక్ష! *

# గ్రంథ సమాలోచన

## ఆధ్యాత్మ రామాయణము.

[అనువాదకుడు శ్రీపురాణపండ రాధాకృష్ణమూర్తి గారు, కార్యదర్శి, అధ్యాత్మ ప్రచారసంఘము, జయశ్రీటాకీసు రోడ్డు, రాజమండ్రి-4 వెల 15 రూ.]

ఆదికవి యొక్క నిరంతర ప్రసన్న శైలము. అతని రామాయణ మొక మహా జీవనది. వాల్మీకిమహాకవి ముఖవినిస్సృతమగు రామాయణ మహా ప్రవాహము బహుముఖముల వ్యాపించినది. క్షేత్రానురూపమగు సస్యసంపదను పుష్కలముగ పండించుచున్నది. పండించును. అట్టి రామాయణ మహాప్రవాహమున కేర్పడిన యుపనదులలో అధ్యాత్మ రామాయణ మొకటి. రామకథాపూతము, నాధ్యాత్మికవిషయ వివరణప్రాజ్ఞము, నగుటచే, కథారంజకత్వముచే నిది వాల్మీకము తరువాత ప్రసిద్ధమైన దనవచ్చును. దీని కర్తృత్వవిషయమున వాదోపవాదములు అభిప్రాయభేదములు మిక్కిలిగా గలవు. దీని రచయిత లేక కవి ఋషి కాకున్నను తత్తుల్యుడని, భాషాప్రావీణ్యము కలవాడనియు, భావనాకౌశలము, ఆధ్యాత్మిక జ్ఞానపూర్ణత మున్నగునవి కలవాడనియు ననుటలో సందేహ మక్కరలేదు.

సంస్కృతభాషలో నున్న యిట్టి యుద్గ్రంథమును సంస్కృతము రాని వారికి సులభము చేయదలచి, యత్నించినారు శ్రీపురాణపండవారు. వీరివంశము ఇంటిపేరును సార్థకము చేసికొని పురాణ విషయములను పండించిన దనవచ్చును. వీరి యనువాదవివరణములు యథామూలములై సాగిన వనవచ్చును. భాషాశైలియు దాదాపుగ శిష్టవ్యవహారసమ్మితమైయున్న దనవచ్చును. మూలమునందలి శ్లోకమును తాత్పర్యముతో నిచ్చినచో పారాయణ పరాయణులకును బాగుగ నుపయోగించెడి. మూలము నందలి స్తుతులనైన (బ్రహ్మస్తుతి, కౌసల్యాస్తుతి, మున్నగునవి) యిచ్చినచో కొంతవరకైన పారాయణాసక్తుల కాకర్షకముగ నుండెడిది అధ్యాత్మిక రామాయణమును పారాయణము చేయువారు కలరుకదా !.

ఇట్టి గ్రంథముల ననువదించునప్పుడు భాష నిర్దుష్టముగా నుండుట యవసరము మరియు పుష్కలమైన భాషాచాతుర్యసంపత్తులు నవసరములే. మహద్గ్రంథము (పుట 18- గొప్పగ్రంథమను నర్థమున మహాగ్రంథ మనవలెను) రాజాహ్వనిత (37) పు- 'ఆహూత' యనవలెను) 49 పుటలో ఘోరరక్కసి (ఇట్టి సమాసము నిర్దుష్టము గాదు) 6?లో అప్సరాంగనలు, 138లో వివిధశాస్త్రాలు వంటివి పుష్కలముగా గలవు. మరియు. భగవన్, సత్పతే, సీతాపతే, ప్రియే, మహామాతే వంటి సంబోధనలు సంస్కృత భాషలో నిర్దుష్టములు. ఆంధ్రమున నైనచో సత్పతీ ! భగవంతుడా! ప్రియా! అను విధముగా నుండుట యుక్తము. మహాఅదృష్టవంతురాలు (150) పట్టు వస్త్రద్వయము (152) వంటివి కొంత బాధ కలిగించును. మనదేహ (మనో దేహమనుటకు) సవతిద్వేషాగ్ని (సపత్నీ ద్వేషాగ్ని 176 పు) శిరోపాదరహితుడు (198 శిరఃపాద) మనోప్రాణ (మనః ప్రాణ-103 పుట) వంటివి అధికృత వంటివి, సమస్త ఆకాశకాశములు (29 పుట, వంటివి పాఠకుని నిలువరించును.

ఇట్టివి కన్పడుచున్నను వీనిని పునర్ముద్రణములో సవరింపు కొనవచ్చును. ఇట్టియుద్గ్రంథములలోని భాష యించుకంతయుదాత్తముగా నిర్దుష్టముగా నుండదగును. కలికారు (128) వంటి పద ప్రయోగ ముదాత్తము కాదు.

భాషావిషయముగ కన్పడు నిట్టివానిని వదలినచో నిది జిజ్ఞాసువులకు మిక్కిలి యుపకరించు గ్రంథ మనుటలో సందేహము లేదు. దీని ప్రతులను లక్షసంఖ్యలో ప్రచారము చేయవలెనను వీరి యుద్దేశము ప్రశంసనీయము. అన్నవరము దేవస్థానము వారు పదివేలరూప్యములనిచ్చి నట్లు పేర్కొనిరి సుమారు 400 పేజీల యీ గ్రంథమునకు, దేవస్థాన సహాయమును బట్టియైనను వెలను తగ్గించినచో చాల బాగుండెడిది. వెల 15 రూ. అనుటచే కొంతమంది జిజ్ఞాసువుల కసౌకర్యముగా, దుర్లభముగా నుండును కదా !

వీరి ప్రయత్నము ప్రశంస నీయము. నాస్తికతా ధూయిష్ఠమగుచున్న దేశమున వీరి ప్రచురణలు సంజీవనివలె మన సంస్కృతికి, ధర్మమునకు ఉత్తేజకము లనుటలో సందేహము లేదు. వీరింకను నిట్టివానిని, నిర్దుష్టరమణీయముగా నిర్వహించి పాఠకలోకమునకు మహోపకారము జేయగల రనియు పరమేశ్వరుడు వీరి కందుకు వలయు సహాకారము నీయగల డనియు ఆశింపదగును. *

## నా చెల్లి

- శ్రీ మల్లావఝల కామేశ్వరరావు

*బంగారుతల్లియా నాచిన్ని చెల్లి
అందాలు విరబూసె విరజాజివల్లి ॥
*చిన్నారి నాచెల్లి చిరుతలౌ నవ్వులు
నింగిలో విరిసేటి నీలాలతారకలు
శోధలచిన్నారి ఆ చిట్టిన కునాలు
విరబూయు మందారముకరంద సౌరభాలు॥
ఆచిట్టికరముల వీడ్కోలు టా...టా లు
పడిలేచి పరుగెత్తు బుడిబుడి నడకలు
ముద్దులముచ్చటల్ ముత్యాలవలువలు
నాముది వెదజల్లు అమృతపు జల్లులు ॥

## కబీరు సూక్తులు

శ్రీ సామంతపూడి దశరథ రామరాజు, బి. ఏ. (లిట్)

*గురువు హరునికన్న గొప్పవాడు నేలర
దేవు చేయలేని తెలుపు గురువు
వానికైన నిడుదు వందనంబులు వేయి
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*వనములన్ని వ్రాతకును కలముగ జేసి
ధరణి యంత కాగితముగ జేసి
గురువుగుణము లెన్నొ గురుతింప శక్యమా?
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*నాభిలోనివాస నరయక కస్తూరి
మృగము పరుగులెత్తు మేయవనుల
లోని దేవు తెలియలేని నరునివోలె
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*అన్ని జీవులందు నారాయణుండెను
దయను వీడకోయి ధాత్రిలోన
దంతి, దోమలకు ను నంతరం బేమిగా
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*ఏటి బయట నిలచి ధ్యేడ్చిన దొరకవా
మునిగి దీయవలయు ముత్యములను
కఠినతపము జేసి కనుగొను రాముని
దీనిలోని నిజము తెలసి కొనుడి.

*తనువులోని శక్తి తగ్గిన తరువాత
రామపూజ చేయలేము కాన
మేలుకొనుము వేగ! మింటి కేగకముందె
దీనిలోని నిజము తెలిసికొనుము.

*కోర్కెలేర నరుని గొంతు పిసుకుచుండు
కోర్కెలేనివాడు గొప్పవాడు
వానికంటె చక్రవర్తి యిలను లేడు
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*జగమునంత వదలి స్వార్థంబు కాంక్షించి
వృద్ధుడయిన పిదప కృష్ణు బిలుచు
మంచి దినములందు మదమెక్కి తలపకు
దీనిలోని నిజము తెలిసికొనుడి.

*నింద చేయువాడె నిజమైన మిత్రుండు
వాని వలన తెలియు లోని దోసగు
సబ్బునీరు లేక సమసి పోదు మురికి
దీనిలోని నిజము తెలిసికొనుడి.

## ఊహాసుందరితో సూక్తులు

- శ్రీమతి కమలాదేవి, ఎం. ఏ.

*చెక్కిట చెంప జేర్చి నిను
చేరదు కోరిక లేను నాకు నీ
చక్కటి మోము సోయగపు
సంతత వీక్షణ కాంక్ష లే సఖీ
చుక్కల తేనిసన్నిధి వి
శుభ్రకళాన్విత వీవు మోహినీ!
ఎక్కడిదానవో సుమధు
రేక్షణ జీవన రాగవల్లరీ!

*పలుకుట వచ్చునా? మధుర
భావవిరాజితమైన మేనిలో
పులకల వెందుకే? పుడమి
బోధలు సేర్చరు నెవ్వరికి కల్
చిలుకలు హంసలై ప్రణయ
జీవన నందన సీమ పోదమా
పలుకు చువాడు చున్ కుసుమ
కోమలి జన్మ ఫలమ్మదే సుమా.

*రాగరంజిత లీలల రమ్యరజని
రసవధూ కరస్పృష్టమా రక్తిపోలె
మానసోత్తేజమును రేపి మరులుగొల్పె
హృదయ కుహరాన ఊహాలు హెచ్చరిల్లె.

*పాలకడలి నుద్గత లై నీవు పరమశుచివి
పుణ్యభావాలు రూపొందు పూత మతివి
క్రమ కవితా వినోద సంకలన రతివి
కాంక్షితానంద జీవన కల్పలతవు.

*గగన తారల కాంతులు సొగయుజిలుగు
విమల మైత్రిని వెల్గు వ వీనమధువు
నిష్కపటహాస శోభల వెగడు సుఖము
నీవుగా తోచునో సఖీ! సౌమ్యనమున.

*పసిడినవ్వుల పసిపాప పరవశతలు
పొన్న పువ్వుల వెన్నెల్లు పోలు పుగుబులు
పున్నమి లభించు హాయిలో పులకరింత
ప్రణయరస సిద్ధులకు మనోభావితములు.

—...—

## హితోపదేశము

- శ్రీ కమల్ నాథ్.

*తృణ మొక చేత న్నిడుకొని
తనమనమున రాము దలచి ధరణితనయ యి
ట్లనియెన్, కామాంధ్యమునన్
తనువు మరచి తన్న గోరు
దైత్యేంద్రునితోన్.

* ఏ వేళను విల్లు విరచె
నా వేళ నె రాముసతి నైతిని ధరలోన్
రావణ! పవిత్రురాలను
కావున నామాట వినుము,
కలుషము విడుమీ.

* రాగము వీడుము నాపై
పోగాలము దాపురించు పురుషుడయును నీ
లాగున్, చెడెదవు రావణ!
బాగుగ నా మాట వినుము
భాగ్యము కలుగున్.

* రాముడు లేని సమయమున
కామంబున దెచ్చినావు ఖలుడా! యపుడే
రాముడు చూచిన శరమున
నీమరణము కండ్ల జూచినినువవలును రా.

* దేవుని పూజలు సేయుము
దైవము నే నమ్ముకొన్న దానవుడా! నీ
కీ విపరీతపు చేష్టల
నీవిధముగ చేయవల దోయని యనుమ కలదా?

* ఈవిధమైన హితంబును
పావన బోధింపగ నియువని కనుగ్రుడ్లన్
రావణు డెఱ్ఱగ జేయుము
నావనితకు నిట్లు పలికె నాగ్రహవశుడై.

*మనసును మార్చుకొనుము రెం
డు నెలల గడు విచ్చుచుంటి.
లోకమువందున్
నిను మంచను నామాటను
వినకుండిన జానకి యని విసవిసనరియెన్.

—...—

విశేష ప్రచారముగల

# సమాలోచన పక్షపత్రిక

సంవత్సర చందా రు. 10 - 00 లు మాత్రము.

సంచిక ఒకటికి ముద్రణవ్యయం రు. 1-00 అగుచున్నది. సాహిత్య ప్రచారమునకై తక్కువ చందా నిర్ణయింపబడినది.

# సమాలోచన

1, 2 సంపుటములు ఒక్కొక్కటి సుమారు 120 వివిధ జాతీయ సాంస్కృతిక విషయముల రచనలు గలిగి హాఫ్ క్యాలికో బైండు చేయబడినవి. పోస్టేజితోసహా ఒక్కొక్క సంపుటము వెల రు. 18-00 లు ఎం. ఓ. చేసినవారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వి. పి. పద్ధతి లేదు.

ప్రతులకు :—

ఎడిటర్, 'సమాలోచన'
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్)
రాజమండ్రి-1. 533101.

---

ప్రకటన రేట్లు -*-

| | |
|---|---|
| కవరు 4 వ పూర్తి పేజీ | రు. 400 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 225 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 150 - 00 |
| లోపలి పూర్తి పేజీ | రు. 200 - 00 |
| ,, 1/2 పేజీ | రు. 110 - 00 |
| ,, 1/4 పేజీ | రు. 60 - 00 |

ప్రత్యేక కంట్రాక్టు రేట్లకు సంపాదకునిపేర వ్రాయవలయును.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.